# కథాలహరి



శ్రీ శివశంకర శాస్త్రి

సంకలిత సంపాదితము

ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ
రాజమహేంద్రవరము

గౌరవ సంపాదకులు:

శ్రీ తల్లావఝ్ఝల శివ శంకర శాస్త్రి

శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి

గౌరవ సహాయ సంపాదకుడు:

శ్రీ జనమంచి కామేశ్వర రావు

సంపాదకుడు:

శ్రీ బాలాంత్రపు సత్యనారాయణ రావు

# కథా లహరి

శ్రీ శివ శంకర శాస్త్రి
సంకలిత సంపాదితము

౧

ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ
రాజమహేంద్రవరము



అంకితము

శ్రీ మొక్కపాటి నరసింహ శాస్త్రికి



# అనుక్రమణిక

# కృతజ్ఞత

ఆధునికుల కథలు సేకరించి మూడు సంపుటములు ప్రకటించ తలచు కొన్నాము. అందులో ఇది మొదటిది. మూడవ సంపుటిలో స్త్రీల రచనలు ప్రధానముగా ముద్రిస్తాము. మొత్తముమీద యాభై అరవైమంది కథలు ఆంధ్రపాఠక లోకానికి అందించ గలమని ఆశ.

మా అనురోధమువల్ల శ్రీ శివ శంకర శాస్త్రి గారు తమకథ ఇందులో చేర్చినారు. ఇందులోకి కథ లన్నీ సేకరించి, సమకూర్చి, పీఠిక వ్రాసి ఇచ్చినందుకు శ్రీ శాస్త్రి గారికి మా వందనములు.

ఈ సంపుటిలో ప్రకటించడానికి మాకు అవకాశము కల్పించి అభిమానముతో తమకథలు మాకు దయచేసిన ఇందలి కథకు లందరికీ ఆంధ్రప్రచారిణీ వారి కృతజ్ఞతాపూర్వక వందనములు.

బాలాంత్రపు సత్యనారాయణ రావు

ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్
నవంబరు ౧౯౪౩

# పీఠిక

## ౧

ఆదినుంచీ భారతీయులకు అఖండ మైనకథాసాహిత్యము ధారావాహికముగా వస్తూనే ఉన్నది. సాహిత్యములో ఏశాఖలో నైనా ప్రశస్త మైన గ్రంథాలు ప్రథమమునుంచీ ఉండనే ఉన్నవి. రచనలో వైవిధ్యము భరతఖండము ప్రపంచానికి ప్రసాదించింది. సారస్వతచరిత్ర సక్రమముగా, సమగ్రముగా గ్రహించనివారు కథావిధానాన్ని పరదేశాలనుంచి మనము ఎరువు తెచ్చుకొన్నా మని భ్రమ పడతారు. అతిప్రాచీన మైనవైదిక యుగముతోనే కథాసృష్టి కనబడుతుంది. వేదసంహితలలోనే అక్కడక్కడ కథాఖండాలు గాని, ఖండకథలు గాని కానవస్తవి. బ్రాహ్మణములలో, ఆరణ్యకములలో, ఉపనిషత్తులలో ఉత్తమకథానకములు మధ్యమధ్య తగులుతూ ఉంటవి. ఉదాహరణార్థము, ఐతరేయ బ్రాహ్మణములో హరిశ్చంద్ర కథ చదివితే ఆశ్చర్యము కలుగుతుంది. పౌరాణిక హరిశ్చంద్ర చరిత్రకూ దానికీ తారతమ్యము చాలా ఉన్నది. వేదకథలో భాష, వాక్యరచన, వర్ణన, సంభాషణ, ఉపసంహారము అన్నీ ఉజ్జ్వలములు. బ్రాహ్మణాదిగ్రంథజాలములో కథాగమనము వివిధరీతుల విప్పారినది.

లోకములో వాగ్రూపముగా ప్రచారములో ఉండే కథాసముచ్చయాన్ను మధ్యమధ్య వ్యాసులు (సంపాదకులు) ఏర్చి, కూర్చి, సంస్కరించి సంగ్రహించి నామరూపములు కల్పిస్తారు. పాలి భాషలో ఉన్న "జాతక కథలు" ఇటువంటివే; బోధిసత్త్వుని ౫౫౦ పూర్వజన్మలను వర్ణించి, ధర్మాలను, నీతులను, లోకవ్యవహారాలను కథారూపములలో కమనీయముగా చెప్పినట్లు కనిపిస్తుంవి. వాటిలో భావాలు, విన్యాసాలు, విశేషాలూ

వాటికి ఒక్కొక్కదానికి ఉన్న రసదాశికి విలువ లేదు; నాలుగింటిం ఘనీభవించి ప్రస్ఫుట మైనరూపము పొందిన వని ఊహించవచ్చు. ఆకథలలో ప్రాచీన ప్రపంచము ప్రతిబింబించి భాసిస్తుంది. పాలి భాష వైదికలౌకిక సంస్కృత వాక్యాలకు గాని, లౌకిక సంస్కృత ప్రాకృతభాషలకు గాని మధ్యమార్గ ములో ఉన్న దని మనీషులమతము. కథాక్రమము సహజముగా సరళముగా ఉంటుంది. కొన్నికథలలో అక్కడక్కడా, ప్రతికథలోనూ అవసాన ములో విధిగా గాథ ఉంటుంది. గాథ అంటే ఒకవిధ మైనపద్యము. గద్య ములో వినుగు పుట్టకుండా మధ్యమధ్య పద్యము పలుకుతూ ఉంటే, ధారణకు సౌలభ్య మవుతుంది.

కథారచనలో ఆంధ్రులది అందె వేసినచెయ్యి. బృహత్కథానిర్మాత గుణాఢ్యుడు ఆంధ్రు డనిప్రతీతి. ఆయనరచనా కాలానికి ఆంధ్రభాష స్పష్టరూపములో లేకపోవడముచేత భూతభాషలో (పైశాచీ ప్రాకృతము) బృహత్కథ ఏడుసంవత్సరాలలో ఏడులక్షల గ్రంథముగా ఏడుభాగాలలో రచించినాడట. అరణ్యవివాసి అయినందునకు సిరా దొరకక పోవడము చేత నిజరక్తబిందువులతో నిఖిలగ్రంథము వ్రాసినాడట! ప్రచారార్థము ప్రభువు శ్రీసాతవాహనుని సన్నిధికి శిష్యులద్వారా కథ పంపితే అధిపతి అపహాస్యించుకొన్నాడు. ఆంధ్రుడికి మొదట ఆదరము కలగదు, క్రమేణ ఘనంగా గౌరవము జరుగుతుంది. నేటికి ఇంతే. గుణాఢ్యు డైనకథకచక్రవర్తి అటవిమృగాలకు ఆఖ్యాయిక వినిపిస్తూ చదివినపత్రమును చప్పున అగ్నిలో వెయ్యగా వెయ్యగా ఆరుభాగాలు దగ్ధమై పోయినవి! పశ్చాత్తాపము పొందినప్రభువు కడకు కథకుని గౌరవిస్తే చివరభాగము మిగిలినది. అదీ ఇప్పుడు దొరకదు. పురాతత్త్వవేత్తల భూరిపరిశోధనలవల్ల అదృష్టవశాన ఆవిర్భవిస్తుం దేమో ఏకాలానికైనా. క్రీస్తుశక పూర్వశతాబ్దినుంచీ, సోమదేవ, క్షేమేంద్రుల కాలమువరకూ పైశాచీగ్రంథము కొంతవరకైనా ప్రచారములో ఉంటుంది. వారు విడివిడిగా పైశాచీగ్రంథాన్ని సంగ్రహించి, సంస్కృతభాషలో

గాసరిత్సాగర, బృహత్కథామంజరులు రచించారు. ఆకథలలో అక్కడి దేశమే కాక, భరతఖండమే కాక, భరతవర్షభాగాలవిశేషాలు గోచరిస్తవి.

పురాణగ్రంథసందోహము అగాధ మైనఆకరము వంటిది. అందులో అనర్ఘకథారత్నాలు అనేకము ప్రకాశిస్తుంటవి. లోకములో రకరకాల ప్రకృతులలో పుట్టే బుద్ధులకూ, విపరీతసంశయాలకు, సంకటాలకు తగిన సమాధానాలు వాటిలో లభిస్తవి. కథాచ్ఛలముతో గంభీరతత్త్వము కమ్మనీయముగా ప్రతిపాదిత మవుతుంది. పురాణపరిశీలనవల్ల మానవబుద్ధి ఎంత దూరము వెళ్ళినదో విశద మవుతుంది. ఆకథావక్షములమీద చతుర్దశభువనాలలో వీరవిహారము చెయ్యవచ్చు. పురాణ ఉపపురాణాలు విశేషముగా అనుష్టుభ్ఛందస్సులో ఉన్నా, గద్యకు సమీప మైనపదకతో సరళసంస్కృతభాషలో సంతరించి ఉన్నవి.

పంచతంత్రకథాకోశాలు క్రమేణ బహులుదేరినవి. విష్ణుశర్మ ప్రభుపుత్రులకు రాజనీతి మృదువుగా బోధించడానికి పంచతంత్రము చెప్పినాడట. చిన్నకథలు ఏకత్ర చేర్చి పూసలలో దారమువలె ఏకభావము నిర్వహించినాడు. ప్రాయికముగా పుస్తక మంతా వచనరూపమే అయినా అక్కడక్కడ పద్యా లున్నవి. అప్పటికే చంపూగ్రంథపంథా ప్రారంభ మయినది. కొన్ని మార్పులతో ఈకథాసందోహాన్ని నారాయణభట్టు హితోపదేశ పద్యకావ్యము చేసినాడు. వీటిలో పశుపక్ష్యాదులకు మానవత్వము ఆరోపిత మయినది. ఆ జంతువులనూ మానవలోకమువలెనె ఉండి, ధర్మ, నీతి, లోకజ్ఞానములు కలిగిస్తూ, సంభావనావిరహము సంక్రమించ నియ్యదు. పంచతంత్ర కథానకాదులు ప్రపంచయాత్ర చేసి, పాశ్చాత్యకథలకు చాలావరకు మాతృక లయిన వని అమెరికా సంయుక్తరాష్ట్ర సంస్కృత విద్వాంసుడు Doctor Franklin Edgerton లిఖించినాడు.

జైనుల అర్ధకథలు అనేక మున్నవి. జినధర్మవిరుద్ధు లయినవారు ఆచార్యాదుల ప్రభావమువల్ల చివరకు జైనదీక్ష పొందడము ఈకథలలో

ప్రభావవిధానము. ప్రాకృతభాషలో ఉన్న కథలవల్ల అప్పటి దేశస్థితి గతులు, ఆచారవ్యవహారాలు, సమాజసందర్భాలు, జనులవిశ్వాసాదులూ విశద మవుతవి.

ప్రాకృతభేద మైనఅపభ్రంశ భాషలోకూడా కథాసాహిత్యము విరివిగా బయలుదేరింది. మహాపురుషులచరిత్రలు, ఘూర్జరప్రభువుల విక్రమలీలలు, సిద్ధుల చిత్రచర్యలూ మొద లయినవి ఆసాహిత్యములో వర్ణితములు. ప్రాయికముగా గ్రంథజాలము పద్యాలలో, పాటలలో ఉంటుంది. దానిప్రభావము కొంత ప్రాచీనాంధ్రసాహిత్యముమీద పడ్డట్టు గోచరిస్తుంది.

ప్రాచీనాంధ్రభాషలో ఏకథ లున్నవో స్పష్టముగా చెప్పడము కష్టము. ప్రజలవాక్కులలో ప్రచార మయ్యేకథలు ఉండి తీరుతవి. అవన్నీ వచన రూపంగా ఉన్న వనుకొన నక్కర లేదు. కొన్ని ద్విపదలుగానో, గేయ రూపంలోనో, కొన్ని సరళపద్యాలలోనో ఉంటవి. ఇప్పటికీ కొన్ని ముద్రితమై లభ్య మవుతున్నవి. కథనకావ్యాలలో కవితాపాటవముకన్న కథా కౌతుక ప్రధానము.

పంచతంత్రకథలు, బేతాళపంచవింశతి, శుకసప్తతి, హంసవింశతి ఇత్యాది కథాకావ్యాలు చాలా ఉన్నవి. వచనములో స్థలపురాణాలు, కైఫియత్తులు, కవిలెలు మొదలైనవాటిలో కొన్ని చరిత్రము లైనకథలు కనబడతవి. హంపీ-అనంతపుర రాజులకథల వంటివి భాషాకల్లోలములో బాగా అర్థము కావు. భోజకాళిదాసకథలు, చమత్కారకథాకల్లోలిని, కాశీమజిలీలు ఇత్యాదులు జనరంజకముగా ఉన్నవి. కథాసాహిత్యము గద్య పద్య గేయాలలో ఆదినుంచి అవిచ్ఛిన్నముగా వస్తున్నది.

రుచిభేదాన్ని బట్టి, కాలాన్ని అనుసరించి ఆధునికము అనేపద్ధతిలో కథ ఆంధ్రభారతిలో ప్రథమమున వచ్చిందని చెప్పవచ్చు. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య సంపాదకత్వాన 1912 లో బందరునుంచి బయలుదేరినది ఆపత్రిక. 1914 ప్రాంతాలలో తెనుగునుంచి మదరాసుకథలు అనే సంపుటి వెలువడ్డది. అక్కిరాజు ఉమాకాంతం 1914 లో త్రిలింగ మాసపత్రిక మదరాసులో ప్రారంభించి, కథలకు తావిచ్చినాడు. ఆంధ్రపత్రిక బొంబాయినుంచి మదరాసుకు వచ్చి దైనందిన ప్రచురణ ప్రారంభించిన తరువాత అప్పుడప్పుడు కథలు అచ్చువేసేది. అందులో సారస్వతానుబంధము ఆరంభమైనాక కథాసాహిత్యానికి కొత్త ఆకరము దొరికింది. చింతా భీమశంకరము కథారచనలో కొంత కృషి చేసినాడు. అయితే ఆయనరచనలు Sir Arthur Conan Doyle వ్రాసిన అపరాధనిరూపక కథలకు అనువాదప్రాయంగా ఉండేవి.

1915 లో కథకు ఆకారప్రకారాలు కొంతవరకు ఏర్పడ్డవని చెప్పవచ్చు. సాహితీ సమితి సభ్యులు తెనాలిలో 'ఆఖ్యాయిక' అనే మాసపత్రిక ప్రకటించడానికి ప్రయత్నించారు. యుద్ధసందర్భాలవల్ల పత్రిక బయటికి రావేలేదు. కాని మిత్రులు కథారచనలో గాఢమైనకృషి చేయడం సంభవించింది.

ఆంధ్ర, కృష్ణాపత్రికలలో అప్పుడప్పుడు ఒకటో, అరో కథలు వచ్చేవి. పత్రికలలో కాక విడిగా చిన్న చిన్న కథాగుచ్ఛములు కూడా కొన్ని బయలుదేరినవి.

1920 వ సంవత్సరము ఆంధ్రసాహిత్యచరిత్రలో ప్రస్ఫుటాక్షరాలలో లిఖించదగ్గది. సాహితి సమితి వారు 'సాహితి' పత్రికా ప్రకటన ప్రారంభించారు. ఇప్పుడు సుప్రసిద్ధులైనకథకులలో చాలామంది ఆపత్రికకు తమ రచనలు పంపేవారు. కథకు సౌష్ఠవము సాహితీ సమితివల్ల వచ్చిందని సహృదయుల అభిప్రాయము. ఆరచయితలు ప్రాచ్య, పాశ్చాత్యవాఙ్మ

జాడలు పఠించినవారు కానడము చేతను, సూత్రగ్రాహ్యకారయుక్తి, వ్యావహారికభాషలో చెప్పడము చేతను కథలు సజీవముగా ఉండేవి.

1922 ప్రాంతాలలో బందరునుంచి శారద, 1923, 24 లలో మదరాసు నుంచి కళ, భారతి, 1926 లో గుంటూరునుంచి 'సఖి' బయలుదేరినవి. కథకు గౌరవము కలిగింది. తరువాత పత్రికలలోను కథ ప్రకటించడం పరిపాటి అయిపోయింది.

## 3

భారతీయులకు కథనము ఉగ్గుపాలతో వచ్చినవిద్య అని పాశ్చాత్యవిమర్శకులు కేమాగు లిఖించినారు. ఆధునికవిధానములో కథ అఖండాలలో అమెరికాలో ముందు పుట్టిం దని విజ్ఞు లన్నారు. 1833 లో Edgar Allan Poe, 1840 లో Hawthorne, 1868 లో Bret Harte, 1871 లో Henry James, అమెరికా సంయుక్తరాష్ట్రాలలో అద్భుతముగా కథారచన వృద్ధి చేశారు. ఇంగ్లండులో 1677 నుంచి Robert Louis stevenson, 189J నుంచి Kipling వల్లను, కథ బాగా వికాసము చెందింది. గతశతాబ్ది మధ్యలోనే ఫ్రాన్సుదేశములో కథ విజృంభించింది. మపాసావారు కథనరచనలోను, కథానిర్మాణములోను గట్టివారు. ఆ కాలములో అనేక సారస్వత విధానాలకు వారే విధాతలు. రష్యా దేశములో కూడా కథ కళాస్ఫూర్తి చెందినది. ఈశతాబ్దిలో అన్నిదేశాల వారు అందులో ఆరితేరినారు.

పాశ్చాత్యుల కథనములో అవలంబించిన అన్నిపద్ధతులు ఆంధ్రులు కూడా అవలంబించినారు. కొందరు విశేషముగా అనుకరించినా చాలా మంది రచనలో స్వాతంత్ర్యము వహించారు. పశ్చిమకథాసాహిత్య సంతర్పణమువల్ల బాగా మార్పు చెందినవారి కథాధోరణి జనసామాన్యానికి అవగతము కావడము కష్టము.

మొదట మొదట మనకథకులు పరివర్తనములే బహుళముగా చేశారు. తక్కినరాష్ట్రాలకన్న వంగదేశమువారు కథారచన చాలా ముందుగా ప్రారంభము చెయ్యడంచేత బెంగాలీకథలు మనవారు ఆంధ్రీకరించారు. ఇంచుమించుగా మనతోపాటు హిందీవారు కథానికాసృష్టి సాగించినా, హిందీకథలు మనవారు తెనిగించారు. మహారాష్ట్ర కర్ణాటక ఉర్దూభాషలలోనుంచి కూడా కొన్ని కథలు ఆంధ్రవేషము ధరించినవి. కథకులు కొద్దిమంది పశ్చిమభాషలలోనుంచి బయలు పెట్టకుండా బహుళముగా అనువాదము చేశారు. కొంతకాలమునుంచీ మనకథలు కర్ణాటక తమిళ హిందీ ఆంగ్లభాషలలోకి పరివర్తితము లవుతున్నవి.

వేదకథలలో యజుర్వేద కథాసంగ్రహ మొకటి తెలుగులోకి వచ్చింది. శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రివంటి వేదార్థపరిశోధకులు వైదికకథలన్నింటినీ ఆంధ్రీకరించడం అవసరము. పాలిభాషలోనుంచి జాతకకథలు కొద్దిగా శ్రీ కిడాంబి రంగాచారి తెనిగించినారు. ఆయన, శ్రీ కొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి వంటివారు అన్నీ తెనిగిస్తే ఆంధ్రసాహిత్యానికి వన్నె వస్తుంది. అఖిల ప్రాకృతభాషాకోవిదు లైన శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి జైనుల అర్థకథలు కొన్ని పూర్వము తెలుగుచేసినారు. ఆయనచేతిమీదుగానే అర్థకథాసందోహము అంతా మనభాషలోకి వస్తే కథాశాఖకు సౌభాగ్యము సమకూరుతుంది. అపభ్రంశభాషలో ఉన్న కథకావ్యాలను శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వంటివారు సరళవచనములో వ్రాస్తే కథాసారస్వతము పరివృద్ధ మవుతుంది.

కథాశబ్దము జాతివాచకము. ప్రాచీనాలంకారికులు కథను గౌరవించి కథాభేదాలకు వివిధనామములు నిర్దేశించారు. ఆఖ్యాయిక, ఆఖ్యానము, ఆఖ్యా

లకము, కథానకము ఇత్యాది నామభేదాలు కనపడలేదు. సంస్కృతవాఙ్మయములో ఎంతో కథాసాహిత్యము లుప్తమైపోయింది. బాణభట్టు ఒకచోట, 'భట్టారహరిచంద్రస్య గద్యబంధో నృపాయతే' అన్నాడు. హరిచంద్రుని గద్యకావ్యము తలమానికమువంటి దని తాత్పర్యము. ఇప్పుడు దానిపేరు కూడా తెలియదు. సుబంధుని వాసవదత్త ఖండకథ, బాణుని కాదంబరి పరికథ, హర్షచరితము ఆఖ్యాయిక, దశకుమారచరిత, బృహత్కథ ఆఖ్యాయికలే. కథాసరిత్సాగరానికి కథ అనే నిర్దేశము. వాదీభసింహుని గద్యచింతామణి కూడా ఆఖ్యాయికాప్రాయమే. ఈవిధముగా కొన్నికొన్ని నామభేదములు గోచరిస్తున్నవి.

ఈకాలములో చిన్నకథను ఏ మనాలి? కథ జాతివాచకము కావడంచేత ఎటువంటి దైనా కథ అవుతుంది. విశిష్టమైన చిన్నకథను కథానక మనడము సమంజసము. బేతాళపంచవింశతిలో ఒక్కొక్క కథను కథానక మనే ప్రసిద్ధి. అయితే ఆరుసంవత్సరములకిందట శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి చిన్నకథకు కథానిక అని పేరు పెట్టినాడు.

> ఆఖ్యాయికా, కథా; ఖండకథా, పరికథా, తథా
> కథానికేతి మన్యంతే గద్యకావ్యం చ పంచధా—

అనే అగ్నిపురాణశ్లోకము ఉదహరించి కథానిక అందా మన్నాడు. ఆలంకారికనిర్వచనాలలో కథానికాశబ్దానికి ప్రాధాన్యము లేదు. ఖండిక, రూపిక, ఏకాంకిక- ఇత్యాది శబ్దాలు ప్రచారములోకి తెచ్చిన అస్మదాదులు శ్రవణసుఖ మున్నదని కథానికాశబ్దాన్ని ఆమోదించారు.

ఇక ఈరోజులలో రచితము లయ్యే రకరకాలకథలకు నామనిర్దేశ మెలాగు? కొన్ని సంస్కృత శబ్దములకు ఇంగ్లీషుపర్యాయపదములు ఇస్తే తెనుగువారికి తెలుస్తుంది!

టీవిప్రకారము కథానిక పెద్దది కాకూడదు. విషయాలు సంగ్రహించాలి. సంఘటనలు ఆశ్చర్యజనకాలు కావలె. కథాంతములో అద్భుతాపాదక మయినములుపు తిరగాలి. ఘటన సుఖాంతమూ కావచ్చు, దుఃఖాంతమూ కావచ్చు. మధ్యలో కరుణ సమ్మిళితము కావచ్చు. ఈలక్షణములో వైశాల్యము మెండు.

లోకములో ఎటువంటి సన్నివేశ మయినా, ఆదిమధ్యాంతాలలో సుఖదుఃఖాలు తిలతండులాలవలె గాని, క్షీరనీరాలవలె గాని, ఉండకతప్పదు. ఆదినుంచి అంతముదాకా కథ ఒకేధోరణిలో దుఃఖమయ మయినా, సుఖమయ మయినా సాగను లేదు. సందర్భాలలో సంఘర్షణా, తుల్యబల విరోధమూ ఉంటూ ఉంటే, కథాధోరణికి సోపాద మవుతుంది. ఇహలోకయాత్ర దుఃఖభూయిష్ఠ మయినప్పటికీ జీవితాన్ని కేవలదుర్దినమువలె ప్రదర్శించక ఎండావానలుగానూ, చీకటివెలుగులుగానూ చిత్రించడములోనే సిద్ధహస్తుడై ఆఖ్యానకుడు కావలె ఆర్ద్రహృదయుడు.

కథానికను సరళకథనములో నడపవచ్చు. సంభాషణక్రమములోనే సాగించవచ్చు. ఒక్కొక్కప్పుడు లేఖారూపకముగా లేఖలు తీర్చవచ్చు. దినచర్యసరణిలో దిద్దవచ్చు. దీర్ఘస్వగతరూపముగా చెప్పవచ్చు. ఈరీతు లన్నీ సమ్మిశ్రణము చేసి రచించవచ్చు. చైతన్యస్రవంతి (The stream of consciousness school) ఢంగులలో ప్రౌఢముగా గాఢానుభవాలతో గ్రథనము చేయవచ్చు.

రచయితలలో ఉన్నట్టే పత్రికలలో కూడా బాగా అధికారభేదము ఉన్నది. గ్రహణశక్తిని బట్టే కథావిధానముకూడా. ఏకథ కైనా కొన్ని సామాన్యలక్షణా లున్నవి. వాటిని గమనిస్తే కథ మధురముగా అంత మవుతుంది.

కథాబీజ మేదో ప్రథమములోనే నిపుణతతో నిర్ధారణ చేసుకోవాలి. కథోదయము చిత్తాకర్షకము చెయ్యాలి. కథాముఖములోనే కావ్యార్థ

సూచన గర్భీభూతము కావాలి. కథాపీఠములో దీర్ఘోపన్యాసాలైన వితర్కానములో వివిధగతులు తొక్కి క్రమేణా కథ గమ్యస్థానము చేరాలి. నవలికాప్రాయము లైనకథలలో కథాంతరాలకు అవకాశ మున్నది. కాని కథానికలో కథాంతరము విక్షేపహేతువై ఏకాగ్రతకు ప్రతిబంధక మవుతుంది. ఆదిమధ్యాంతక్రమము చూచుకొని విసుగు కలగకుండా విరమించడం రసజ్ఞతాహేతువు.

కథాముఖము ఏవిధముగా నైనా ఉండవచ్చును. కొందరు స్వగత రూపముగానూ, కొద్దిమంది వాకోవాక్యధోరణిలోనూ, మరికొందరు సూక్తి గానూ, మరికొద్దిమంది అర్థాంతరన్యాసములోనూ, ఆరంభిస్తారు. ప్రతీక లోనే- అంటే ప్రారంభవాక్య సందోహములోనే సూక్ష్మముగా నైనా క్షితిస్థాపన కావాలి. నిపుణత లేకపోతే ఆరంభదశలోనే కథ వదులుజడవలె వదవదలాడుతూ, ఆకర్షకము కాకపోతుంది.

కథాంతము కడుజాగరూకతతో నిర్వహించాలి. జనసామాన్యానికి పూస గుచ్చినట్టు కథ చెప్పి, కొలికిపూస ముడివేసినట్టు ముగిస్తేనే గాని మోదము కలగదు. పిట్టకథలలో, పిల్లకథలలో, పుక్కిటిపురాణాలలో "కథ కంచికి వెళ్ళింది" అని ఉపసంహారవాక్యము కూడా ఉంటుంది. అప్పటికి గాని అహృదయాలకు ఆనందము కలగదు. పూర్వము కాంచీనగరము సమస్త విద్యలకు, కళలకు ఆలవాలము. అన్నిశాఖలలో ప్రవీణులు అక్కడ సమావిష్టు లయ్యేవారు. కథ కంచికి వెళ్ళిందంటే అక్కడి కళావేత్తల అంగీకారముద్ర పొందిం దన్న మాట. అటువంటి కథాంతము వాచ్యరీతిలో జనాంగీకృతము. వ్యంగ్యవిధానములో ఉపసంహరిస్తే అనేకులకు అర్థము కాదు. ఆతరువాత ఏ మైన దని అడిగి తీరుతారు. అయితే అటువంటి ఉత్సుకత కలిగిస్తే కథ వ్యంగ్యవైభవముతో గ ట్టెక్కిం దన్న మాటే.

కావ్యానికి వలెనే కథకూ శరీరము, ఆత్మ విడదీసి విశదించాలి. శరీర మన్నప్పుడు భాష, వాక్యనిర్మాణము, వాక్యసందోహము, ప్రకరణాలూ

గము, కథాగమనము, నాయికానాయకాదుల నామకరణములు, గమన విధానము కొంత క్రొత్తదైనవి గమనించాలి. ఆపైన శరీరానికి లావణ్యమువలె కథకు శైలి కమనీయముగా ఉండేటట్లు రచించవలె.

కథానికలో వస్తువు, తద్విశేషాలు, భావాలు, భావపర్యవసన్నత, రసప్రతీతి—ఇవి ఐక్యముతో ఉండాలి. రచయితల రసికతను బట్టి హృదయాంగమత్వము గాని, దీప్తిరీతి గాని ఉద్దీప్తమై ఉంటుంది. కేవలబుద్ధివైశద్య విస్ఫూర్తికంటె హృదయాకర్షక మైనరసభావతత్పరత్వమే రమ్యతర మని రసికజనసమ్మతి.

ఇందులో చివరకథమాత్రము ఇతఃపూర్వము అముద్రితము. తక్కినవి సాహితి, సఖి, వీణ, ఉదయిని, గోల్కొండ, పత్రిక, భారతి పత్రికలలో పూర్వము ప్రకటితములు. ప్రథమ సంపుటిలో ప్రస్తుతము శైవకథలలో వైవిధ్యము విశేషము. ప్రకృతి వర్ణన, పల్లెటూరి జీవితము, పట్నవాసుల భావసాంకర్యము, బాలబాలికల పాఠశాలానుభవాలు, అరణ్యము, ఆఖేటము, హాస్యోద్దీపక సన్నివేశాలు, ఆకలిబాధ, అధమర్ణులవ్యథలు, సంప్రదాయసంఘర్షణలు చిత్రముగా వర్ణించి ఉన్నవి. భావవికాసానికి, మానసికోద్దీపనానికి ఉపకరించే ఉత్తమకల్పనలు ఉన్నవి. రాగము, రసికత, అసూయ, హృదయవాదానికి పదు నెక్కించే పరిస్థితులూ ఉన్నవి.

క్రమక్రమముగా భావిసంపుటములలో ఇంకా వివిధ కథల ఉదాహరణములు ఉంటవి.

శివ శంకర శాస్త్రి

సాహితీ సమితి
నవంబరు ౧౯౪౩

# గాధ

## శ్రీ శివ శంకర శాస్త్రి

౧

చిన్నతనాన బడి అనేమాట వినబడితే నాపంచప్రాణాలలో నాలుగు ప్రాణాలు ఎగిరిపోతూ ఉండేవి. "తెల్లవారకుండా ఎప్పుడూ రాత్రే అయితే బాగుండేది" అనుకొనేవాణ్ణి. "ఆడపిల్లగా పుట్టకపోతిని!" అని ఏడుస్తూ ఉండేవాణ్ణి. "ఎప్పుడు పెద్దవాడ నవుతానో!" అని తొందర పడుతూ ఉండేవాణ్ణి. ఈవూహాలు నాకు కాస్త మనశ్శాంతి ఇస్తూ ఉండేవి.

మాబడి నరకలోకము, పంతులు యముడు! పురాణాలలో యముడికీ మాపంతులకూ భేద మున్నది. పాపము చేసినవాళ్ళనే యముడు దండిస్తాడు; పంతులు పిల్లకాయల నందరినీ- తప్పు చేసినా, చెయ్యకపోయినా వధ చేసేవాడు: కుర్రవాళ్ళ ప్రాణాలుమాత్రము పోయేవి కావు.

మాపంతులు క్రూరుడు. పిల్లవాళ్ళు దుర్మార్గు లనీ, మోనగాళ్ళనీ ఆయన అభిప్రాయము. బాలుడికి ఉపయోగించే వస్తువులలో బెత్తము చాలా శ్రేష్ఠ మని చెప్పుతూ, తరుచుగా ఆఉత్తమపదార్థాన్నే ఆయన వాడుతూ ఉండేవాడు. పిల్లవాణ్ణి బాగా దండించి తరవాత పాఠము చెప్పడము ప్రశస్త మని ఆయనమతము. "దెబ్బకు దయ్యము పారిపోతుంది!" అని పంతులు చిరునవ్వు నవ్వేవాడు.

అటవిడుపురోజాకోసమూ, ఆయనకు అనారోగ్యముకోసమూ ఉవ్విళ్ళూరుతూ ఉండేవాణ్ణి. ఆయనకు జబ్బు చేసినట్టు నాకు జ్ఞాపకము లేదు.

నిజంగా ఆయనభార్య మంగళసూత్రము గట్టిది; కాకపోతే బడిపిల్లల తల్లితో వంతులు ప్రతిదినమూ వందసార్లు ప్రాణాలు విడుస్తూ ఉండవచ్చు! పదిహేనురోజుల కోసారి ఆటవిడుపు వచ్చేది. అయితే ఏమి? ఉల్లాసం ఉండేది కాదు. మరునాడు వడ్డీతో వధ జరుగుతుం దనేభయంవల్ల గుండె అదురుతూ ఉండేది.

వంతులకూతురిని పెట్టెబండిలో కూచోబెట్టి తిన్నగా లాగకపోయినా, ఆయన మాకు చెప్పినపనులు చెయ్యడములో ఏకొంచెము పొరపాటు జరిగినా, బడికి వెళ్ళడను కొస్త ఆలస్య మయినా, బెత్తము విరిగేలాగు దెబ్బలు తగిలేవి. వీటికితోడు అప్పుడప్పుడు మానాయనగారు దగ్గర ఉండి నన్ను కొట్టించేవారు. రానురాను బడి అంటే భయంకర మయి పోయింది.

౨

కాలము ఒకేవిధంగా ఉండదు. రెండేళ్ళకు ఒకనాడు నాకు బడినుంచి విముక్తి కలిగింది.

ఆరోజు ఉదయము భోజనము చేశాను. రోజూ తొందరగా భోజనము చేసేవాణ్ణి ఆనాడు నెమ్మదిగా అన్నము తిన్నాను. తిన్నతిండి ఒంటపట్ట లేదు. భోజన మయిన తర్వాత బడికి వెళ్ళవలెనే అన్నచింత బాధిస్తున్నది. చివరకు ఎలాగో తిండి తిన్నాను.

ఒళ్ళు నొప్పి లెత్తుతున్నది. గతసాయంకాలము తగిలిన దెబ్బలగుర్తులు ఇంకా కనబడుతున్నవి. దెబ్బ పడినచోట చెయ్యి తగిలితే నొప్పి పుట్టుతున్నది. వెనకటిరోజుసంగతి జ్ఞాపకము రాగానే ఒకవిధమైన భయము పుట్టసాగింది. కొంచెము సేపటిలో బడికి బయలుదేరవలసి ఉన్నది.

నేను ఇంట్లో ఉన్నపక్షాన పెద్దవాళ్ళు నన్ను బడికి పట్టుకొని పోతారు. ఎలా గయినా బడి ఎగగొట్ట దలుచుకొన్నాను. ఏమీ తోచింది కాదు.

ఇటూ అటూ పచారు చేశాను.

ఇంతలో నాకోసము ఇద్దరుపిల్లలు మాయింటికి వచ్చారు. అందులో ఒకడు నన్ను చూసి, "భోంచేశావా?" అన్నాడు. అన్నం పెట్టకుండా మావాళ్ళు నన్ను బడికి పంపించ రని వాళ్ళకు తెలుసు.

వాడు అడిగేసరికి కాస్త ఆలోచించి, "చెయ్యలేదు" అన్నాను. రెప్పవేసేలోగా వాడు నాకుడిచెయ్యి వాసన చూచి, "అన్నం తిన్నావురా!" అని నవ్వాడు. లాభం లేకపోయింది. నా కప్పు డేమీ తోచలేదు.

"రా, బళ్ళోకి, పంతులారు నిన్ను తీసుక రమ్మన్నాడు" అని రెండో వాడు వాడికి తోడయినాడు. నన్ను వా ళ్ళిద్దరూ బలవంతంగా బళ్ళోకి లాక్కుపోవడానికి ప్రయత్నించారు. నేను పుష్టి కలవాడను. అప్పటికి ఏడే ళ్ళయినా పదేళ్ళవాణ్ణి పడదోయగలశక్తి ఉండేది నాకు. వాళ్ళకు రెండు వడ్డించి పట్టు తప్పించుకొన్నాను.

మొదటివాడు కళ్ళెర్రజేసుకొని, "సరేలే. ఉండు. పంతులారితో చెప్పి నీపని పట్టిస్తా!" అని, రెండోవాడిచెయ్యి పుచ్చుకొని వెళ్ళిపోయినాడు. నిముషంసేపు నేను కొయ్యబొమ్మవలె ఉన్నా ననుకుంటాను. ఈగడబిడ మావాళ్ళకు తెలియదు. వా ళ్ళంతా దొడ్లో ఏవో పనులు చేస్తున్నారు. నేను నెమ్మదిగా సావడిలోకి వెళ్ళాను.

అక్కడ పెద్ద గాదె ఉన్నది. కొంచెముసేపు దానికేసి చూశాను. వెనకటిరోజు మానాయనగారు కొన్నితట్టలధాన్యము దానిలోనుంచి తీయించారు. ఇటూ అటూ చూసి, గాదెమీది మూత పక్కకు నెట్టి నెమ్మదిగా లోపలికి దిగి, మూత యథాప్రకారంగా మూసిపెట్టినాను.

లోపల దాక్కొన్నదిమొదలు నాఅవస్థ ఏమీ బాగా లేదు. వడ్లలో కూర్చోడంవల్ల ఒళ్ళు దురద పెట్టింది. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు తిన్నగా లేవు. లోపల చీకటి. కాని గాదెకు ఒకపక్కన ఉన్న చిన్నబెజ్జము కాస్త పెద్దది కావడంవల్ల కొంత వెలుతురు లభించింది. తర్వాత ఏ మవుతుందో

అవి గుండెలు తటతటా కొట్టుకొంటున్నవి. ఆబెజ్జములోనుంచి సావడి శ్రద్ధగా చూస్తున్నాను.

ఇంతలో మట్టెలచప్పుడు వినపడ్డది. జాగర్తగా చూచాను. మావదిన గారు వచ్చి సావట్లో కూర్చున్నది. ఆమెచేతిలో రెవిక, దారము గుచ్చిన సూదీ కనబడ్డవి. ఆవిడ రవిక కుట్టడం మొదలుపెట్టింది.

నాకు పెద్దచిక్కు సంభవించింది. ధాన్యపుదువ్వ ముక్కులో దూరడం చేత తుమ్ము వచ్చింది. గట్టిగా తుమ్మితే మావదినగారికి వినపడుతుంది. అందుచేత ముక్కు నులుపుకొన్నాను. అలా చేస్తే తుమ్ము రా దని విన్నాను. అయితే విడవకుండా వడ్లధూటు తగలడంచేత తుమ్ము అణుచుకో లేక, బిగబట్టి, చివరకు తేలికగా తుమ్మక తప్పింది కాదు.

స్తిమితము చెంది నేను బెజ్జములోనుంచి బయటికి చూచేసరికి గాదెమీద ఉన్నది మావదినగారిదృష్టి! "కాడు తెగింది!" అనుకొని అలాగే చూస్తూ ఉన్నాను. ఆమె లేచి నిలబడ్డది. గాదెదగ్గరికి వచ్చి నన్ను బయటికి లాగుతుం దనే నాభయము. ఆమె అక్కడే నిలుచున్నది.

ఈమె ఎందుకు లేచిందో అని నేను ఆలోచిస్తూ ఉండగానే నాకు ఒకకంఠస్వరం వినపడ్డది. ఆధ్వని నేను చాలాకాలము మరిచిపోలేదు!

"అమ్మా, మురారి యెక్కడున్నాడు?" అని పంతులు ఆమెను అడిగాడు. నేను ఊపిరి బిగబట్టినాను. ఆమె యేమీ మాటాడ లేదు. నాకు కాస్త ధైర్యం వచ్చింది. ఇంతలో ఆమె గాదెవైపు చేత్తో చూపించింది. నాగుండె గుబుక్కు మన్నది!

పంతులు నాజుట్టు పట్టుకొని లాగి, బెత్తముతో బాదుతూ బళ్ళోకి తీసుకు వెళ్ళినాడు. ఆరోజు నాకు తగిలినదెబ్బలు ఎన్నో చెప్పలేను. ఒళ్ళంతా వాతలే.

## 3

మధ్యాహ్నభోజనానికి నేను ఇంటికి వెళ్ళేసరికి గ్రామాంతరమునుంచి మా అమ్మమ్మ వచ్చింది. ఆవిడ నన్ను చూచి, "నాయనా, నీళ్ళు పోస్తా, రా. అన్నం తిందువు గాని" అన్నది. నేను స్నానానికి తయారయినాను.

అమ్మమ్మ నా ఒళ్ళు తోముతూ, "ఇదేమిటి రా, నాయనా, వంటి నిండా వాతలు!" అన్నది.

"పంతులు ముండాకొడుకు కొట్టాడు!" అన్నాను.

"వాడి చేతులు నేల బడ! వాడి చదువు చట్టుబండలు కాను! నేను వాణ్ణి కనుక్కుంటా ఉండు!" అన్నది ఆమె.

సాయంకాలము అమ్మమ్మ పంతులయింటికి నన్ను వెంటబెట్టుకు వెళ్ళి, "ఏమయ్యా! నీవు పిల్లలు కంటూవా? రాళ్ళు కంటూవా? ఒళ్ళంతా ఇదేమి వాత అయ్యా! చదువు లేకపోతే పీడాయిరి గాని పిల్లవాడు దెబ్బలతో చచ్చిపోయేటట్టున్నాడు! చాల్లే! ఇహ మా వాణ్ణి నీ బళ్ళోకి పంపించము!" అని గబగబా కేకలు వేసింది.

పంతులు నోరెత్త లేదు.

"పద, నాయనా, పద!" అని అమ్మమ్మ ఇంటికి తీసుకు వెళ్ళింది. ఆ తర్వాత నే నా బళ్ళోకి పోలేదు. దగ్గరపట్నంలో మా అక్క కాపురం ఉన్నది. అక్కడి పాఠశాలలో ప్రవేశించాను.

ఈవిధంగా నాకు విముక్తి కలిగింది.

గాడె కంటబడితే, వెనకటి సంఘటన ఇప్పటికీ నాకు జ్ఞప్తికి వస్తుంది.

# అరిసె ముక్కలు

శ్రీ వజ్ఝ బాబురావు

౧

మా నాన్నకు నేను పెద్దకుమార్తెను. నేను పుట్టినయేడోరోజునే మా అమ్మ బాలింతరోగము వచ్చి చనిపోయింది. ఆమె పోయినపదమూడోరోజునే మా నాన్న మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. నాకు బుద్ధి తెలిసేటప్పటికి మా సవతితల్లికి ముగ్గురుబిడ్డలు పుట్టినారు.

నాకు పదేళ్ళు వచ్చేదాకా మా నాన్న నా పెళ్ళిమాట తలపెట్ట లేదు. మా అమ్మమ్మ పదేపదే చెప్పడముచేత ఇక సాగ దని వరుడికోసము వెతకడము ప్రారంభించినాడు. ఆసంవత్సరము తగినసంబంధము కుదిరింది కాదని మరుసటిసంవత్సరము వైశాఖమాసములో చెయ్యవచ్చు నని మాని వేసినాడు. మరుసటివైశాఖములో మా సవతితల్లి ఖాయిలా పడ్డది. నాలుగు నెలలు మంచాన పడి తీసుకొన్నది. ఆ ఖాయిలాలో ఆమెకు వచ్చే ప్రాణము పొయ్యే ప్రాణముగా ఉండేది. చాలామందివైద్యులను పిలిపించాడు, చాలామందులు వాడినారు. అందులో భూతవైద్యులు తతంగాలూ, తంతులూ చేసినారు. వాటికల్లా రోగము తిరిగింది కాదు. గరళముకూడా చివరకు వాడినారు. కొన్నాళ్ళకు జబ్బు నెమ్మదిగా నిమ్మళించింది. ఆమె ఖాయిలాలో ఉండగా నా పెళ్ళిమాట ఎవరికి జ్ఞాపకముంటుంది! ఇంటికి చూడవచ్చినవారిలో మా అమ్మమ్మ మాత్రము మా సవతితల్లిజబ్బూ, ఇంట్లో ఇబ్బందులూ చెపుతూ నా పెళ్ళి ఇబ్బందికూడా వాటితో కలుపుతూ ఉండేది. వైశాఖమాసములో వీలు పడ్డది కాదు గదా అని మాఘమాస

ములో తప్పకుండా వివాహము చేస్తా"నని అన్నాడు. మానాన్న. "ఏ మాసములోనైనా డబ్బు ఖర్చు చేసి వివాహము చెయ్యవచ్చును. కాని మాస్థితిగతులకు తగినసంబంధము దొరకవద్దా?" అనేవాడు మానాన్న చాలాసార్లు. ఏవ్యావ్యవహారాలమీద ఆయనదగ్గిరికి వచ్చినప్రతివారూ, "బాబూ, అక్కడ సంబంధం వున్నది, ఇక్కడ సంబంధం వున్నది" అన్నచోటికల్లా కబుర్లు పంపి మానాన్న విచారిస్తూ వుండేవాడు. "ఈ సంవత్సరము మేము చెయ్యదలచుకోలే"దని కొందరూ, "అంతవారితో మేము వియ్యం పొందగలమా?" అని మరికొందరూ, "మాఘమాసానికి తొందరా లే"మని ఇంకొకొందరూ ఇచ్చేజవాబులు వస్తూవుండేవి. ఈ రాయబారాలతో మాఘమాసము సగపడ్డది. వరుడు ఎక్కడా దొరక లేదు. నా కప్పటికి పన్నెండేళ్ళు నిండినవి.

నన్ను చూసినవాళ్ళందరూ, "ఇంకా ఈపిల్లకు కన్నెచెర వదిలింది కాదు" అనేవాళ్లు. నేను కాస్త కొలుపొడుగుదాన్ని. పెళ్ళి అయిందా అనేమాట అడగకుండా చాలామంది నన్ను చూసి "కాపరానికి పెళ్ళిం దా? లేక ఈయేడు పంపుతారా?" అని మావాళ్ళతో అనేవాళ్ళు. ఇంట్లో మాఅమ్మమ్మగోల యెక్కువయింది. "ఇక అమ్మాయికి వివాహం చెయ్యకపోతే ఎలాగు?"అని మానాన్న స్నేహితులూ, చుట్టాలూ అన్నారు. ఆయన కేమీ తోచింది కాదు. "ఎక్కడైనా వరుడు దొరికితే బాగుం డును!" అని నిట్టూర్పు విడిచినాడు మానాన్న. చివరకు సమీపగ్రామములో సంబంధము కుదిరింది. ఎన్నోకట్నం మిస్తామనేటప్పటికి ఒకగృహస్థు తన కుమారునికి నన్ను వివాహము చేసుకోడానికి ఇష్టపడ్డాడు!

పెళ్ళికొడుకు కుదిరేదాకా నాకూ మనశ్శాంతి లేదు. "వైశాఖమాసము లోగా సంబంధము కుదిరితే సరే. లేకపోతే, దోవను పొయ్యేవాడిని పిలిచి నాలుగెకరాలు గట్టుపెట్టి ముడివేస్తా!" నని మానాన్న ఒకసారి అన్నప్పుడు నాప్రాణము చివుక్కుమన్నది. ఎటువంటిభర్త నాకు రాసి పెట్టి వున్నాడో అని దిగులుగా వుండేది. కుదిరిన పెళ్ళివారికి భూవసతి ఊరు

దనీ, కరిణీకము కల దనీ, తెలిసి లోలోపల సంతోషించాను.

అటుతరవాత పెళ్ళికొడుకు ఎలా వుంటాడో అని ఆందోళనం. పెళ్ళి వారిచుట్టాలనూ, వారిస్థితిగతులనూ గురించి మావాళ్లు చెప్పుకుంటూ వుంటే నేను గదిలోనో, గోతాల మెట్టచాటునో, నిద్రపోయేదానివలెనో వుండి వింటూ వుండేదాన్ని. పెళ్ళికొడుకుసంగతి ఎంత విన్నా ఇంకా వినవలె ననే వుండేది.

మాఅమ్మమ్మ నన్ను పెంచుతూ మాయింట్లోనే వుండేది. ఆమె పెళ్ళి కొడుకునుగురించి మానాన్నతో మాట్లాడుతూ, "అయితే నిుడు స్వామి వారిరథోత్సవమునాడు గుర్రమెక్కి వచ్చినవాడేనా నీఅల్లుడు?" అన్నది. ఆతిరునాళ్ళలో ఆయనను చూచాను; గాని ఆయన పెళ్ళికొడు కవుతా డని నా కేమి తెలుసు? తెలిస్తే బాగా చూచేదాన్నే అనుకొన్నాను. అయినా అప్పుడు చూసిన జ్ఞాపకము కొంచె మున్నది. ఆయనముక్కు, నోరు, కళ్ళు, చెవులు, ముందరిజుట్టూ జ్ఞాపకము తెచ్చుకోడానికి చాలా ప్రయత్నము చేశాను.

పెళ్ళిలగ్నము ఆరోజు కారోజుకు దగ్గిరికి వస్తున్నకొద్దీ మాయింట్లో పెళ్ళిపనుల అడావడి హెచ్చింది. మా పశువుల కొట్టా లన్నీ బాగు చేశారు. దొడ్డినిండా పెద్దపందిరి వేశారు. అప్పడాలు, వడియాలు, వచ్చుళ్ళు, ఊరగాయలూ తయా రయినవి. పప్పులు, బియ్యాలూ రకరకా లుగా తయారు చేయించి వంటయింట్లో బిడారు వేశారు. పెళ్ళిరోజుల్లో వర్షము వస్తుందేమో అని గాడిపొయ్యి సావడిలో తవ్వినారు. ఇంకా పెళ్ళి అయిదారురోజు లున్న దనగానే వంట అక్కడే చెయ్యడము ప్రారంభించారు. వివాహము రెండుమూడు రోజుల్లోకి వచ్చేటప్పటికి మాచుట్టా లంతా బళ్ళకిక్కి వచ్చారు. గంటలచప్పు డయినప్పు డల్లా వాకిట్లోకి వెళ్ళి చూచేదాన్ని. వచ్చినచుట్టాలతో మా పెద్ద మండువాయి ల్లంతా నిండిపోయింది. పెళ్ళికి కొత్తబట్టలు, పోకముడి, అడంగోలు ఇంకా

ఏకేవో సామగ్రులు మా తాత గుంటూరునుంచి తెప్పించినాడు. మా నాన్న గది ఆమూటలతో నిండిపోయింది. కొట్టుపెత్తనము మా సవతితల్లి అన్న గారిది.

రేపు లగ్న మనగా మావాళ్లు నన్ను పెళ్ళికూతురిని చేశారు, మరియిద్ద రిని తోడుపెళ్ళికూతుళ్ళను చేశారు. నానొసట కళ్యాణపుబొట్టు, బుగ్గను చుక్క, కాళ్ళకు పారాణీ పెట్టినారు. మావూరిమేళగాళ్లు వాయించారు. మాచుట్టాలు చీరెలు, రూపాయలు, ఉంగరాలూ చదివించారు.

పెళ్ళికూతురిని చేసిననాటి సాయంకాలము మామేనత్త, అమ్మమ్మ, మరోముసలమ్మ అరిసెలు వండుతూవున్నారు. అక్కడికి వెళ్ళి నేను పీట మీద కూర్చుని, వాళ్ళతో కబుర్లు చెప్పుతూ అరిసెముక్కలు తింటున్నాను. మామేనత్త కొడుకు వచ్చి నాసరసను నిలబడ్డాడు.

“అత్తా, రాముడికికూడా ఒక అరిసె ఇయ్యి; తింటూ వుంటాడు” అని నేనొకపీట చూపించాను. మాఅత్త అరిసె యిస్తూ “మారాము డింకా రెండేళ్లు పెద్దవా డయితే మాసుందరికి మొగు డయ్యేవాడే!” అన్నది. మామేనత్తకొడుకు నాకంటె ఏడ్నర్థము పెద్ద. నాయెత్తు వుంటాడో వుండడో. నే నెప్పుడూ సరసాలాడుతూ వుండేదాన్ని. రాముడు నాసరస పీటమీద కూర్చుని అరిసె తింటూ వుంటే నాచేతి కంటిననెయ్యి అతని బుగ్గలకు పూసి “రాముడూ, నీవు నాకు మొగుడి వయ్యేవాడివి కాబోలు!” అన్నాను. “చూడవే, అమ్మా, నెయ్యి రాస్తుంది. దీనికి బొత్తిగా భయము లేదు. పెళ్ళికొడుకుతో చెపుతా నుండు!” అన్నాడు. మాఅమ్మమ్మ మాఅత్తమాటకు “బ్రహ్మలిఖితము గదా” అన్నది. కొంతసేపు ఎవరూ ఏమీ మాట్లాడ లేదు. నేను అరిసెలవంట చూస్తూవున్నాను. ఇంతలో వాకిట్లో ఎద్దులగంటలచప్పు డయింది. “వెంకమ్మప్ప వచ్చిం దేమో చూడు” అన్నది అమ్మమ్మ. “రాముడూ, తిన్నది చాలు గాని వాకిట్లోకి వెళ్ళి చూతాము, రా” అని చెయ్యి పట్టుకొని అతన్ని లాక్కుపోయి వీథి గుమ్మముదగ్గర నిలుచున్నాను. మావెంకమ్మప్ప, పిల్లలూ దిగినారు. బండి

దిగుతునే మాఅవ్వ "ఏం రాముడూ, పెళ్ళికూతురికి తోడుజవానువా రేమిరా?" అన్నది. "సుందరిని పెళ్ళికొడుక్కి అప్పజెప్పేదాకా నేనే కావలి- ఎవరూ ఎత్తుకు పోకుండా!" అన్నాడు.

"మంచిబంట్రోతు అక్కయ్యా!" అన్నాను.

నేను నిద్దర లేచేటప్పటికి ఒకటే ఆడావడిగా ఉన్నది. వారినీ వీరినీ బిగ్గరగా పిలవడముతో అప్పటికే చాలామందిగొంతులు బొంగురుపోయి నవి. "పొయ్యి మండి పోతున్నది. దద్దివణ్ణాలకు బియ్యం కొలిపించండి, బాబూ!" అని వంటబ్రాహ్మణుడు అంటున్నాడు. మామామ మానాన్నతో "పొద్దెక్కుతున్నది. భజంత్రీలను రమ్మని, వూళ్ళో మనవాళ్ళను వలుగు రినీ పిలిచి రా. పెళ్ళివారు వూళ్ళోకి వస్తే వారికికోసం వెళ్ళడానికి తర్వాత తీరదు. బుచ్చమ్మా, వూళ్లో పేరంటం పిలవడానికి తొందరగా బయలు దేరు" అని మాసవతితల్లితో కూడా అన్నాడు. కొంచెంసేపటికి మా నాన్నా, అమ్మా, ఇంకా కొంతమందీ మేళముతో కలిసి భోజనాలకు పిలవడానికి ఊళ్లోకి వెళ్ళినారు.

లగ్నపత్రిక పురోహితుడి చేతి కిచ్చి ఆకిందటి సాయంకాలమే పెళ్ళి వారివూరికి పంపినారు. పెళ్ళివారు రావలసినవేళ సమీపిస్తున్నది. మామ చాకలివాడిని ఒకడిని పిలిచి "వరే, పెళ్ళివారు ఎంతదూరము వచ్చారో చూచి రారా" అని పంపినాడు.

నేను దొడ్లో అరుగుమీద కూర్చుని మొఖము కడుక్కొంటున్నాను. వీథిసావట్లో మామామ ఎవరితోనో పెద్దపెట్టున కేకలు వేస్తున్నాడు. పనులు చేస్తూ వున్నవాళ్ళంతా ఎక్కడిపనులు అక్కడే విడిచి పెట్టి సావ ట్లోకి పరుగెత్తారు. వంటచేస్తున్న బ్రాహ్మడు నన్ను చూసి "అమ్మా ఇక్కడలా కాకులా రాకుండా చూడు" అని చెప్పి, చెయ్యి కడుక్కొని

సావట్లోకి వెళ్ళినాడు. నేను ముఖము తుడుచుకుంటూ వుండగా వంటాయన తిరిగి గాడిపొయ్యిదగ్గిరికి వెళ్ళి, గరిటె తిప్పుతూ, "ఎంతపని జరిగింది! ఎంతసాహసము!" అన్నాడు. ఏదో దొంగతనము జరిగింది అనుకొని, 'ఏమి టండి?' అని అడిగాను నేను.

"లగ్నపత్రిక తీసుకువెళ్ళిన బ్రాహ్మడు వచ్చాడు. పెళ్ళివారు లగ్గానికి రా మన్నా రట!"

"ఏమైనా ఆటంకం వచ్చిందా?"

"ఆటంకం లేదు, వాళ్ళబొందా లేదు! మీవుల్లయ్యమామగారితమ్ముడు సీమకు వెళ్ళివచ్చినవారితో కలిసి భోంచేశాడట. అందుచేత మీమామకూ, ఆయన్నుబట్టి మీకూ వెలిట! స్నాతకము చేసుకుని లగ్గానికి బయలుదేర డానికి సిద్ధముగా వున్నవాళ్ళతో ఎవరో ఈసంగతి చెప్పారట. అందు మీద ఈసంబంధము అక్కరలే దన్నారట పెళ్ళివారు. పీటలమీది పెళ్లిళ్లు పాడుచేసే ముండాకొడుకులమాటలు పట్టుకొని ఈవెధవముండావాళ్ళు సంబంధం మానుకోవడ మేమిటి? పాపము బ్రాహ్మడు ఎంతప్రయత్నము చేసుకొన్నాడు! ఇంటినిండా చుట్టాలు దిగారు, ఊళ్ళో భోజనాలకు చెప్పి వచ్చారు. వంట అవుతూ వున్నవి. నట్టేట్లో పుట్టి మునిగినట్టయింది!"

నా కేమీ తోచింది కాదు. పెళ్ళి ఇలా ఆగిపోతుం దని ఎవ రను కున్నారు! సంగతి యేమిటో చూతా మని సావట్లోకి వెళ్ళాను. సావడి నిండా జనం మూగి వున్నారు. మ మామ కేకలు వేస్తూ ఇటూ అటూ తిరుగుతున్నాడు. ఆయనవంటినిండా చెమట పట్టింది. కొంచెము బొర్ర కలవాడు కావడముచేత మామ రొజుతున్నాడు. ఎక్కడివా ళ్ళక్కడ నిశ్చేష్టులై నిలబడ్డారు. మానాన్న ఖిన్నుడై స్తంభము ఆనుకొని, గడ్డము చేత్తో పట్టుకొని, ఆలోచిస్తూ నిలుచున్నాడు.

"సూరయ్యా, నీ విలా ఆలోచిస్తే కార్యం కాదు. ఆదొంగముండా కొడుకులు రా మన్నా రం కార్యం మానుకొంటామా యేమిటి? వాళ్ళ మొఖంమీద కొట్టినట్టు ఈలగ్నంవేళకే వివాహం చేయించకపోతే

నిరోగవువాణ్ణి కాను!'' అన్నాడు మామ.

ఆమాటలు విని మామామకు మతి పోయిం దనుకొన్నాను. పెళ్ళి కొడుకు లేకుండా పెళ్ళి ఎలా జరుపుదా మని ఆయనవుద్దేశమో అని నేను ఆశ్చర్య పడుతూ వున్నాను.

"నూరయ్యా, చేసినపని వ్యర్థ మౌతుంది. నలుగురిలోనూ నామోషీ. ఇప్పుడు పిల్ల పెళ్ళి జరగకపోతే, పిల్ల కేదో వంక అని నలుగురినోళ్ళలో పడుతుంది. అనక పస్తాయించిన లాభం లేదు. నామాట వినుం రాముడికీ సుందరికీ ఏడ్వర్థం వార ఉందికదా. వాడికి తలంటి నీళ్ళు పోసి, స్నాతకం కానివ్వండి. పదమూడుఘడియల పైచిలుకు దివ్య మైనలగ్నం ఉంది. ఆలగ్నానికి ముడి పెట్టుదాము'' అన్నాడు మామ.

మానాన్నముఖంకేసి చూస్తున్నాను. ఆయనముఖానికి తెలివి వచ్చింది. "సరే, జరుపుదాము'' అన్నాడు నాన్న. నేను ఇటూ అటూ చూచేటప్పటికి నాపక్కనే గోడ కానుకొని మాబావ నిలుచున్నాడు. ఆయన్ను చూచేసరికి నాకు ఎక్కడా లేనిసిగ్గు వచ్చింది. తొందరగా దొడ్లోకి వెళ్ళుదా మని బయలుదేరేటప్పటికి మాబావ నాకొంగు పట్టుకొని "ఎక్కడి నించి వచ్చిందే సిగ్గు!'' అన్నాడు. ఇంతలో మామ ఆయన్ని చూసి "మరదలితో తర్వాత సరసా లాడవచ్చు గాని ముందు ఇటు రా!'' అన్నాడు. ఒక్కపరుగున నేను గదిలోకి వెళ్ళి పడ్డా!

3

నేను మంచముమీద పడుకొని గోడమీది సావిత్రీసత్యవంతులబొమ్మ చూస్తూన్నాను. కొంచెంసేపట్లో నాకు కునుకు పట్టింది.

మెలుకువ వచ్చి నేను కళ్లు తెరిచేటప్పటికి మాసవతితల్లి నన్ను చేతితో తట్టుతూ, "సుందరీ, ఇక్కడ వున్నావటే! లేచి రా. తలంటి నీళ్లుపోస్తాను. [illegible] చేయుదువుగాని'' అన్నది.

కొంతసేపటికి మామ నన్ను తట్టలో కూచోబెట్టి సావట్లోకి ఎత్తుకు వెళ్ళాడు. సావడినిండా జనము కూర్చున్నారు. ఆడవాళ్ళంతా ఒకచోట నిలబడి వున్నారు. ఇద్దరు బ్రాహ్మలు మంత్రాలు చెప్పతూ కొత్తబట్ట అడ్డముగా పట్టుకొని నిలుచున్నారు. నా కాపొద్దున జరిగిన దేమీ జ్ఞాపకము లేదు. అయితే పెళ్ళికొడుకు ఎలా వుంటాడో చూతా మనుకొన్నాను. మాయిద్దరికీ మధ్య అడ్డముగా వున్నబట్టలోనుంచి పెళ్ళికొడుకురూపురేఖలు కనబడత వేమో అని ప్రయత్నము చేసి చూశాను. కొంతసేపటికి పీలగా ఆకారం కనబడ్డది. మరికొంతసేపటికి అడ్డంగా పట్టినబట్ట చప్పున తీసి వేశారు. పెళ్ళికొడుకు మామేనత్తకొడుకే. నాకు చాలా ఆశ్చర్యాం వేసింది. నే నింకా నిద్రపోతున్నా నేమో అనుకన్నాను. ఇలా అనుకొని ఒకసారి కళ్లు తుడుచుకునేటప్పటికి పెళ్ళికొడుకు లేచి నాకంఠాన మంగళసూత్రము కట్టినాడు. నాకు నిద్ర పట్టకముందు జరిగినసంగతు లన్నీ జ్ఞప్తికి వచ్చినవి.

ఆరాత్రి స్థాలీపాకము చేయించారు. తల వంచుకుని కూర్చున్నంతసేపూ పెళ్ళికొడుకును నఖశిఖపర్యంతము చూస్తూనే వున్నాను. అదివర కున్నట్టు లేరు వారు! పెళ్ళికొడు కయినదగ్గిరనుంచీ ఏమో వింతగా కనబడ్డారు.

మరునాడు మేజువాణీ. మే మిద్దరమూ పూలబంతు లాడినాము. ముత్తైదలు పాటలు పాడినారు. భోగముమేళముకూడా వున్నది. నామనస్సు వీటిమీద లేనేలేదు. పెళ్ళికొడుకు నాహృదయ మంతా ఆక్రమించుకొన్నాడు.

ఆరాత్రి అపోసను అయినతర్వాత నేను పెళ్ళి దొడ్డిఅరుగుమీద కూచున్నాను. అక్కడ ఎవరూ లేరు. ఇంతలోకే ఎవరో నాదగ్గిరికి వస్తున్నట్టు తోచింది. తిరిగి చూచేటప్పటికి పెళ్ళికొడుకు నాదగ్గిరిగా వచ్చి నిలుచున్నాడు. నేను లేవబోయినాను.

“ఏం, పెళ్ళికొడుకును అయినానా లేదా!” అని నవ్వుతూ అన్నాడు. సిగ్గుపడి పరుగెత్తినాను.

౪

నేను కాపరానికి వెళ్ళినతర్వాత చాలాకాలానికి మాఅత్తగారు ఒకనాడు అరిసెలు వండుతున్నది. నే నామెదగ్గిరిగా కూచుని తింటున్నాను. ఇంతలోనే మావారు సావట్లోనుంచి చప్పున వచ్చి నన్ను చూచి "నాకు కూడా అరిసెముక్కలు పెట్టించవూ?" అన్నారు.

నేను కూర్చున్నచోటినుంచి వెంటనే లేచాను. చేతిలో అరిసెముక్క కింద పడ్డది. నే నక్కడ నిలవక సావట్లోకి వెళ్ళినాను; నావెంటనే సావట్లోకి వచ్చి, "బుగ్గలకు నెయ్యి రాస్తావా యేమి?" అన్నారు.

పెళ్ళినాటి సంగతి జ్ఞాపకము వచ్చి నాకు చాలా సిగ్గు వేసింది. అరిసెలు వండవలసివచ్చినా తినవలసివచ్చినా ఇప్పటికీ నాకు అపరిమితమైన సిగ్గు! ఇంతలో మావారు నాదగ్గరకు వచ్చి, ఏమేమో నెమ్మదిగా నాచెవిలో అన్నారు. ఆమాట లేవీ నాబుర్ర కెక్కలేదు. ఈస్థితిలో మావారి బుగ్గలకు అప్రయత్నంగా నాచేతిజిడ్డు అంటింది!

౧౯౨౦

# గాన భంగము

## శ్రీ నోరి నరసింహ శాస్త్రి

౧

అష్టమిచంద్రుడు నడిమింట వెలుగుతున్నాడు. రుక్మిణి పెనిమిటి వచ్చేందుకు ఇంకా చాలాఆలస్యముంది. ఆమె దొడ్లో తులసికోటమీద కూర్చుని నెమ్మదిగా పాడుకొంటున్నది. ఆపాట సగము మాత్రమే వినవస్తున్నది. ఆమె చంద్రుణ్ణి తనకళ్ళకాంతితో వివశుణ్ణి చేయవలె ననుకొన్నదేమో! అటువైపే చూస్తున్నది. మాటిమాటికీ చంద్రుడిపేరు పలుకుతున్నది. అది చంద్రుణ్ణి పొగడేపాట అయి ఉంటుంది. అలా ఉన్న రుక్మిణికి అప్పుడు వాకిట్లో శ్రావ్యమైనసంగీతము వినబడ్డది. అగొంతు రాజగోపాలముది.

రాజగోపాలము చదువుకోడానికి తల్లితో ఆఊరు వచ్చి నాలుగేళ్ళయింది. అప్పటినుంచీ వీళ్ళయింట్లోనే వక్కభాగంలో అద్దెకున్నాడు. అతను సంగీతము బాగా పాడేవాడు. కంఠముసంగతి వేరే చెప్పనక్కరలేదు; కిన్నెరకంఠము. అతను సాయంత్రము ఇంటికి రాగానే ప్రతిరోజూ కొంతసేపు పాట పాడేఅలవాటు. రుక్మిణికి సంగీతమంటే చాలా ఇష్టము. రాజగోపాలం పాడేటప్పుడు ఆమె తప్పకుండా అక్కడికి వచ్చి వినేది. ఆమె వింటున్నకొద్దీ రాజగోపాలం ఉత్సాహంతో పాడేవాడు.

రాజగోపాలం సంగీతము వినబడగానే మామూలు చొప్పున రుక్మిణి వినడానికి వెళ్ళింది. అక్కడ రాజగోపాలమూ అతని తల్లీ తప్ప మరెవ్వ

రూ లేరు. రుక్మిణి సద్దుచేయకుండా పోయి రాజగోపాలం తల్లిదగ్గర కూర్చున్నది.

ఆరోజు రాజగోపాలం పాడుతున్నపాట మును పెప్పుడూ పాడింది కాదు. గానము కూడా ఎప్పటి కంటే మధురంగా ఉన్నది. ఆగానామృతాన్ని రుక్మిణి పరవశత్వముతో ఆస్వాదిస్తున్నది. రుక్మిణి రావడంచూసి రాజగోపాలం మరీ బాగా పాడుతున్నాడు.

మ బ్బేమీ లేక ఆకాశం నిర్మలంగా ఉన్నది. అంతటా ప్రశాంతముగా వెన్నెల కాస్తున్నది. ఆవినబడుతున్న సంగీతము రాజగోపాలముదో లేక అప్రశాంత సంగీతమేనో!

గీత మైపోయింది. కొంతసేపటికి సంగీతము కూడా నెమ్మదిగా ఆగింది. సంగీతం ఆగగానే ఎప్పుడూ లేనిది ఆరోజు రుక్మిణి ఒళ్ళు ఝల్లు మన్నది. ఆమె రాజగోపాలం వైపే చూస్తున్నది. కాని ఎప్పటిమల్లే లే దాచూపు ఆమె ముఖాన సిగ్గుతెర కప్పిన ట్లున్నది.

రాజగోపాలం తల్లి పెద్దది: పూర్వకాలపు మనిషి- పట్టి అమాయకురాలు. ఆమె, "నాయనా, రుక్మిణి నీపాట మొదటినుంచీ విన లేదు. మళ్ళీ ఇంకోసారి పాడరా, వింటుంది" అన్నది.

రుక్మిణి అమాటే అడగదలచి కూడా అడగ లేక ఊరుకొన్నది. అది రాజగోపాలం తల్లే అడిగినందుకు తనసంతోషము రుక్మిణి చిరునవ్వులో స్ఫుటంగా తెలిపింది. రాజగోపాలానికి రుక్మిణి తన సంగీతం వినడంకంటే కావలసిం దేమీ లేదు. రుక్మిణి కన్నుల వైపు ఒకసారి అతిప్రేమతో చూసి అతడు పాట మళ్ళీ ప్రారంభించాడు.

మురళి ముద్దిడు నీమోవి మురుపు జూచి
తమము తెర చీల్చి ప్రకృతి చైతన్య మూనె.
స్వరము వెలువడినంత గోపాలకృష్ణ,
పులకరించె బృందావన పుణ్యభూమి-

గోవులను వీడి యరుదెంచె గోపజనము
కుడుచుతేగల విడివచ్చె గోగణంబు
పరుగు పరుగున నీపాద పదము జేర
ప్రియుని విడనాడి వచ్చె గోపీమనోజ్ఞ!

యమునలో చేరు వారిలేశము విధాన
రాగమున నేక మైన స్వరమ్ము రీతి
తన్మయత నొంది కలసమస్తమ్ము విడిచి
లీనమైపోతి నీదివ్యగానసుధను!

రాజగోపాలం గీతము స్ఫుటంగా తెలుస్తున్నది. రుక్మిణిని సంతోష పెట్టడానికి అతను తన చేతనైనంత బాగా పాడుతున్నాడు. సంగీతము ఏ లోపములేక దివ్యముగా పాడవలెననే తప్ప అతని కప్పుడు వేరేస్మృతి లేదు. రుక్మిణి ఆ సంగీత తరంగాలమీద ఊగులాడుతూ పరవశమై తేలి పోతున్నది.

పాట మళ్ళీ ఐపోయింది. తర్వాత కొంత సేపటి దాకా వాళ్లు ముగ్గురూ ఆనాదానుభవంలో నిశ్శబ్దంగా ఉన్నారు. అప్పుడు రాజ గోపాలం తల్లి సంతోషంతో నవ్వుతూ, "ఇది కృష్ణమూర్తి వేణునాదాన్ని గురించి," అన్నది.

'అవును. ఇవ్వాళనే భాగవతంలో కృష్ణుడు వేణునాదం చెయ్యడం చదివినాను' అన్నది రుక్మిణి.

రాజగోపాలంతల్లి, 'ఆనాయన పిల్లంగ్రోవి ఊదుతూఉంటే వినడానికి గోపిక అంతా వచ్చేవాళ్ళుట. ఎక్కడెక్కడి ఆవులూ పరుగెత్తుకొని వచ్చే విట. చిన్ని కృష్ణుడు లోకాన్ని అంతా తనమాయతో కప్పివేసేవాడు.' అన్నది.

రుక్మిణి, 'మీ రాజగోపాలం చాలా బాగా పాడుతాడు. మరి ఇవ్వాళ వింటూంటే సాక్షాత్తు శ్రీకృష్ణమూర్తి జ్ఞప్తికి వచ్చాడు,' అన్నది.

తన కొడుకును పొగడినందుకు రాజగోపాలం తల్లి సంతోషించి, 'ఇవ్వాళ చాలా మంచి పాటే పాడినాడు.' అన్నది.

రాజగోపాలానికి ఆ రుక్మిణి మాటల్లో ఏదో చాలా ధ్వనించింది. తన కోరిక పక్వానికి వస్తున్నదని రుక్మిణి ముఖంవంక చూశాడు. రుక్మిణి చూపు వల్ల అతని ఆశ మరికొంత దృఢపడ్డది. ఎప్పుడూ గంభీరంగా ఉండే ఆమె చూపులో ఆరోజు రాజగోపాలానికి మార్దవం కనిపించింది.

రుక్మిణి, "బృందావనంలో యమునానదీతీరాన కృష్ణుడు కూర్చుని వెన్నెల రాత్రిళ్ళలో పిల్లంగ్రోవి ఊదుతుంటే గొల్లపిల్లలు ఆవులను కాయడము విడిచిపెట్టి వచ్చేవాళ్ళుట. ఆవులు దూడలను విడిచి వచ్చేవిట. అది ఇవ్వాళ రాజగోపాలం పాడినపాటలో కూడా ఉన్నట్లుంది. "గోవులను వీడి యరుదెంచె "ఏదీ?" అని రాజగోపాలాన్ని ఆ భాగం మళ్ళీ పాడమన్నది.

ఒళ్ళు పులకరించి, రాజగోపాలం అక్కడనుంచి గీతం పాడినాడు. అతనితో రుక్మిణి కూడా తన మధురకంఠం కలిపి పాడింది.

"పరుగు పరుగున నీపాద పదము చేర
ప్రియుని విడనాడి వచ్చె గోపీ మనోజ్ఞ!"

ఆ చివరిభాగం దగ్గిరికి వచ్చేసరికి రుక్మిణి కంఠం వణికినట్టునట్టుగా చదివింది. "అమ్మాయీ, నోరు తిరగడం లేదా!" అని రాజగోపాలం తల్లి అడిగింది.

ఆ మాటలకు రుక్మిణి ఉలిక్కిపడ్డది. ఆమె ఏమి జవాబు చెప్పుతుందో వినవలెనని రాజగోపాలం ఆతురపడుతున్నాడు. తన దౌర్బల్యము అతని తల్లి తెలుసుకున్నదా అనే క్షోభలో క్షణం గడిపి రుక్మిణి స్థైర్యము తెచ్చుకొని, "ఆడవాళ్ళకు మరి నోరు బాగా తిరుగుతుందా!" అని తప్పించుకొని, "పాట మహా బాగున్నది. రాజగోపాలం! నాకు కొంత అది వ్రాసిపెడతావా?" అన్నది.

గోపాలం నవ్వుతూ "పాట వ్రాసిపెడితే ఏమిస్తావు?" అని చిన్నగ అన్నాడు.

"ఏమి కావలె నంటే అది ఇస్తాను."

"ఏమి కావలె నంటే అదే ఇస్తావా?"

"ఇస్తా!"

"ఏం కావలె నన్నా అనేవ్వుడు ఏం అని ఒత్తి పలికినాడు రాజ గోపాలం.

"ఏం కావలె నన్నా!" అని జవాబు చెప్పింది.

"నీకళ్ళవంక చూడని య్యేడంకంటె మరేమీ అక్కర లే!" దని మనసులో అనుకొని, బహిరంగంగా "నవ్వుల కన్నాను. అట్లాగే రేపు మధ్యాహ్నం వ్రాసిపెట్టుతాలే" అన్నాడు.

రుక్మిణి సంతోషించి "మళ్ళీ పాట పాడు" అన్నది. అతను పాడుతున్నాడు. చంద్రుడు చల్లటివెన్నెల కురుస్తున్నాడు. రుక్మిణి కలవరిస్తున్నట్లుంది. వీధితలుపు చప్పుడయింది. కలవరించా ననుకుంటూ రుక్మిణి పెనిమిటికి తలుపు తీయడానికి పరుగెత్తుకు పోయింది. పాట కాగానే రాజ గోపాలం లేచి భోజనానికి వెళ్ళాడు.

౨

రుక్మిణి పెనిమిటికి రెండో పెళ్ళి. ఆయన ముప్పయి అయిదో యేట మొదటిభార్య పోయింది. విరక్తిచేత పెళ్ళి చేసుకోనని ఆయన కొన్నాళ్ళు పట్టు పట్టినాడు. చివరకు ఒప్పుకోక తప్పిందికాదు. త్వరలోనే ఆయన రుక్మిణిని పెళ్ళిచేసుకున్నాడు. ఆ పెళ్ళిలో వరకట్నమే లేదు. రుక్మిణి తల్లి దండ్రులకే కొంతధనం ముట్టిం దని- నిజమో, అబద్ధమో కాని- వదంతి మాత్రం ఉన్నది.

రుక్మిణి కాపరానికి వచ్చి అయిదే ళ్ళయింది. ఆసంసారంలో కలత

అనేదే లేదు. పెనిమిటి అంటే రుక్మిణి చాలా భయభక్తులతో ఉపచారం చేస్తుండేది. నలభైయేళ్ళు దాటినా తనభర్త పెద్దవాడని ఎవ్వరినీ అననిచ్చేది కాదు. ఆ భార్యాభర్తలు అదృష్టవంతులని అందరూ అనేవాళ్లు.

రాజగోపాలమూ, తల్లీ వచ్చి వాళ్ళయింట్లో ప్రవేశించి నాలుగేళ్ళయింది. మనస్సులు బాగా కలిసి వాళ్ళు ఒకరి కొకరు సహాయంగా ఉండేవాళ్ళు. చాలా కాలమునుంచీ కలిసి ఉండడంచేత బంధువులకంటె ఎక్కువ స్వతంత్రంగా నీవు నీవు అని పిలుచుకొనేవాళ్లు. రాజగోపాలమూ రుక్మిణీ, అన్నా చెల్లెలూవలె సిగ్గుపడకుండా మాట్లాడుకునేవాళ్లు.

రుక్మిణి చాలా అందగత్తె. అందమంతా ఆమెకళ్ళల్లో మూర్తీభవించి ఉండేది. చూచినవాళ్ళంతా ఆమెకళ్ళల్లో గొప్పతేజస్సు ఉన్నదనేవాళ్లు. ఆకళ్ళు చంచలమైనవి కావు; ఎప్పుడూ శాంతముగానూ, గంభీరముగానూ ఉండేవి.

ఆమెకళ్ళు రాజగోపాలాన్ని ఆకర్షించక ఊరుకోలేదు. కాని అతను అక్కడికి వచ్చిన నాలుగేళ్ళదాకా అవి తనను ఆకర్షించినట్లు తెలుసుకోలేదు. మొదటినుంచి అవి అతన్ని ఆకర్షిస్తూనే ఉన్నవి. అంతకంతకు వాటి ఆకర్షణబలం పెరిగింది. తాను రుక్మిణిని ప్రేమిస్తున్నానని తెలుసుకున్నతర్వాత మనస్సు మరలించుకోవలెనని అతను ఎంతో ప్రయత్నం చేశాడు. అటునుంచి తప్పించవలెనని ప్రయత్నం చేసినకొద్దీ అతనిమనస్సు ఆమెవైపు మరింత వెళ్ళేది. ఆవాగులో దిగినతర్వాత దానికి ఎదురీదడం అతనితరం కాకపోయింది.

రుక్మిణికి తనపైన ప్రేమ ఉన్నదేమో తెలుసుకోవలెనని రాజగోపాలం చాలా ప్రయత్నించాడు. ఆమె ప్రతిరోజూ అతనిపాట వినడానికి వచ్చేది. ప్రతిదినమూ వాళ్ళు ఇదీ అదీ మాట్లాడుకునేవాళ్ళు. రుక్మిణి ఎప్పుడూ గంభీరంగా ఉండేది. రాజగోపాలం ధైర్యం చాలక తనప్రేమ ఎప్పుడూ ఆమెకు సూచనగాకూడా తెలియజేయలేదు. రుక్మిణికి ప్రేమ తలంపు కూడా ఉండేది కాదు.

చివరకు ఆసంగీతము పాడినరోజున రుక్మిణికి తనపైన ప్రేమ పుట్టినట్లు తెలుసుకొని రాజగోపాలం సంతోషించాడు. అప్పటిదాకా శాంతముగా ఉండే రాజగోపాలం మనస్సు ఆపైన నిలవలేకపోయింది. ఎప్పుడు తెల్ల వారుతుందా, ఎప్పుడామెకు పాట వ్రాసిపెట్టుతానా అనే ఆత్రంలో అతనికి ఆరాత్రి కూరుకు పట్టలేదు. మర్నాడు తనప్రేమ అంతా రుక్మిణికి తెలియజెప్పేందుకు తెల్లవార్లూ మాటలు ఆలోచించుకుంటూ పడుకున్నాడు.

## 3

మర్నాడు మధ్యాహ్నం గదిలో కూర్చుని రాజగోపాలం పుస్తకం చూస్తున్నాడు. పుస్తకంవంక చూస్తున్నాడే కాని అతనిమనస్సు అక్కడ లేదు. ఎక్కడన్నా చీమ చిటుక్కు మంటే తలుపు తీసి చూస్తున్నాడు. కాస్తసేపే చాలాసేపుగా కనబడుతున్నది. ఎంతసేపు ఎదురు చూసినా రుక్మిణి పాట వ్రాయించుకోడానికి రావడం లేదు.

కొంతసేపటికి అడుగులచప్పుడు వినవచ్చింది. ఆత్రంతో రాజగోపాలం తలుపు తెరిచి చూశాడు. ఆవచ్చింది అతనితల్లి! ఆమెను చూసి తొందర అణచుకొని, 'ఏ మమ్మా!' అన్నాడు.

'అబ్బాయీ, ఇవాళ పొద్దు కూకేదాకా పురాణం చదువుతా రట. ఆబ్రాహ్మడు పుస్తకం బాగా చదువుతున్నాడు. నేను వచ్చేటప్పటికి కాస్త ఆలస్య మవుతుంది. ఎక్కడికీ వెళ్ళక, ఇంట్లోనే ఉండు,' అని ఆమె కుమారుడికి ఇల్లు అప్పగించి పోయింది.

రాజగోపాలం పుస్తకం అవతల పారేసి ఇటూ అటూ తిరుగుతున్నాడు. అకస్మాత్తుగా గదితలుపు తెరుచుకున్నది. అప్పుడు రుక్మిణి స్వతంత్రంగా గదిలోకి వచ్చి, 'ఇప్పుడు పాట వ్రాసిపెడతావా!' అని అడిగింది. రాజ గోపాలం సరే అని, విడిగా పెట్టి ఉన్న కాగితమూ, కలమూ పట్టుకొచ్చాడు.

రుక్మిణి చిరునవ్వుతో, 'పాపం! నాకోసము కాగితమూ, కలమూ సిద్ధంగా పెట్టుకున్నట్టున్నావు. విడికాగితముమీద వ్రాస్తే ఇక్కడా అక్కడా పడిపోతుంది. నాపాటల పుస్తకంలో వ్రాసి పెట్టు' అన్నది.

రాత్రినుంచీ అందా మనుకొన్నమాటల్లో ఒక్కటీ అనలేక పోయినాడు రాజగోపాలం. మంత్రగానిచేతుల్లో బొమ్మవలె అతను ఇంట్లోకి వెళుతున్న రుక్మిణివెంటనే బయలుదేరి పోయినాడు.

వాళ్ళు వెళ్ళేటప్పటికి సావట్లో చిరుచాపమీద కలమూ సిరాబుడ్డీ సిద్ధంగా పెట్టి ఉన్నవి. తనపాటల పుస్తకము తెచ్చి రుక్మిణి రాజగోపాలాని కిచ్చింది. అతను చాపమీద కూర్చుని గీతము వ్రాస్తున్నాడు రుక్మిణి నవ్వుమొగంతో అతని పక్కనే కూర్చుని, అతను వ్రాస్తున్న గీతము మెల్లిగా పాడుతున్నది.

నాలుగుబంతులు వ్రాయడ మయింది. రాజగోపాలం అయిదోబంతి వ్రాయబోతున్నాడు. రుక్మిణి చెయ్యి అడ్డంపెట్టి, 'నే నడిగేదానికి జవాబు చెప్పు,' అన్నది.

రాజగోపాలం పుస్తకం కింద పెట్టి 'నీప్రశ్న ఏమిటి?' అన్నాడు.

"నీ కిప్పు డెన్నేళ్ళు?"

"ఇరవై రెండేళ్లు."

"చాలాసంబంధాలు తిరిగి పోతున్నవి కదా, ఈయేడు వివాహం చేసుకోవా?"

రాజగోపాలం సిగ్గుతో కొంతసేపు జవాబు చెప్పక చివరకు ఆమెవైపు తల యెత్తి, "చేసుకోను" అన్నాడు.

రుక్మిణి గంభీరముఖంతో అతన్ని చూసి, "పెద్దవాడి వయ్యేదాకా ఉండబోకు. చిన్నవాళ్ళు పెద్దవాళ్ళను చేసుకుంటే సుఖపడరు!" అన్నది.

"నీవు సుఖపడడం లేదా?" అనేప్రశ్న మాటిమాటికీ రాజగోపాలానికి నోటిదాకా వస్తున్నది. ఆమాట అంటే రుక్మిణి సంతోషిస్తుందో!

నుచ్చుకొంటుందో! ఆమెముఖాన గాంభీర్యము ఎంతకూ తగ్గ లేదు. ఆ మాట విగ్గరగా అనడానికి సాహసించక రాజగోపాలం పుస్తకం తీసుకొని మళ్ళీ వ్రాయ మొదలు పెట్టినాడు.

ఇంకో నాలుగు బంతులు వ్రాయడ మయింది. రుక్మిణి అతనిచేతిలో నుంచి పుస్తకం లాక్కొని అతనివైపు తిరిగి బహు శ్రావ్యంగా పాడింది. అది పాడేటప్పుడు ఆమెకళ్ళు అభినయం చేస్తున్నట్టు అతనికి తోచింది. రాజగోపాలం ఆనందంలో వివశు డయినాడు. ఏమేమో మాట్లాడవలె ననుకొంటాడు; కాని ఎంతకూ అతనినోట మాట రాదు. చివరకు అతను అతిప్రయత్నంమీద వినీ వినపడకుండా ఇంకోసారి'' అన్నాడు.

రుక్మిణి చిరునవ్వు నవ్వి ఇంకోసారి పాడింది. ఈమాటు పాడేటప్పుడు అభినయం మరింత స్ఫుటంగా కనిపించింది. పాట కాగానే ఆమె, “సరీగా పాడినానా?” అని అడిగింది.

రాజగోపాలం ఆమెముఖాన్ని, తదేకదృష్టితో చూస్తూ మెల్లిగా, “దివ్యంగా ఉంది” అన్నాడు.

ఆమాటలు రుక్మిణి వినిపించుకోక నవ్వుతూ, “ఎప్పుడూ అట్లా మాట్లాడకుండా నాకళ్ళవంకే చూస్తా వేం? నాకళ్ళకు దిష్టికూడా తగులుతుందేమో!” అన్నది.

రాజగోపాలం ఉలిక్కిపడి వణుకుతూ చప్పున తల వంచుకున్నాడు. రుక్మిణి పక్కున నవ్వి తనచేత్తో అతనివీపు తట్టి, “భయపడకు! ఇట్లా అయితే రేపు కాపుర మెలా చేస్తావు!” అని అతనిచేతికి పాటల పుస్తకమిచ్చి, పాట పూర్తి చెయ్య మన్నది.

పువ్వువంటి ఆమెచెయ్యి తనవంటికి తాకగానే ఒక్కక్షణంసేపు రాజగోపాలం పరవశత్వం పొందినాడు. కాని రుక్మిణిమాటలకుమాత్రం చాలా సిగ్గు పడి వంచిన తల యెత్తకుండా, ‘భయ మేమిటి’ అంటూనే మళ్ళీ గీతము వ్రాస్తున్నాడు.

వ్రాయడం పూర్తి కాగానే 'అయింది' అని రాజగోపాలం కలమూ పుస్తకమూ నెమ్మదిగా కింద పెట్టాడు.

'అప్పుడే అంతా అయిపోయిందా? అందులో తప్పులు లేకుండా చూడు' అన్నది రుక్మిణి. చదివి చూసి తప్పు లేమీ లే వన్నాడు రాజగోపాలం.'

రుక్మిణి అవ్వూ డాపుస్తకం తీసుకొని 'అంతా ఇదేనా! అంటూ రెండు మూడుసార్లు చదివి చూసుకున్నది. తప్పు లేమీ లేవు.

ఇంతలో వీధితలుపువద్ద కొద్దిగా అలికిడి అయింది.

'ఇక వెళ్ళేదా!' అని రాజగోపాలం లేచి వెళ్ళబోతున్నాడు.

రుక్మిణి అతన్ని ఆపి "కొస్త ఆగు. పాట వ్రాసినందుకు ఏమిమ్మ మంటావు?' అన్నది.

'నీకు పాట వ్రాసి యిచ్చినందుకు ఏం తీసుకుంటాను?'

'నిన్న అడిగిలివి కాదూ? ఏం కావలెనో అడుగు.'

'నాకు కావలసింది ఏ ముంది? నిన్న నవ్వుల కన్నాను.'

'నిన్న అన్న మాట నవ్వులకేనా? నీకు కావలసింది ఏమి లేదా?'

రుక్మిణిస్వరం కఠినంగా ఉన్నది. రాజగోపాలం 'లేదు' అనలేకపోయినాడు; కొంతసే పుండి తల యెత్తి ఆమెను సాభిప్రాయంగా చూచి 'అక్కళ్ళ...' అని ఏదో గొణుగు కున్నాడు.

రుక్మిణి ముఖం పై కెత్తింది. రాజగోపాలంపెదవి ఆమెకళ్ళను తాక బోతున్నది. వీధితలుపు పగిలేట్లు దడదడా చప్పు డయింది. రాజగోపాలం మెల్లిగా తన గదిలోకి వెళ్ళిపోయినాడు. రుక్మిణి పెరిమిటికి తలుపు తీసింది.

'మునుపు శాస్త్రసంగీతం పాడేవాడివి. ఇప్పుడు పాడనే పాడడం లే దేమిరా!' అని ఒకనాడు సాతుంత్రము తల్లి రాజగోపాలాన్ని అడిగింది.

'పరీక్షలు వస్తున్నవి కాదుటే అమ్మా.' అన్నాడు రాజగోపాలం.

# చిన్న

## శ్రీ చింతా దీక్షితులు

"బావను పెళ్ళాడుతావుటే చిన్నా!" అన్నాడు దంతధావనము చేసుకుంటూ కూతురుకేసి చూసి సుబ్బయ్యగారు. కూతురు పిండిబుట్ట చేతితో పట్టుకొని వీథిలో సంక్రాంతిముగ్గులు పెట్టుతూ వున్నది. కూతురుముద్దుపేరు చిన్న; అసలుపేరు మహాలక్ష్మి. పదేళ్ళపిల్ల. మిరియపుగింజలాగ చురుగ్గా పనిపాటలు చేస్తూవుంటుంది. చాలా లక్షణవతి. పులు గడిగిన ముత్యములాగ వున్నది. చేరెడేసికన్నులు, దబ్బపండులాంటి శరీరచ్ఛాయ, ఎర్రగా మతాబాలాగ వుంటుం దని పెళ్ళియీడుకమాళ్ళ తల్లులు అనుకోవడం కద్దు.

తండ్రిమాట వినడంతోనే చిన్న చిరునవ్వు నవ్వుతూ తల యెత్తింది. వీథిలో ముగ్గులు ఎంతో ఓపికగా ఎంతో అందముగా పెట్టుతూ వున్నది, మధ్యను కోట కట్టి నాలుగువైపులా దోవలు చేసింది. చుట్టూరా పాములూ, పద్మములూ, పువ్వులూ, తీగెలూ పెట్టుతున్నది. పెళ్ళిమాట వినడంతోనే చిరునవ్వు నవ్వింది. కాని బావమాట వినడంతోనే మొగం ముడుచుకుంది. "జుట్టూ లేదు, ఏమీ లేదు; నా కక్కర లేదు!" అని ముగ్గుబుట్ట అక్కడ పడవేసి ఇంట్లోకి పారిపోయింది. సుబ్బయ్య గట్టిగా నవ్వి ఊరుకున్నాడు. పాశ్చాత్యనాగరీకపుప్పొగ్గు తగలని ఒకపల్లెటూరి వృత్తాంత మిది.

సుబ్బయ్య అయినయింట పుట్టినవాడు: ఘరానాకుటుంబము. లేకలేక పుట్టినబిడ్డ కావడంవల్ల చాలా గారాబముతో పెంచుతున్నాడు తన కూతురు మహాలక్ష్మిని. ఆమెకు పదేళ్ళ వయసు వచ్చింది. అనుగుణమైన సంబంధం చూచి ముడి వేయించవలెనని తల్లిదండ్రులు ఉబలాటపడుతున్నారు. సుబ్బయ్యగారి చెల్లెలికొడుకు రామారావు కాకినాడ కాలేజీలో ఇంటరు పరీక్షకు చదువుతున్నాడు. పాడిపంటలకు వాళ్ళకు లోటు లేదు. సాలుకు మూడు నాలుగు వేలు ఆదాయము వస్తుంది. తోటా, దొడ్డీ, యిల్లూ, వాకిలీ పదిమంది గలకుటుంబం. మేనల్లుడికి కూతురిని ఇద్దామని సుబ్బయ్యగారి వూహ. చెల్లెలు ఒప్పుకుంటుందో ఒప్పుకోదో అని మాత్రం శంక. పిల్ల పుట్టడంతోనే కొడుకుకు చేసుకుంటా ననడం సాధారణంగా మర్యాద. సుబ్బయ్యగారి చెల్లెల్లు ఇంతవరకూ ఆమాట అనలేదు. అందుచేత శంక.

అనకపోవడానికి కారణం లేకపోలేదు. “ఇంగ్లీషు చదువుకుంటున్నాడు. మన మాటలు వింటాడా యేమిటి? ఈడొచ్చినవాడు వాడికి నచ్చిన సంబంధమే చేసుకోవచ్చు” నని ఆయన చెల్లెలూ, బావమరదీ అనుకుని ఊరుకున్నారు. మేనరికం చేసుకోడానికి వారికి ఇతర అభ్యంతరం లేదు. అందుచేతనే సుబ్బయ్యగారి వద్దనుంచి “పిల్లను ఆపడానికి వీలు లేదు. చేసుకునేదీ లేనిదీ తెలియజేయవలసిం” దని ఉత్తరం రావడంతోనే భార్యాభర్తలు సంప్రతించుకుని కుమారుడికి ఉతరం వ్రాశారు. తిరుగుటపాలో కుమారుడివద్దనుండి ఉత్తరం వచ్చింది– “ఆపిల్లనే కాని ఇంకోపిల్లను చేసుకో” నని.

రామారావుకు నవనాగరికపుదెబ్బ కాకినాడలో తగిలింది. జుట్టు క్రాపు చేయించినాడు. బొట్టు పెట్టుకోవడం మానివేసినాడు. పంచె కట్టుకోవడం మాని షరాయి తొడుగుతున్నాడు. ధనసాహాయ్యముతో బాహ్యవేషం ఎంతమట్టుకు మార్చవచ్చునో అంతమట్టుకు మార్చినాడు. పాశ్చాత్య అనుకరణ పరాయణత్వమహిమ!

ఇంత అయినవాడూ పూర్వవాసన మరిచిపోలేక పోయినాడు. లేక పోతే పల్లెటూరి పిల్లను చేసుకుంటా నంటాడా? దానికి కారణంకూడా లేకపోలేదు.

సుబ్బయ్యగారు వేదశాస్త్రములు అభ్యసించినవాడు. పుత్రాభావము చేత తాను పుత్రికకు కొంతమట్టుకు విద్యాభ్యాసము చేయించినాడు. తెలుగులోకూడా ప్రవీణత కలవాడు కావడంవల్ల కూతురికి తెలుగుకావ్యాలుకూడా చెప్పినాడు. లీలావతిగణితమూ, మల్లన్నగణితమూ చిన్నకు కంఠతా వచ్చును. సుబ్బయ్యగారు పూర్తిగా పూర్వాచారపరాయణుడు, భాషలోకూడా. కూతురి నామకరణకాలములో పురోహితుడు పళ్ళెములో బియ్యముపోసి మహాలక్ష్మి అని వ్రాస్తే అతనిమీద కస్సుర్రజేసి 'మహాలక్ష్మి' అని వ్రాయించినాడు. కూతురికి వర్ణక్రమము చెప్పే కాలములోనూ, మాటలు వ్రాయించేటప్పుడూ అరసున్న సంగతి మరిచిపోలేదు. ఒకనాడు ఆయన ఎవరింట్లోనో నామకరణసమయాన పిల్లవానిపేరు 'మల్లికార్జునుడు' అని అరసున్నతోకూడా వ్రాయించినాడట. అలా కాకపోతే ప్రత్యవాయము వస్తుందిట.

చిన్నకు సంస్కృతములోనూ, తెలుగులోనూ ప్రవేశమున్న సంగతి రామారావుకు తెలుసును. 'చదువుకున్నది, అందమైనది. చురుకైనది. ఇంక కావలసిం దేమిటి? 'హార్మనీ'మీద తరువాత కావలిస్తే సంగీతము చెప్పించుకో వచ్చును.' అనుకున్నాడు రామారావు; అనుకొని తప్పకుండా ఆపిల్లనే చేసుకుంటా నన్నాడు.

'జుట్టూ లేదు, ఏమీ లేదు. నాకక్కర లేదు' అన్నది చిన్న. పట్నములో పుట్టి పెరిగినబాలిక ఈమాటలు వింటే నవ్వుకుంటుంది. కాని చిన్నకు పట్నపువాసన ఇంకా తగల లేదు. స్వాభావసిద్ధమై వ్యక్తిగత

మైన పూర్వాచారాలు పట్నపుగాలిలో తుడుచుకుపోతవి. అస్వాభావి కాలు, అధునాతనాలు, అపూర్వాలు అయిన వికృతాచారాలూ, ఊహలూ, ఈగాలివల్లనే కలుగుతవి.

బాలికలు చిన్నతనములో బొమ్మలు చేసుకొని ఆడుకొంటారు. చేసుకొన్న బొమ్మలకు అలంకారము చేస్తేనే గాని వాళ్ళకు నచ్చదు. కాటుక, బొట్టు, పసుపుబట్ట, ఇన్నీ బొమ్మల కుండాలి. ఇందులో ఏమి లోటువచ్చినా బాలిక ఆనందానికి లోటు వస్తుంది. ఎంత అంద మైనబొమ్మనైనా బాలిక చేతులో పెట్టండి; బాలిక తప్పకుండా ఆబొమ్మకు కాటుక పెట్టుతుంది, బొట్టు పెట్టుతుంది, బట్ట కడుతుంది, గాజుపూసలు పేరులుగా గుచ్చి మెడలో వేస్తుంది. ఇలా చెయ్యడం వల్ల, బొమ్మ కున్నఅందము పోతుం దని మీ రనుకుంటారు; వస్తుం దని బాలిక అనుకుంటుంది. ఈబొమ్మలకు ఇంత శృంగారము చేసినమీదట ఆబొమ్మను చూచి ఆనందిస్తుంది బాలిక. ఆనంద మయినపిమ్మట ఆబొమ్మను పూజిస్తుంది—పువ్వులతో. బెల్లము, కందిపప్పు నైవేద్యం పెట్టుతుంది. ఇది తప్పదు. ఈలక్షణాలు లేని బాలిక వాసన లేనికస్తూరి!

ఈబాలిక పెరిగి పెద్ద దవుతుంది. స్త్రీ అనగా పెద్దబాలిక అన్నమాట. ఈపెద్ద బాలికకు చిన్నప్పటి లక్షణాలలో మార్పు కలగ లేదు. అప్పుడు నిర్జీవా లైన బొమ్మలను శృంగారించి పూజిస్తుంది; ఇప్పుడు సజీవా లైన బొమ్మలను. మొదట భర్త. ఈభర్తను శృంగారించడములో స్త్రీకి కుతూహలం మెండు. తల దువ్వవలె, పువ్వులు పెట్టాలి, బొట్టు పెట్టాలి, నీళ్ళు పొయ్యాలి. మంచిమంచిబట్టలు కట్టాలి. ఇలా శృంగారించిన భర్తను చూడాలి. చూచి ఆనందించాలి. ఆనందించి పూజించాలి. అప్పుడు స్త్రీకి గర్వనమయము; జన్మ సఫల మయిం దని సంతోషించే సమయము.

తర్వాత కొన్నాళ్ళకు బిడ్డలు. ఈబిడ్డలను కూడా ఈరీతిగానే అలంకరించి ముద్దాడుతుంది. ఈఆనందం లేకుండా స్త్రీ నిలవ లేదు.

పట్నాలలో 'పడమరగాలి' సోకిన తావుల్లో స్త్రీలకు స్వాభావికా

నందము లేకపోవడానికి కారణము వెతకవలెనా? మహాలక్ష్మి పల్లెటూరి పిల్ల కావడంచేత పూర్వవాసన మరిచిపోలేదు. అటువంటిస్థితిలో "జట్టూ లేదు, ఏమీ లేదు. నా కక్కర లేదు!" అనడంలో వింత లేదు.

"జట్టుకు పెళ్ళికి సంబంధం ఏమిటి?" అనుకున్నాడు సుబ్బయ్యగారు.

ఒకనాటి ఉదయం నలుగురు బాలికలు సుబ్బయ్యగారి వసారాలో కూచుని పువ్వులు దండలుగా గుచ్చుతున్నారు. తెల్లవారకుండా ఒకరి కంటెముందు ఒకరు లేచి పక్కయింట్లోవీ దేవుడుగుళ్లోవీ పువ్వులు కోసుకు వచ్చి ఎవరిపూలు వారు దండలు గుచ్చుతున్నారు.

రామారావు సెలవులకు మేనమామ యింటికి వచ్చినాడు. పెళ్ళిముందు కాబోయేభార్య చేసేపనులూ చెప్పేమాటలూ చూసి వినడములో కుతూహలము అందరికీ ఉన్నట్టే రామారావుకూ ఉన్నది. వసారావక్క గదిలో నవల చదువుకుంటూ రామారావు బాలికలమాటలు వింటున్నాడు. చిన్న మాట్లాడినప్పు డల్లా అతనికి ఆనందము.

ఆ నలుగురు బాలికలలోను ఇద్దరికి అప్పుడే పెళ్ళి అయింది. ఇద్దరికి కాలేదు. అందులో చిన్న ఒకతె.

"అదేం చిత్రమో ఓసే! తెల్లారకుండా వెళ్ళినా ఒక్క పువ్వూ లేకుండా పుణికేశారు దేవుడు గుళ్లోను" అన్నది ఒకబాలిక.

"ఉన్న పువ్వులు చాలవా యేమిటే ఓవిడా, తల్లో పెట్టుకోడానికి?" అన్నది చిన్న.

'పువ్వులకి చాలడం, చాలకపోవడం అంటూ ఉన్నదిటే చిన్నా! ఎన్ని పువ్వు లుంటే అంతమంచిది' అన్నది ఇంకోబాలిక.

'ఆఁ నాకు తెలిసిందిలే నువ్వు అలా ఎందు కంటున్నావో!' అని నవ్వింది ఒకకన్య.

'నువ్వే నవ్వుకోవాలా ఏమిటే? మాకు కూడా కాస్త చెప్పకూడదా!' అన్నది చిన్న.

"నాకు భయమా ఏమిటి? ఎందుకో చెప్పు. నీకుమాత్రం అక్కర్లేదా ఏమిటి అన్ని పువ్వులు!" అని తిరగబడ్డది మొంకటి బాలిక.

"చెప్పనా, చెప్పనా! ఏమిటో నువ్వు చెప్పాకో చిన్నా!" అన్నది ఆకన్య.

"నాకు తెలియడం లేదమ్మా! పాడుపురుగులు పువ్వును ఎలాగ తినేశాయో" అన్నది చిన్న గుచ్చుతూంటే రేకులు రాలిన పువ్వును చూసి.

"ఇదిగో, చెపుతున్నా. ఈవేళ దానిపెని—తెలిసిందా?"

"ఆఁ నాకు తెలిసింది. దాని పెనిమిటి వచ్చాడుట కాదూ!" అని పూర్తి చేసింది ఇంకో కన్య.

"అందుకనే అన్ని పువ్వులూ తనకు కావా లంటూంది. ఎంతాశో!" అన్నది చిన్న.

పెళ్ళి అయినపిల్ల కోపంతో తల వంచుకొని పువ్వు గుచ్చబోయి సూదితో వేలు గుచ్చుకుంది. దాంతో ఉక్రోషం వచ్చింది. చిన్న కేసి చురచురా చూసి "అవును. నాకు పువ్వులు చాల వంటే తప్పా ఏమిటి? నీకుమాత్రం అక్కర్లేదు కాబోలు!" అన్నది.

చిన్నకు కోపం వచ్చి "నా కక్కర్లేదు" అన్నది.

"పట్నాల్లో వుండేవాళ్ళు జుట్టు కత్తిరించుకొని బొట్టు పెట్టుకోకుండా కిరస్తానీవాళ్ళలాగ వుంటారు. వాళ్ళ కెందు కేమిటి పువ్వులు!" అని, ఆ పెళ్ళి అయినపిల్ల పువ్వులూ దండలూ పరికిణీలో వేసుకుని "రావే ఒసే, పోదాము" అని రెండో బాలికను తీసుకుని వెళ్ళిపోయింది. చిన్న చిన్నబుచ్చుకుంది. ఆక్షణంలోనే సంకల్పంకూడా చేసుకుంది. జుట్టులో పువ్వులు పెట్టుకో లేనిభర్త ఎందుకనుకున్నది.

వసారా గదిలో వున్న రామారావు చిన్నబుచ్చుకుని చిన్న కేసి చూచాడు. చిన్న కంట్లోనుంచి కొన్ని బిందువు గుచ్చుతూ వున్న పువ్వుమీద పడింది.

బాల్యకాలంలో హృదయాలను చలింపజేసే చిత్తవృత్తుల యథార్థాన్ని తెలుసుకోడం ఎవరితరం?

౪

పదేళ్ళు వచ్చినతర్వాత పెళ్ళికు పిల్లను అట్టేబెట్టడం పల్లెటూళ్ళల్లో పొసగదు. అందుచేతనే సుబ్బయ్యగారు తాంబూలాలు పుచ్చుకోడానికి తొందరపడుతున్నాడు. రామారావు కాకినాడలోనే ఉన్నాడు. తాంబూలాలు పుచ్చుకోడానికి పిలిస్తే రావడంలో చదువు పోతుం దని తల్లి చెప్పడంవల్ల అతను లేకుండానే తాంబూలాలు పుచ్చుకున్నాడు. వేసవి కాలపు సెలవుల్లోనైతే చదువు పోదు అని అప్పటికే ముహూర్తం కూడా ఏర్పాటు చేశారు. ఆడపెళ్ళివారు పెళ్ళిపనులు బాహాటంగా జరిపిస్తున్నారు. ఎక్కడ లేని చుట్టాలూ వచ్చి యిల్లు నిండినారు. ముహూర్తం రోజులమీద వున్నది. బాజాభజంత్రీలు, భోగంమేళాలు, పట్టుపల్లకీలు, అన్నీ కూర్చుకోవడ మయింది.

మగపెళ్ళివారు ముహూర్తానికి ముందరిరోజున వచ్చారు. రామారావును పల్లకీలో ఎక్కించి తీసుకు వచ్చినారు. ఇంగ్లీషు చదువుకుంటున్న రామారావుకు పల్లకీలో కూచోడం చిన్నతనంగానే వుంది. పెళ్ళివా రందరూ విడిదిలో దిగారు. మర్నాటిరాత్రి పెళ్ళిముహూర్తం. ఆసాయంకాలం రామారావు విడిదిలోనుంచి మేనమామగా రింటికి వెళ్ళాడు. నడవలో చిన్నను పెళ్ళికూతుర్ని చేస్తున్నారు. ఆడవాళ్ళకంట పడకుండా రామారావు దొడ్డిదోవను ఇంట్లోకి వెళ్ళి పక్కవరండా కిటికీలోంచి పెళ్లికూతుర్ని చూస్తున్నాడు. ఈమాటలు అతనిచెవిన పడ్డవి:

,,అ దేమిటే వెర్రితల్లీ! వినవుగా! తప్పమ్మా! పరికిణీతో కళ్ళు తుడుచుకో.''

పెళ్ళికూతురు కళ్ళు తుడుచుకొని అస్పష్టంగా "నాకక్కర్లేదు,నా కక్కర్లేదు." అన్నది.

'చెపితే వినవుగా! అతని కేం? అక్షణంగా ఇంగ్లీషు—'

రామారావుకు సంగతి తెలిసింది. తక్షణం అక్కడినుంచి లేచి వీధిలోకి వచ్చాడు. ఆరాత్రి ఎవరినీ కూడా రానియ్యకుండా ఇత్తడిచెంబు చేత్తో పుచ్చుకుని బయలుదేరాడు. 'ఎక్కడికిరా నాయనా?' అన్నారు తోవలో ఎవరో. అతను లెక్క చెయ్యలేదు. చెరువుకు వెళ్ళి వస్తానన్నాడు.

మర్రిచెట్టుకింద చెంబు కనబడ్డది. రాత్రి ఎంతసేపటికీ రామారావు ఇంటికి రాకపోవడం చూసి, ఊరంతా వెతకడం మొదలుపెట్టారు. మర్రి చెట్టుకింద చెంబు కొందరు చూచారు. రామారావు జాడ ఎక్కడా లేదు. పెళ్ళివారింట్లో అప్పటిస్థితి చెప్పడానికి వీలు లేదు. 'ఎక్కడికో లేచి పోయా' డని కొందరు అన్నారు. ఏం పాపకాలం వచ్చిందో అమ్మా! ఏమయిపోయాడో కొడుకు! అని తల్లి కంట తడి పెట్టింది. ఊరూరికీ మనుషులను పంపారు.

'ఎంతచదువు! ఎంతఆస్తి! పిల్లకు అదృష్టం వుండకద్దుటో! ఇంతకీ ఘటన లేదు' అన్నది ఒకవితంతువు ఇంకోవితంతువు చెవులో.

రామారావు మర్రిచెట్టుకింద చెంబు వదిలేసి పొలాలగుండా కాకినాడ బయలుదేరాడు. కొంచెం గడ్డివెన్నెల కాస్తున్నది. చుట్టుపట్ల వున్న పచ్చనిచేలనూ, పిల్లకాలవలనూ చూచుకోకుండా బుర్ర వంచుకొని నలిగిన తోవవెంట నడిచిపోతున్నాడు. తోవలో పొలముకాపు వక్కడు 'ఎవరాదు? ఎంకా?' అన్నాడు. ఆఁ అని మరింత గబగబా వెళ్ళి రామారావు రోడ్డు ఎక్కినాడు. రోడ్డుమీదినుంచి కాకినాడ తిన్నగా పదహారు మైళ్ళు. తోవలో ఖాళీబళ్ళు అవుపించినవి. బండివాళ్ళు ఎక్కమన్నా అతను ఎక్కాడు కాదు. అతనిమనస్సు తలకిందు అవుతున్నది. మేఘాలమరుగు దాటి చంద్రుడు వెన్నెల కాస్తున్నాడు. గాలి చల్లగా మొగానికి తగులుతున్నది. పక్కగ్రామాన పాటుపడి వచ్చిన సేద్యగాండ్లు గొంతెత్తి పదాలు పాడుతున్నారు. బయట ప్రశాంతి, సంతోషమూ; లోపల కలవరమూ, దుఃఖమూ!

"నేను మొదట ఇంగ్లీషు చదువులో ఎందుకు దిగాలి? ఉద్యోగం చేసి ధనం సంపాదించాలి అనుకున్నానా? ధనాశ నాకు లేదే! నేను బీదవాణ్ణి కాను గదా! అధికారంకోసమా? నాకు అధికారం అక్కర లేదు. లోకాచారాన్ని అనుసరించడానికి అలాటిలోకుల అవస్థ నాకుకూడా పట్టవలెనా? ఇంగ్లీషు చదువుకొన్న భర్త భార్యతో అనుభవించేసుఖ మేమిటి! భర్తలోకం వేరు, భార్యలోకం వేరు. ఏఒక విషయంలోనైనా ఇద్దరికీ సమానదృష్టి ఉందా? భర్తకు మేజోళ్లు, భార్యకు రవికెలు. భర్తకు మొగంమెరుగు బూడిద, భార్యకు పసుపు. భర్తకు కచేరీవ్యవహారం, భార్యకు పొరుగింటివ్యవహారాలు. భర్తకు అధికారిసేవ, భార్యకు నోములూ, వ్రతాలూ.

"భర్త అస్తమానమూ ఇంగ్లీషుపుస్తకాలు చదవడం భార్యకు కిట్టదు. రామాయణం భారతం చదవమంటుంది, దేశాచారాలు విడవవలెనా? స్వధర్మం విడనాడరాదు. పరధర్మం స్వీకరించరాదు.

"విజ్ఞానసంపాదనం లేకుండా పూర్వాచారాన్ని అనుసరించి ప్రవర్తించినచిన్న నాకు మంచిప్రకారమే చేసింది."

ఈప్రకారం రామారావు ఆలోచించేసరికి ఆనందం కలిగింది.

౫

రామారావు కాలేజీ మానివేసి కాకినాడలోనే విస్సప్ప శాస్త్రులుగారివద్ద శాస్త్రాభ్యాసము మొదలుపెట్టినాడు. అతనిప్రకారం పూర్తిగా మారి, పూర్వకాలపు వేదవిద్యార్థిరూపం వచ్చింది. ఆచారప్రకారం జుట్టు పెట్టినాడు. సంవత్సరంలో అతను చేసినకృషి ఏశిష్యుడూ చెయ్యలేదని విస్సప్ప శాస్త్రులుగారే అన్నారు. కుమారుడు ఇలా మారడం మొదట తల్లిదండ్రులకు కొంచెం కష్టమనిపించింది. తరవాతమాత్రం వాళ్ళు చాలా సంతోషించారు.

సంవత్సరం అయినతర్వాత రామారావు మేనమామగారింటికి వెళ్ళాడు. చిన్నకు లావణ్యం వచ్చింది. కాటుకకన్నులలోనుంచి కాంతులు పురక లెత్తుతున్నవి. పిల్ల మంచి ఎత్తరుగా పెరిగి ఉన్నది. మాటాడినప్పుడు ముఖాన చిరునవ్వులు తాండవమాడుతున్నవి. చిన్నకు ఇంకా సంబంధం కుదర లేదు.

రామారావును చూచి చిన్న మొదట గుర్తు పట్టలేదు. తరువాత గుర్తు పట్టి పారిపోయి తలుపుసందులోనుంచి తొంగి చూడడం మొదలుపెట్టింది. సుబ్బయ్యగారు రామారావును ఏదో శాస్త్రవిషయం అడుగుతున్నాడు. మర్నాడు తెల్లవారుజామున చిన్న సన్నసన్నంగా దేవుడుగుళ్ళోకి వెళ్ళి పూలు కోసి దండలు గుచ్చింది. అందులో ఒకదండ-ఎవరూ లేకుండా చూచి బావమీద విసిరింది. చిన్నతనపుచనువు అనుకున్నాడు; అనుకుని ఆదండ తీసుకుని జుట్టులోపెట్టుకున్నాడు.

చిన్న రామారావును చూచి సంతోషపడ్డది. రామారావు తటాలున లేచి చిన్న చేతులు రెండూ పట్టుకుని, బుగ్గ కొరికి, "నీకు జుట్టు ముఖ్యమా, పెళ్ళికొడుకు ముఖ్యమా?" అన్నాడు.

"జుట్టున్న పెళ్ళికొడుకు!" అని నవ్వుతూ పారిపోయింది చిన్న.

తరవాతసంగతి ఏ మున్నది? చిరునవ్వులమధ్య చిన్నను పెళ్ళికూతురిని చేశారు, ముహూర్తంరోజున. పెళ్ళికొడుకు పారిపోకుండా నలుగురు అత నికి కాపలా వున్నారు, ముహూర్తసమయంవరకూ. మూడుముడులూ పడ్డవి.

మొదటిమారు రామారావు ఎందుకు పారిపోయినాడో ఎవరికీ తెలియదు.

"ఎంత చిదుములాడివే అమ్మా! చిన్నతనంలోనే పెనిమిటిని ఇలాగ దిద్దుకొంటున్నావు! పెద్దదాని వైనాక గాజుబీరువాలో పెట్టి దాచుకుం టావు కాబోలు! అన్నది మేనత్త ఒకర్తె తలుపుదగ్గిర పేర్లు చెప్పించే సమయాన.

# ఏప్రిల్ ఫూల్

## శ్రీ కొడవటిగంటి సుబ్బయ్య

హాస్టల్ విద్యార్థు లందరిలోకీ విశ్వనాధంకన్న గడే కాదుగాని పెద్దమనిషి గాని మరొకడు లేడు. అతనికి అఖండ మైన తెలివితేట లున్నాయని ఉపాధ్యాయు లంతా అంటారు. మరి మూడేళ్ళనుంచీ ఎఫ్. ఏ. తరగతి తప్పుతున్నాడు. "ఎన్నడైనా పుస్తకం మొహం ఎలాంటిదో చూస్తేగా! తా చెడ్డ కోతి వన మెల్లా చెరిచిం దని, తాను చదవడు సరిగదా ఆరాధాయిని కూడా చెడగొట్టుతున్నాడు" అని తెలుగుపండితుడు, కాలేజీ ప్రిన్సిపల్, హాస్టల్ వార్డెన్ అయినవిలియందొరకు తెలుగు నేర్పేసమయంలో అంటూ వస్తాడు.

"అవు నవును. మేము చూచుచున్నాము" అని దొర.

దొరకు విశ్వనాధ మంటే అమిత మంట. అతని అల్లరిని ఏమాత్రమూ ఆపలేకపోయిన అసమర్థతవల్ల కలిగిం దాకోపం. ఎవరినో నలుగురిని పోగుచేసి తలుపులు గడియలు పెట్టి రోజూ పేకాట. దొరకు ఆచోకీ తెలిసి అకస్మాత్తుగా వచ్చి తలుపు తట్టితే వెంటనే దీపమారిపోతుంది. ఎక్కడివా ళ్ళక్కడ గురక పెట్టుతుంటారు. తలుపులు పగిలే టంతపని అయినాక విశ్వనాధం పో పో పో మ్మని ఎవరో విద్యార్థి పేరు పెట్టి నానాతిట్లు తిట్టి మళ్ళీ గురక సాగిస్తాడు. ఇంకా కొంతసేపటికి దొరగారిని గుర్తించినట్లు హడావిడిగా లేచి తూలుకుంటూ, బట్ట సవరించుకుంటూ, నోటినిండా క్షమాపణలతో బయటికి వస్తాడు. విశ్వనాధం అల్లరివాడా? మరీనమ్మకము లేక దొరగారు

లోపలికి వచ్చి సోదా చేశాడా, దస్తీ పేకముక్కలు కనపడవు!

పెద్దజబ్బు చేసినం దని తలనిండా ముసుగు పెట్టపడుకుంటాడు, విశ్వనాథం. భోజనానంతరం దొరగారు వచ్చి పరామర్శ చేసి ఇట్టే అవతలికి వెళ్ళగానే, విశ్వనాథం శాలువ ఒకమూలకు విసరి నీటుగా తలగుడ్డ చుట్టి ఇంత సెంటు పూసుకుని, రాధారావుతో గోడ దూకి నాటకానికి వెళ్ళతాడు. మర్నాడు దొరగారికి ఈసంగతి తెలిసి చూడవస్తే గదిఅంతా యూకలిప్టస్ నూనె వాసన, మొఖంనిండా అమృతాంజనము, ఎఱ్ఱటికళ్లు, మాటాడితే ఆయాసము! "నా-కీవూట-గోధుంజావే-అన్నం-వద్దు-" అని దీనంగా దణ్ణాలు. పక్కన కంట నీరు పెట్టుకుంటూ రాధాయి! ఇదీ వరస.

ఇలాటివాణ్ణి ఏం చెయ్యాలో దొరగారికి బోధపడేది కాదు. చేతకాని కొద్దీ అతన్ని పట్టుకోవా లని ఆదుర్దా హెచ్చింది. ఒకచీకటిరాత్రి దొరగారు వసారాలో మంచము వేయించుకొని పండుకొన్నాడు. తెల్లవారుఝామున మెలుకువ వచ్చి చూచేసరికి గాఢాంధకారము! ఆయనమంచము పెద్దచీకటిమానికింద ఉన్నది. కాళ్ళదిక్కున అంతదూరంలో తెల్లటి వ్యక్తి కనబడ్డది. దొర తల యెత్తి చూచాడు. ఆవ్యక్తి మెల్లిగా సమీపించింది; నడిచి కాదు- గాలిలో తేలిపోతున్నట్టు, అది దగ్గిరికి వచ్చి నిలబడ్డది. భయంకరపిశాచరూపం! దొర కెవ్వన కేక వేసి కళ్ళు మూసికున్నాడు. మళ్ళీ కళ్ళు తెరిచేసరికి దయ్యం లేదు. ఎవరో పారిపోతున్నశబ్దం వినబడ్డది. ధైర్యం తెచ్చుకుని దొర కేకలు వేసుకుంటూ పోయి సరాసరి విశ్వనాథంగది చేరాడు. గది తాళం వేసి ఉన్నది. ఈలోగా జవానులు వచ్చారు. దొర హాస్టలంతా వెతికించాడు. విశ్వనాథం రాధారావు- ఇద్దరూ లేరు. మర్నాడు విద్యార్థు లందరియెదుటా విచారించి నేరం నిర్ధారణ చేసి ఇద్దరికీ చెరి రెండురూపాయలూ జరిమానా విధించాడు. దయ్యం మాటమాత్రం ఏమీ రాలేదు. దొర తీర్పు చెప్పి, వాళ్ళను పంపివేస్తూ, "విశ్వనాథం, ఇంకొకరికి బుద్ధి చెప్పదగినయీడు నీకు వచ్చినది. కాని నీ వింత తుంటరిగా సంచరించుచున్నందులకు నాకు చాల విచారముగా

నున్నది. నీవు కళాశాల విడిచి ఇంటికి పోవుట చాల మంచిది. నిన్ను నేను ప్యాసు చేయిస్తాను." అని కఠినంగా మందలించి, అతన్ని పంపివేసి, రాధారావును చాలా చివాట్లు పెట్టినాడు.

రాధారావు చిన్నవాడు, ఆకారంలో బాలికవలె ఉంటాడు. మెత్తనివాడు. అయితే ఇప్పుడిప్పుడు విశ్వనాథంస్నేహంవల్ల కొంత గడతేరినాడు. వాళ్ళిద్దరికీ పరమమైత్రి. నాగైను అన్న దుర్భావన అన్నీ రాధారావు వచ్చి చెప్పేసరికి విశ్వనాథానికి కళ్ళనీళ్ళు తిరిగినవి. ఆరాత్రి వాళ్ళు పడుకునేసరికి కోడి కూసింది.

పరీక్షలు దగ్గిరికి వచ్చినవి. జరిమానా తగిలిననాటినుంచీ విశ్వనాథంచర్య మారిపోయింది. ఒక్కతమాషామాట గాని ఒక్కపరిహాసచేష్ట గాని లేదు. ఎప్పుడూ పుస్తకంలో ముఖం పెట్టుకుని కూర్చునేవాడు. దొరకూడా మళ్ళీ అతనిజోలికి వెళ్ళలేదు. అతనితో జోక్యం పెట్టుకోకపోవడమే మంచి దనుకొన్నాడు.

ఒకరోజు స్నేహితు లిద్దరూ పుస్తకాలు ముందువేసుకుని కూర్చున్నారు. విశ్వనాథానికి గంటకు ఒకపుట అయినా తిరగడం లేదు. రాధారావు ఎప్పటితీరున ఏకాగ్రతతో చదువుకుంటున్నాడు. కొంతసేపటికి విశ్వనాథం చిటుక్కున గ్రంథం మూసి "రాధా, యిటు రా" అని అతన్ని దగ్గిరికి తీసుకొని చెవిలో ఏమేమో చెప్పాడు. రాధారావు సిగ్గుపడి తల వంచుకుని చిరునవ్వు నవ్వాడు.

"ఏమంటావు?"

ప్రత్యుత్తర మియ్యకుండా నవ్వు మొగము పైకెత్తి రాధారావు మిత్రునివంక చూశాడు. విశ్వనాథం అతని కళ్ళు ముద్దు పెట్టుకున్నాడు.

మర్నాడు ఏప్రిల్ మొదటితేదీ. విద్యార్థులూ, ఉపాధ్యాయులూ పరీక్షలగొడవలో ఉన్నారు. ఆరోజుసాయంకాలం ఆరుగంటలవేళ విశ్వనాథంగదిలోనుంచి ఇద్దరువిద్యార్థులు బయలుదేరి అక్కడక్కడ పదిమందిని చేర్చుకొని తెలుగుపండితుడి దగ్గిరికి వెళ్ళారు. వీళ్ళు పరీక్షలవిష

యం అడగవచ్చా రనుకొని ఆయన వీళ్ళను చూడగానే ,,పొండి, పొండి, పొండి. నా కేమీ తెలియదు. మీకు పేపరిచ్చింది నేను కాను,'' అని గద విడ చేశాడు.

,,అది కా దండి శాస్త్రులుగారూ! పరీక్షసంగతి కాదు. మేము వేరేపని మీద వచ్చాము.''

,,ఏమి టది?''

,,మీకూ, మాకూ, అందరికీ అప్రతిష్ఠ వచ్చేరోజు వచ్చింది. విశ్వనాథం-''

,,వాడిసంగతేనా? ఇక చెప్ప నక్కర లేదు. ఏదో రావణాఅల్లరి! దొంగతనంగా పేప ర్లేమైనా కొట్టేశాడా? ఏం కర్మం! అయినా ఈమధ్య చాలాబుద్ధిమంతు డైనా డోయి!''

"అయ్యో శాస్త్రులుగారూ! ఎంత వెర్రివా రండీ మీరు! పేపర్లు దొరికితే మేము మీదగ్గిరికి చెప్పడానికి వస్తామా? పైగా వాడు బుద్ధిమంతు డైనా డంటున్నారే. ఇవాళ వాడిచర్య వింటే ఏ మంటారో!"

"మన మిక్కడ ఇలాగే మాట్లాడుతుంటాము. వాడు కాస్తా దాన్ని అవతలికి దాటేస్తాడు శాస్త్రులుగారూ! మీరు త్వరగా రండి. ఎవరో పిల్ల దాన్ని తెచ్చి గదిలో పెట్టాడు విశ్వనాథం!''

శాస్త్రులుగారు తెలాతెలాపోయి చూడసాగినాడు.

,,ఒరే, దొరగారికి తెలిస్తే మంచిదిరా'' అన్నాడు ఒకవిద్యార్థి.

"అవు నండీ, మేష్టారూ! దొరకి చెప్పియ్యండి" అని మరొక డన్నాడు.

అందరూ కలిసి గబగబా దొరగారిదగ్గిరికి వెళ్ళారు. కొంతసేపటిదాకా ఆయనకు అర్థం కాలేదు. హాస్టలులో ఇంతమందివిద్యార్థులవడుమ ఇటు వంటిపని జరుగుతుందా అని ఆయన నమ్మలేకపోయినాడు. పిల్ల అంతా గట్టిగా నొక్కి చెప్పారు. "ఆచిన్నది లోపలికి వెళ్ళుతూ ఉండగా కళ్ళారా నేను చూశాను" అని ఒక డన్నాడు.

వెంటనే దొర బయలుదేరి వచ్చాడు. లాంతరులతో జవానులు వెంట వచ్చారు. హాస్టలులో ఉన్న విద్యార్థులు అంతా పోగయినారు. నిశ్శబ్దంగా ఉండండని దొర కాలిజోడు విడిచి విశ్వనాథంగది సమీపించాడు. లోపలినుంచి అస్పష్టంగా ఏదో గుసగుస వినబడ్డది. ఒకసారి మట్టెలచప్పుడయింది. దొర పక్కనున్న విద్యార్థిని పిలవమని సంజ్ఞ చేశాడు.

"విశ్వనాథం!"

గుసగుస ఆగిపోయింది.

"విశ్వనాథం!"

"ఎవరు?"

"నేను బుచ్చిరామయ్యను."

"ఎందుకు?"

"పని వుంది."

"ఇప్పుడు వల్ల గాదు, పో!"

"పని వుంది. ఒక్కసారి తియ్యి. మళ్ళీ ఇప్పుడే వేసుకుందువుగాని."

"అట్టే మాటాడావంటే నీముడిముక్కు ఊడగొడ్తాను!"

"దొరగారు తియ్యమంటున్నారు."

"నీకూ దొరగారికీ ఏమీ పని లేదు. అవతల పో!"

"విశ్వనాథం, ఓపెన్ ది డోర్ ప్లీజ్" అని దొర ఉచ్చైస్స్వరంతో అన్నాడు.

నిశ్శబ్దము.

"ఏమి విశ్వనాథం?"

విశ్వనాథం తలుపు కొంచెం తెరచి నేర్పుగా బయటికి వచ్చి తలుపు మూసినాడు. దొర తీక్ష్ణంగా చూస్తూ, "ఏమి చేయుచున్నావు?" అని అడిగాడు.

"పూజ చేసుకొంటున్నాను" అని అతను తొణకకుండా జవాబు చెప్పాడు.

"లోపల ఎవ రున్నారు?"

"ఎవరూ లేరూ."

"అక్కడ లేమ్మ. నేను లోపలకు వెళ్ళవలయును."

విశ్వనాథం ఒక్కపిస రైనా కదలక అతివినయముతో "మీరు లోపలికి రావడానికి వీలులేదు" అన్నాడు.

"ఏమి!"

విద్యార్థి యెవడూ ఇలా పలుకుతా డని దొర ఏన్నడూ కలలోకూడా అనుకోలేదు.

"నేను పూజ చేసుకుంటున్నాను" అని విశ్వనాథం మృదువుగా అన్నాడు.

"ఏమి, మేము నీపూజ చూడగూడదా? అట్లాయిన నీపూజవస్తువు అన్నియు దాచి పెట్టు, నేను వచ్చెదను."

గంభీరస్వరముతో విశ్వనాథం ఇలా అన్నాడు.

"మిస్టర్ విలియం! ఈరాత్రి మీరు ఏదోదురుద్దేశముతో ఇంతమందిని వెంటబెట్టుకొని నాగది పరీక్ష చెయ్యడానికి రావడం ఒకతప్పు. వచ్చి నా పూజ చెడగొట్టడం రెండోతప్పు. సగంపూజలో నాదేవతార్చన అవతల పెట్టమని చెప్పడం మూడు. ఇది అన్నిటికంటె గొప్పఅపరాధం! మీపాశ్చాత్యులు వెర్యోళ్లు తల కిందుగా తపస్సు చేసినా మాహిందువులధర్మం మీకు తెలియదు. నేను చాలా సహించాను. కనుక దయచేసి ఇక వెళ్ళండి!"

దొరగారిముఖం తరిగినకందగడ్డవలె అయింది. కొంచెంసేపు ఊరుకుండి దొర శాస్త్రులుగారిని చూసి "మీరు వెళ్ళి చూడండి" అన్నాడు. విశ్వనాథం చికాకు పడ్డాడు.

శాస్త్రులుగారికి సంకటం వచ్చింది. తాను వెళ్ళి చూడకపోతే దొర ఊరుకోడు. వెళ్ళి చూస్తే విశ్వనాథంసంగతి బయట బడుతుంది. తర్వాత

తనవని ఏ మవుతుందో పరమాత్ముడికే ఎరుక! విశ్వనాథంమాట తలుచుకుంటే ఆయనకు హడలు.

చేసేది లేక తెలుగు శాస్త్రులు గారు లోపలికి వెళ్ళాడు. విశ్వనాథం తల వంచుకు ఊరుకున్నాడు. శాస్త్రులుగారికి లోపల ఏదేవతార్చనా కనబడ లేదు. ఎవరూ కనబడలేదు. గుండెలు దడదడలాడుతూ ఉండగా ఆయన బయటికి వచ్చి ఈమాట చెప్పినాడు. దొర విశ్వనాథంవంక చూచాడు. పట్టుబడ్డ అపరాధివలె అతను తల యెత్త లేదు. రెండుతలుపులూ తెరిచి దొర లోపల ప్రవేశించాడు. ఒకరిమీద ఒక రెక్కి విద్యార్థులు వింతచూస్తున్నారు. ఎవ్వరూ సందడి చెయ్యలేదు.

గది అంతా యెప్పటిరీతిగా ఉంది. ఎక్కడి పుస్తకాలక్కడ, ఎక్కడ విడిచినబట్ట లక్కడ. పడుకొన్నవాడు లేచాడు కాబోలు, మంచము మీదిదుప్పటి కిందికి జారిఉన్నది. ఎక్కడా ఎవ్వరూ కనబడ లేదు.

దొర చటుక్కున వెళ్ళి మంచంమీదిదుప్పటి లాగివేశాడు. వెంటనే చికాకుపడుతున్న పదహారేళ్ళసుందరి మంచంకిందినుంచి బయటికి వచ్చి ముఖాన పైట చాటు వేసుకొని ఒకమూలకు వెళ్ళి నిలబడ్డది.

పటపటా పళ్ళు కొరుకుతూ దొర ఇవతలికి వచ్చి విశ్వనాథాన్ని అన్న మాటలు ఇన్ని అన్ని కావు. బిక్కపోయినముఖంతో అతను అన్నింటికీ మాటాడకుండా ఊరుకున్నాడు. దొరకు శాంతం రాలేదు. ఆయన బ్రహ్మచారి. బైబిలులోనుంచి అనేకవాక్యాలు అప్పజెప్పి విద్యార్థుల కందరికీ పెద్దపెట్టున నీతి బోధించాడు. ఆయనకు అప్పటికీ కోపం తగ్గ లేదు. మొహం నెత్తురుకండ అయింది. చివరకు దొర ఆచిన్నదానివంక తిరిగి "అమ్మాయీ, ఇంతనీచకార్యము చేయుటకు ఈవయస్సున నీ కింత సాహసమా? నీ వెవరు? ఇక్కడికి ఎట్లు వచ్చినావు?" అన్నాడు.

ఆసుందరి దుఃఖం ఆపుకొంటూ "మీకోసమే వస్తూవుంటే ఈయనగారు అడ్డుపడ్డాడు" అని మృదుమధురస్వరంతో ముఖంలో మార్పు లేకుండా అన్నది.

విశ్వనాథం పక్కున నవ్వాడు. విద్యార్థులంతా కరతాళధ్వనులతో హాస్యం చేశారు. దొర మొహాన నెత్తురుచుక్క లేదు. ఆయన కేమీ బోధ పడ లేదు. కాని అంతలోనే ముఖం క్రోధఘూర్ణితమై దొర విద్యార్థుల వంక తిరిగి "మీరు అందరు వట్టి ఫూల్సు!" అని అరిచినాడు. అంతా ఊరుకున్నారు.

విశ్వనాథం సరసంగా నవ్వుతూ, "మిష్టర్ విలియం! శాంతించండి" అని లోపలికి వెళ్ళి సిగ్గుతో పెనుగులాడుతున్న చిన్నదాన్ని తీసుకువచ్చి, "మీరు ఈపిల్ల నెరుగుదురు. తిన్నగా చూడండి!" అని బలవంతంగా ఆమె ముఖం పైకెత్తి దొరగారికి చూపాడు. పరిహాసము తాండవిస్తున్న ఆమె కళ్ళల్లో దొర రాధారావును గుర్తించాడు. అందరూ రాధాయి, రాధాయి అని కేకలు వేశారు.

"ఈరోజున మీరు చేసినచర్యకు ఇందరిలో మీకంటె ఫూల్ లేడని తోస్తున్నది" అని విశ్వనాథం దొరతో నిర్భయంగా అన్నాడు.

ఒక్కక్షణము ఎవరూ మాటాడ లేదు. తర్వాత దొర ప్రసన్నముఖంతో విశ్వనాథానికి షేక్‌హ్యాండు ఇచ్చి "నీచమత్కారమునకు నిజముగా సంతోషించినాను. నీవు చాలా తెలివి కలవాడవు" అని, అందరికీ గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయినాడు.

అంతా నవ్వారు కాని తెలుగుశాస్త్రుల్లుగారు ఇంకా గడగడ లాడుతున్నాడు, విశ్వనాథం ఆయన్ను చూచి "శాస్త్రుల్లుగారూ, దొరగారే అనుకున్నాగాని ఆయనకన్నా పెద్దఫూల్ అండి మీరు!" అని పరిహాసం చేశాడు.

# భార్యా రూపవతీ శత్రుః

శ్రీ శ్రీనివాస శిరోమణి

## ౧

రామారావు అనాకారివా డనే చెప్ప వచ్చును. అయితే చూస్తే చీదర కలుగుతుం దనడానికి మట్టుకు వీలు లేదు. పాపము, అందముగా ఉండ వలె నని అత నెంతో ప్రయత్నము చేస్తూ ఉంటాడు. కాని రూపాన్ని మార్చడము ఎట్లా సాధ్య మవుతుంది? ఏదో మామూలు భార్యా అయితే ఎట్లా ఉండేదో! కాని ఆమె దివ్యసుందర విగ్రహము. కేవల హనుమ ద్వరప్రసాద లబ్ధు లయిన ఆంధ్రదేశస్థులలో ఆమె పొరపాటున జారిపడి పోయింది. ఇందుకు తోడు రామారావుకే ఆమె భార్య అయింది.

రామారావుకు ఏవిషయములోనూ లోటు లేదు. చక్కగా చదువు కొన్నాడు, కావలసిన దానికంటే ఎక్కువగానే వసతి ఉంది. ఏవృత్తి లేకుండా ఉంటే హంగుగా ఉండ దనుకొని ప్లీడరీ చేస్తున్నాడు. భార్యా కాపరానికి వచ్చినప్పటినుంచీ ఆమెరూపాన్ని అనుక్షణమూ చూస్తూ ఉన్నాడు. ఇప్పటికి అయిదు సంవత్సరాలు అయి పోయినవి. అయినప్పటికీ ప్రతిక్షణమూ ఆమె రూపములో ఏదో ఒక క్రొత్త సౌందర్యము అతనికి కనపడుతూనే ఉంది. ఎందుకని? ఎన్నిసంవత్సరాలు అతను చూసినా ఏదో నూతన సౌందర్యము ఎప్పటి కప్పుడు ఆమెలో పొడకడుతూనే ఉంటుంది. అది ఆమె సౌందర్యలక్షణము. ఆమెను చూసి ప్రతిక్షణమూ అతను ముగ్ధు డయిపోతూ ఉండేవాడు. "కమ్మని కుందనము" అన్నట్టు ఆమె కేవలము రూపవతే కాదు, విద్యాసంపన్న కూడాను.

ఈ మర్త్యలోకములో స్వర్గసౌఖ్యము అనుభవిస్తున్న దల్లా తనొక్కడే నని ఎప్పుడూ రామారావు అనుకొంటూ ఉండేవాడు. అందరూ కూడా అట్లాగే అనుకొంటూ ఉండేవాండ్లు. ఆమె దర్శన మిచ్చితేనే జన్మ ధన్య మయిపోతుం దని ఏదో మిషమీద అతంతో అనేకమంది స్నేహముచేసు కొంటూ ఉండేవాండ్లు. ఇక ఆ పేటలో ఉన్న స్త్రీ లంతా ఆమె తమ ఇంటికి వస్తేనే తమ ఇండ్లు పవిత్ర మయిపోత వనుకొనే వాండ్లు. ఏదో పూర్వజన్మలో చేసుకొన్న పుణ్యవిశేషమువల్లనే ఈ జన్మలో ఆమె లభించి నట్టుగా రామారా వనుకొంటూ ఉండేవాడు.

కాలము గడిచినకొద్దీ అతని కామెమీద పూజ్యభావము ఎక్కువయి పోవడము మొదలు పెట్టింది. ఆమెను చూస్తే అతని కొక విధ మయిన భయము భక్తి కలుగుతూ ఉండేవి. ఏ బాలా త్రిపురసుందరినో, ఏ మదన కామేశ్వరినో ఉపాసకులు ఉపాసించే విధముగా అత నామెను ఉపా సిస్తుండేవాడు. ఆమెను స్మరించిన మాత్రానికే అతనికి బ్రహ్మానందము కలిగేది. ఆమెను స్మరిస్తే ఎంతటి కార్యాన్ని అయినా చేసి పారవేసేవాడు.

ఆమె ఎంతసౌందర్యవతో అంత సౌందర్యవంతుడు సీతాపతి. అతను బ్రహ్మచారి, కవి. రామారావుకు చిన్నప్పటినుంచీ స్నేహితుడు. భార్య వచ్చిన తరువాత సీతాపతికీ రామారావుకూ స్నేహము మరింత అయిపో యింది. ఎందువల్ల నంటే, అన్నపూర్ణకు సీతాపతి కవిత్వ మంటే మహా ఇష్టము. ఎప్పుడూ అతను రామారావు ఇంటికి వస్తూ ఉండేవాడు. కాలము గడిచినకొద్దీ అముగ్గురి స్నేహము ఇంతింత అని చెప్పడానికి వీలు లేకుండా అయిపోయింది. రామారావు ఇంట్లో ఉన్నా లేకపోయినా రాత్రిం బవళ్లు సీతాపతీ అన్నపూర్ణా ఏవో కబుర్లు చెప్పుకొంటూనో పద్యాలు చదువుకొంటూనో కాలక్షేపము చేస్తూ ఉండేవాండ్లు. కొంచెం మించు మించు ఆ గృహము భూతల స్వర్గానికి మల్లే ఉండేది.

౨

సాయంకాలము "బారు ఎసోసియేషన్ మీటింగు" అయినందువల్ల రాత్రి ఎనిమిదిన్నర, తొమ్మిది గంటలవరకూ రామారావు ఇంటికి రావడానికి పడలేదు. ఆ వేళ అమావాస్య. పైగా సాయంత్రమప్పుడు కొంచెము వర్షముకూడా కురిసింది. మబ్బు పట్టి ఉంది. చిమ్మచీకటి.

అన్నపూర్ణ ఇంటిదగ్గిర ఒంటరిగా ఉం దని భర్తకు తహతహ పుట్టింది. ప్రాణాలు అరచేతులలో పెట్టుకొని గబగబా నడుస్తున్నాడు. రస్తా అంతా బురదగా ఉండి కాలు జారుతూ ఉన్నది. ఎంత వేగముగా నడిచినా అనుకొన్నంత తొందరగా ఇల్లు చేరడానికి వీలు లేకపోయింది. బండివాణ్ణి "కోచీ" తీసుకొని రావద్దని చెప్పినందున తన్ను తాను నిందించుకోవడము మొదలు పెట్టినాడు. ఎట్లాగయితే నేమి, చివరకు ఇల్లు సమీపించినాడు. గేటుదగ్గిరికి వెళ్ళినాడు. గేటు తలుపు ఒక్క తన్ను తన్ని గబగబా లోపలికి వెళ్ళినాడు. ఆవరణలో కొంతదూరము నడిస్తేనే కాని ఇల్లు రాదు. వరండాలో మాత్రము దీపము వెలుగుతున్నది. బంట్రోతు వరండాలో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. కుక్కముట్టుకు తోక ఆడించుకొంటూ వచ్చి సాష్టాంగ దండ ప్రణామము చేసి యజమానిని ఆహ్వానము చేసింది. ఇంకా ఇంటి మెట్లదగ్గిరికి వెళ్ళలేదు. దక్షిణపువైపు గోడమీద మాత్రము వెలుతురు కనిపిస్తున్నది. ఇంక ఏవైపునా వెలుతురులేదు.

దక్షిణపువైపు గోడవంక చూచినాడు. వాక్యూం బ్రేకు వేస్తే సాధారణముగా మెయిలుబండి నలభై గజాలు వెళ్ళి నిలుస్తుందిట. కాని, రామారావు బ్రేకు వేసేసరికి దేహము తప్పీ మరి అక్కడనే ఆగిపోయింది. నిలుచుని గోడవైపే చూడసాగినాడు. అన్నపూర్ణను ఎవరో ముద్దు పెట్టుకొంటున్నట్టే కనుపించింది. ఉత్తరక్షణములో ఆలింగనము చేసుకోబోతున్నట్లు గోడమీద నీడ కనుపించింది. ఇంక చూడ లేక కండ్లు మూసుకొన్నాడు.

కండ్లు తత్క్షణమే తెరిచినాడు, బాల్కానిలో వాండ్లు గోడమీద తిరుగుతున్నట్టు కనబడ్డది. తలవంచుకొని లోపలికి నడిచినాడు. హాలులోకి వెళ్ళి దిగాలు పడిపోయి పడకకుర్చీలో రోయ్యమాదిరిగా కూర్చున్నాడు. మాటల ధ్వనినిబట్టి బాల్కానిలో ఉంది సీతాపతి అని గ్రహించినాడు. అతని గుండెలు బద్దలయి పొయ్యేటట్టు కొట్టుకొంటున్నవి. లేచినాడు, తలగుడ్డ, కోటూ విప్పి కింద నేలమీద విసిరివేసినాడు. కుర్చీలో జారగిలబడినాడు.

యజమాని వచ్చినట్టు బంట్రోతు వెళ్ళి అన్నపూర్ణకు చెప్పినాడు. ఆమె గబగబ హాలులోకి వచ్చింది. ఆమె వెంట సీతాపతికూడా వచ్చినాడు. అతన్ని చూసి వాండ్లిద్దరూ ఆశ్చర్యపోయినారు. వాండ్ల ఆశ్చర్యాన్ని అతను కనిపెడుతూనే ఉన్నాడు. ఎంతో ఆదుర్దాతో అన్నపూర్ణ "ఏమి టేమిటి, అట్లా ఉన్నారేం?" అని అడిగింది. సీతాపతి "తలనొప్పిగా ఉందా ఏమిరా?" అన్నాడు.

"ఊ."

"ఎప్పటి నుంచి, ఎప్పటి నుంచి? అమృతాంజనము తెచ్చేదా?" అన్నది అన్నపూర్ణ.

"లాభము లేదు. అమృతాంజనముకు పోదు."

"అయినా రాచుకోగూడదా, చల్లగా ఉంటుంది."

"లాభము లేదు. ఇది మామూలు మందులకు తగ్గి పొయ్యేది కాదు."

"మరి పోనీ డాక్టరుకు కబురు పంపించేదటరా?"

"అక్కర లేదు."

"మరెట్లా గండీ?"

"నిద్రపోవడానికి ప్రయత్నము చేస్తాను. నిద్రపడితే దాని అంతట అదే పోతుంది. మీరు ఆదుర్దా పడవలసిన అవసరము లేదు"; అంటూ బంట్రోతును పిలిచి పక్కను ఉన్న గది చూపించి "ఇందులో మంచము వేయరా, పడుకొంటాను" అన్నాడు రామారావు.

తక్షణము బంట్రోతు పక్క వేసినాడు. రామారావు లేవబోతుండగా

అన్నపూర్ణ పట్టుకొనబోయింది. "అక్కర్లేదు" అని గట్టిగా అన్నాడు. అంత కఠినముగా రామారావెన్నడూ పలికి ఉండ లేదు. అతను చాలా బాధపడుతున్నాడని ఆమె అనుకొన్నది. గదిలో మంచము మీద పడుకొన్నాడు. అన్నపూర్ణ సీతాపతికూడా ఆమంచము మీదనే కూర్చున్నారు. వాండ్లను చూస్తూ "మీ రిక్కడ కూర్చుంటే నా బాధ ఎక్కువయిపోతుంది. పొండి" అన్నాడు రామారావు.

అన్నపూర్ణ చిరునవ్వుతో „అదేమి టండి, చిత్రము!'' అన్నది. ఇంతలో వంటవాడు అక్కడికి వచ్చి నిలుచున్నాడు. „అయితే భోజనము కొద్దిగా చేసి పరుండండి. ఒకనిద్ర పోయి లేచే సరికి నొప్పి తగ్గిపోతుంది'' అన్న దామె.

„భోజనము చెయ్యను. ఈ నొప్పి ఈ దేహముతో పోవలసిందే!'' అంటూ వంటవాడితో „కొంచెము కాఫీ త్వరగా తయారు చేసి పట్టుకురా'' అన్నాడు.

„పోనీ, చారూ అన్నము తినండి'' అన్న దామె.

„అక్కర లేదు. నీ వింకా భోజనము చేయలే దేం?''

„ఈవేళ అన్నయ్య కూడా ఉంటా నన్నాడు. ముగ్గురమూ కలిసి భోజనము చేదా మనుకొన్నావండీ!''

„అన్నయ్య ఎవరు?''

„అన్నయ్య ఎవ రేమి టండీ? సీతాపతి.''

"మీ రిద్దరూ వెళ్ళి భోజనము చెయ్యండి. భోజనము చేసి పరుండండి.''

„అప్పుడే తొందరేం లేదు లేరా. పోనీ అన్నపూర్ణా, నీవు వెళ్ళి భోజనము చెయ్యి.''

అన్నపూర్ణ ఊరుకొన్నది. వెళ్ళ మని సీతాపతి అన్నపూర్ణకు సంజ్ఞ చేసినాడు. ఆమె వెళ్ళిపోయింది. ఇదంతా అతను చూస్తూనే ఉన్నాడు.

3

మద్రాసు సర్దారుభవనానికి సీతాపతి వచ్చేసరికి రామారావు గదిలో మంచము మీద బోర్ల పడుకొని పొర్లిగింతలు పెడుతున్నాడు. ముఖమంతా గండుబారి పోయింది. సన్నగా చిక్కిపోయి ఉన్నాడు. గదితలుపు ఓర వాకిలిగా వేసి ఉంది. ఆ ఓరలోనుంచి ఇదంతా చూసినాడు. సీతాపతి వెంటనే తలుపు నెట్టుకొని లోపలికి వెళ్ళినాడు. రామారావు అతన్ని చూస్తూనే కోపముగా "ముందు తెలియజేయకుండా ఎందుకు వచ్చావు?" అన్నాడు.

"నీవిలాసము తెలిస్తేగా" అన్నాడు.

ఏమీ మాట్లాడకుండా గోడవైపుకు ఒత్తిగిలి పడుకొన్నాడు. ఎంతోసేపు సీతాపతి కూర్చున్నాడు. అత నేమీ మాట్లాడ లేదు. ఒకటి రెండు సార్లు పలకరించినా పలక లేదు. గంటసేపు ఓపికపట్టి కూర్చున్నాడు. తర్వాత సీతాపతికి విసు గెత్తి భోజనము చేయడానికి వెళ్ళిపోయినాడు.

రామారావు మాసములో యావదాస్తీ తెగనమ్మి పారేసినాడు. అడబ్బు తీసుకొని ఎవరికీ ఏమీ చెప్పకుండా మద్రాసు వచ్చినాడు. అతనికి భార్యావిషయములో కలిగిన అనుమానమునుంచి వెర్రెత్తి పోయింది. ఎవరికీ తా నేమయి పోయినదీ తెలియకుండా ఆత్మహత్య చేసుకోవలె నని నిశ్చయించుకొన్నాడు. తన తదనంతరము తనదనే ఒక్క చిల్లిగవ్వ అయినా ఈలోకములో ఉండకూడ దనుకొన్నాడు. అందుకోసరమే ఆస్తి నంతా అమ్మివేసినాడు. అధనము ఏమి చేయవలెనో అతనికి తెలియలేదు. జన్మ ఎత్తిన తరువాత అంతధనము ఒక్కసారిగా కండ్లతో చూచి ఉండలేదు. ఒకరికి ధర్మము చేయవలె ననే ఊహ అతనికి కలగలేదు.

యథార్థానికి మద్రాసు వచ్చినాడు. సర్దారు భవనములో బస చేసినాడు. డబ్బు వ్యయము చేయడానికి మార్గము చప్పున కనుపించడము కూడా గొప్ప విషయమే. నాల్గు అయిదు రోజులవరకూ ఏమీ పాలు పోయింది కాదు.

ఇక ఎట్లాగూ చచ్చిపోవడము నిశ్చయమే, కాబట్టి ఈ బ్రతికి ఉండే నాల్గురోజులూ ఖులాసాగా ఖర్చుపెట్టి మరీ చచ్చిపోవడము మంచి దని నిశ్చయించుకొన్నాడు. ఇక గుఱ్ఱపు పందెములతో డబ్బు పెట్ట సాగినాడు. మొదట మొదట పందెములలో ఓడి పోయినా చివరకు ప్రతిరోజూ గెలవడమునుంచి 'తాను తెచ్చిన డబ్బుకంటె యెక్కువ డబ్బు రావడము మొదలు పెట్టింది. ఇది ఒక కొత్త దిగులు.

ప్రతి రోజూ ఆరాత్రికి దేహత్యాగము చేయవలె ననుకొని బయటికి బయలుదేరేవాడు. సముద్రములో పోయి పడితే అలలకు మళ్ళీ బయటకు కొట్టుకొనివస్తే తన్ను గుర్తుపడతా రనే సందేహము వచ్చేది. మరి తనేమయి పోయినదీ ఇతరులకు ఎంతమాత్రమూ తెలియగూడదు. ఈ సందేహము రాగానే తిరిగి బసకు వచ్చేవాడు. గది చేరగానే ఎదురుగుండా డబ్బు కనుపించేది. చనిపోయిన తరువాత మనదీ అనేది ఏమీ ఉండకూడదే, ఏమి చేయడమా అనే ఈ సందేహములో పడి కొంతసేపు కొట్టుకులాడే వాడు. ఇట్లా ఇరవైరోజులు గడిచిపోయినవి.

మధ్యమధ్య కండ్ల ఎదుట భార్యా పొడగడుతూ ఉండేది. "అయిదు ఆరుసంవత్సరాలు అంత అవ్యాజ ప్రేమ కనుపరచినది. అహా ఎంతమోసము ఎంత మోసము. ఇందుకోసరమే మన పెద్దలు భార్యా రూపవతీ శత్రుః అన్నారు. అవును, ఆడవాళ్ళసంగతి ఎవడు కనిపెట్టగలడు? చివరకు బ్రహ్మదేవుడికి కూడా శక్యము కాదు. అందుకోసరమే "ఏతా హసన్తి చ రుదన్తి చ కార్యహేతోః ... ... ... స్మశానసుమనా ఇవ వర్జనీయాః అన్నారు ... అయితే పోనీ ఆడది, బుద్ధిహీనతవల్ల అట్లాంటి పనికి తయారయింది అనుకొందాము. అయితే వాడు-ఆసీతాపతి నాకు చిరకాల మిత్రుడే-ఎంతో అనురాగముతో ఉండేవాడే- వాడి కెట్లా బుద్ధి లేక పోయింది? నిజంగా ఆడదానికి మనసులో ఏమున్నా మొగవాడు దారి తీసేవరకూ దారిలోకి రాదని అంటారే లోకులు మరి. అయితే అది దారి

తీసి ఉంటుందా? వాడు దారితీసి ఉంటాడా? ఏక కాలంలో ఉభయులూ దారి పట్టినారా? అయినా చచ్చి పోదలచుకొన్న వాడికి ఈ తర్క వితర్కా లెందుకు? ఇందులో ఎవరు దారి తీస్తే ఏమి? ఉభయులూ నాకొంప ముంచినారు. అసలు ఆ వెధవకు దాని దగ్గిర అంతచను వీయ వలసి యుండ లేదు. తప్పు నాదగ్గిర పెట్టుకొని వాండ్లను దూషించడ మెందుకు? ఇందుకోసరమునే కాబోలు స్త్రీ అన్నదమ్ములతోనైనా సరే ఏకాంత ముందు మాట్లాడ గూడ దని శాసించినాడు మనువు...

"అయినా, మన బంగారము మంచి దయితే కంసలి ఏమి చేస్తాడు? ఇదేమి చచ్చు సామెతగా ఉందే? కంసలి కొలిమికి కొంతబంగారము ఊది పారవేసి యెత్తుసరికోసరము రాగి కలప లేదు. అసలు ఆ సీతాపతి గాతే దాన్ని దింపి ఉంటాడు. లేకపోతే దాని కంత ధైర్యమా! అయితే స్త్రీ శక్తి స్వరూపిణి గాదా? ఇంతకూ ఇల్లు ఇరకడము అలు మర్కటముగా ఉండవలె నన్నారు...మనవాండ్ల సామెతలో ఎంతో వివేకము ఉంది. ఈ పెండ్లామే మర్కటము అయి ఉన్న ట్టయితే వాడు దాని జోలికే పొయ్యేవాడు కాడు. ఏమో ఈ పాడు ఆలోచన అంతా ఎందుకు? ఒక్క సారే నిశ్చయము చేసుకొన్నాను. ఈ రాత్రితో సరి. ఫొటోగ్రాఫు దుకాణాల వాండ్లదగ్గిర మందు తెచ్చుకో వచ్చును...

"అయినా ఇంతమాత్రానికే ఆత్మహత్య చేసుకోవడము అవసరమా? చచ్చి పోయి చేసే దేమిటి? ... సరే బతికి ఉంటాను. అది వాడివెంట వెళ్ళిపోతే ఎంత అవమానము! ఆ అవమానము భరించడముకంటే ముందుగా చచ్చి పోవడమే యుక్తము......పోనీ నా యింట్లోనే ఉండి వాడితో కాలక్షేపము చేస్తూ ఉంటే? వివాహము రద్దుచేసుకోవడానికి హిందులా ఒప్పుకోదుగా మరి? అయితే వెళ్ళగొడతా ననుకొందాము అప్పుడది Restitution of conjugal rights కోసరము దావా తీసుకొనివస్తే? కోర్టులో నేను దాని నెడు ప్రవర్తన రుజువు చేయవలసివస్తుంది! ... రుజువు చేయలేక

పోతాను. రామా, రామా, అవమానము! అవమానము. భరించలేను-భరించలేను. ... ఈ వెధవడబ్బు - ఈ డబ్బు ఒకటి నన్ను బాధిస్తున్నది. తీసుకొనివెళ్ళి కూమునదిలో పారవేస్తాను." అనుకొంటూ లేచి డబ్బు నంచి తీసుకొని బయలుదేరినాడు.

"సరే అఖరుపర్యాయము గుఱ్ఱపు పందెములో డబ్బు పెట్టి ఇంకా ఏమయినా వచ్చేట్లయితే అది కూడా కలిపి పారవేస్తాను" అని గుఱ్ఱపు పందెముకు వెళ్ళినాడు. ఉన్న డబ్బు అంతా చవట గుఱ్ఱానికి పందెము వేసినాడు. దురదృష్టవశాత్తు ఆ గుఱ్ఱము పందెము గెలిచింది. రెట్టింపు ధనము వచ్చింది. ఇక కోపము పట్టలేక కళ్లు మూసుకొని ఒక గుఱ్ఱంమీద ఉన్న డబ్బు అంతా పందెము పెట్టినాడు. ఓడిపోయినది. బ్రహ్మానందము అయినది. రాత్రికి మళ్ళీ బసకు చేరినాడు.

చేతులో పాతిక ముప్పయి రూపాయలకంటే లేదు. తన లెక్క చూడమని హోటలు యజమానిన అడిగినాడు. హోటలువాడి లెక్క ఇచ్చి వేసి ఆ రాత్రికి ఆత్మహత్య చేసుకోవలె నని అతని సంకల్పము. ఇక్కడకూడా దురదృష్టవశాత్తు మరునటి ఉదయము కాని లెక్కలు చూడడానికి వీలు లేదనీ, వేళ అయిపోయినందువల్ల గుమాస్తాలు ఇంటికి వెళ్ళిపోయినా రనీ హోటలు యజమాని చెప్పినాడు. పెద్ద ఆశాభంగముతో పడుకొన్నాడు. కండ్ల ఎదుట ఊరికే అప్రయత్నముగా అన్నపూర్ణ కనుపించడము మొదలు పెట్టింది. ఏడుపు రా సాగింది. ఏడుస్తూ పడుకొని నిద్ర పోయినాడు.

## ౮

ఉదయమే నిద్ర లేచి ఇంత కాఫీ పుచ్చుకొని వచ్చి మళ్ళీ మంచము మీద పడుకొని రామారావు మసులుతున్న సమయములో సీతాపతి వచ్చాడు.

అంత నేదో పెద్దదుఃఖములో మునిగి తేలుతూ ఉన్నట్టు గ్రహించినాడు. అనేక పర్యాయములు అతన్ని మాట్లాడించవలె నని ప్రయత్నము చేసినాడు. కాని ప్రయోజనము లేకపోయింది. పయిగా కండ్లురిమి చూడడము మొదలు పెట్టినాడు. ఎప్పుడో ఒకప్పుడు సంగతిసందర్భములు రామారావు చెప్పకపో డని సీతాపతి ఊరుకొన్నాడు. విచారించగా అతను గుర్రపుపందెములో డబ్బు అంతా పోగొట్టు కొన్నట్టు తెలిసింది.

మూడురోజు లయింది, నాల్గురోజు లయింది. ఏమీ మాట్లాడలేదు రామారావు. సీతాపతికూడా మెదలకుండా ఊరుకొన్నాడు. ఏప్రస్తావనా తీసుకొనిరాలేదు. 'ఆత్మహత్యకు సీతాపతి పెద్ద అంతరాయ మయినట్టు రామారావు భావించడము మొదలు పెట్టినాడు. పయిగా సీతాపతి మౌనముగా ఊరుకోవడము రామారావుకు మరింత కోపకారణ మయింది.

అంత తొందరగా రామారావులో అంత మార్పుకలగడానికి కారణమే మయి ఉంటుందా! అని సీతాపతి యోచించడము మొదలుపెట్టినాడు. అతని కేమీ అవగాహన కాలేదు. తనమీదా అన్నపూర్ణమీదా అతనికి అనుమానము కలిగిం దేమో నని శంకించినాడు. రామారావు ఏవిషయమయినా సరే, ఇతరుల కెంత అప్రియమయినా నిర్మొహమాటముగా మాట్లాడే స్వభావము కలవాడు. కాబట్టి ఆ అనుమానమే అయినట్టయితే ఎన్నడో అతనితో చెప్పే ఉండే వా డనుకొన్నాడు. దీని కంతా ఏదో పెద్ద బ్రహ్మాండ మయిన కారణము ఉంటుం దనుకొన్నాడు. ఆ కారణము అన్నపూర్ణకుకూడా తెలియదు. తెలిసినట్టయితే తనతో తప్పకుండా చెప్పి ఉండేదే నని సీతాపతి నిశ్చయించుకొన్నాడు.

సీతాపతి వచ్చి అయిదు రోజులయి పోయింది. ఇక ఏదోవిధముగా రామారావును సంభాషణలోకి దింపితేనే గాని అసలు విషయము బయటపడ దనుకొన్నాడు. మధ్యాహ్నము భోజనము అయిపోయిన తరువాత వెళ్ళి రామారావు పక్కలో కూర్చున్నాడు. అతను గోడచూపులు చూడడము

మొదలుపెట్టినాడు. మెల్లిగానూ, వినయముగానూ చిరునవ్వుతో "ఎందుకురా అంతకోపము? కోపమువల్ల వచ్చిన చిక్కులు పోతవా?" అన్నాడు సీతాపతి.

"నీ మీద నాకు కోపము లేదు."

"అయితే ఎవరిమీద అంతకోపము? ఎందుకు?"

"నామీదనే — నా ఈ జన్మమీద!"

"నాతో అంటే అన్నావు కాని—మ రెవరితో ఇట్లా అనకు. ఇట్లా అంటే విశాఖపట్నము పంపిస్తారు."

రామారావు అతనివంక చూడకుండా ముఖము అటు తిప్పుకొని ఊరుకొన్నాడు. సీతాపతి ఎంతో ఓదారుస్తున్న వాడికిమల్లే "ఏం ప్రయోజనము" ఎంత దుఃఖము కలిగితే దాన్ని అంత మింగివేయవలెను. అది పెద్ద లక్షణము. సరే. కానియ్యి, ఏది ఎట్లా కావలసి ఉంటే అది అట్లా అవుతుంది. సాయంత్రము మరి ప్రయాణమయి పోదాము. ఏ మంటావు?" అన్నాడు.

కోపముతో "చాలు చాలు మెట్టవేదాంతము!" అన్నాడు రామారావు.

"నీకు నిజంగా మతిపోయినట్టున్నది. ఇంటికి పోతే ఈపిచ్చి అంతా వదలుతుంది ...... అన్నపూర్ణ నీకోసరము ఎంత పరితపించి ఎలా చిక్కిపోయి ........."

అర్థోక్తిలోనే రామారావు "అమ్మ, అమ్మ, ఎంతదొంగవిరా! అమ్మ దుర్మార్గము! నాకోసరము పరితపిస్తున్నది- పరితపిస్తున్నదీ? ! అ, ఏమిఅమాయకులురా!..." అంటూ వాక్యము పూర్తి చేయలేక పోయినాడు. ముచ్చెమటలు పోస్తున్నవి. ఒళ్ళు గజగజ వణకడము మొదలుపెట్టింది. మిర్రి మిర్రి చూడసాగినాడు. ఏదో మాట్లాడబోతాడు కాని నోటివెంట పెగలడము లేదు. మంచముమీద కూర్చున్నవాడల్లా లేచి అటు ఇటు వెర్రివాడిలాగా వికార్లుచేయ ప్రారంభించినాడు.

కొంచెముసేపు సీతాపతి నిశ్చలముగా ఊరుకొన్నాడు. రామారావు ముఖములో ఆ మొదట ఉద్ధృతము కొంతతగ్గిపోయి మామూలుస్థితిలోకి వస్తూ ఉండగా "ఏమిటి రామారావు? ఏమిటో చాలా గొడవగా ఉన్నావు" అని మెల్లిగా సీతాపతి అన్నాడు.

"ఆ! ఆ! ఇంకా అమాయకపువేషము వేస్తున్నావా? నీవు పయోముఖ విషకుంభానివి. ముందు ఈగదిలోనుంచి నడుస్తావా? బంట్రోతుచేత గెంటించేదా? ఛీ. ఛీఛీ!" అన్నాడు రామారావు.

అతనెంత గందరగోళము చేస్తున్నాడో అంత కంత నిశ్చలముగా సీతాపతికించిన్మందహాసముతో "పోనీలే అట్లాగే వెళ్ళిపోతాను. నాతప్పేమిటో చెప్పు. తప్పు తెలియకుండా దండన చేయడమా? అందులో నీవు లాయరువు కూడాను" అన్నాడు.

"అవునులే. నీతప్పేమి లేదులే. అసలు తప్పంతా దానిదగ్గర - ఆ అన్నపూర్ణదగ్గర - అమ్మయ్యో - నేను ఎంతమోసపోయినాను. మనువు 'స్త్రీ ఏకాంతముగా సోదరులతో నయినాసరే మాట్లాడకూడ'దని శాసించినాడు. మొదట నే నది చదివినప్పుడు మనువు ఉత్తఫూల్ అనుకొన్నాను."

"ఒరే ఇదా నీ గొడవ! నెలరోజులబట్టి అవస్థ పడుతున్నది ఇందుకా? భూములు పుట్రలు అమ్మివేసిందికూడా ఇందుకనేట్రా. చాలా గొప్పవాడివి!"

"రాస్కెల్, నీకు ఎగతాళా? నేను చూడలేదూ? ఆరోజు - రాత్రి మీ ఇద్దరూ చేసినపని, ద్రోహీ! ముందు నా యెదుటనుంచి లేచిపో."

"ఏం చేశామురా మేము?"

"ఏం చేశామంటున్నావు, తుపాకి ఉన్నట్లయితే అప్పుడప్పుడు ఆక్షణములో అట్లా మీ ఇద్దరిని కాల్చివేసి ఉండేవాణ్ణి సుమా. ముందు లే నీవు నాదగ్గిర వద్దు పో. నీదారిన నీవు పో."

"ఏం చేశా మోయి?"

"ఏం వేశారా, గాఢాలింగనము చేసుకొన్నారు. నేను చూచినాను. ఈ కండ్లతో నేను చూసినాను."

"సరే, అప్పుడే అడగకపోయినావా అన్నపూర్ణను కాని నన్ను కాని? ఏమిటీ దుర్మార్గము? ఓరి వెఱ్ఱివాడ! కేవలము వెంగళప్ప వయినావురా. లే, రయిలువేళ అయిపోయింది. ఒక్కసారి ఈ విధముగానే అన్నపూర్ణను మందలించు. అప్పుడు నిజానిజములు తెలుసుకోకుండా ఇంత ఖాదస్త ములో పడిపోతా వని అనుకోలేదు రా. ఎందుకు లే. మరి నన్ను అడిగినట్టే ఆమెను కూడా అడిగి చూడు-ఏం చెప్పుతుందో?"

"అయితే నీ కేమి సమాధానము చెప్పినావు?"

"ఆమెను కూడా ఈవిషయము అడగమన్నాను. ఆమె నీతో ఇదివర కెన్నడయినా ఒక్కనాడయినా అసత్యము చెప్పిన పాపాన పోయిందీ? ఆలోచించు. రా. ఈ సాయంత్రము మెయిలులో వెళ్ళిపోదాము."

"ఇది ఏదో పెద్దవ్యూహము పన్నావు. నీవు నాదగ్గిర వద్దుపో. పొమ్మంటే పోవేం?" అని నెట్టివేసినాడు.

సీతాపతి చిరునవ్వుతో బయటకు వెళ్ళిపోయినాడు.

౫

అమర్నాథు రామారావు ఇంటికి ఎట్లాగో బయలుదేరినాడు. రైలు లోనే సీతాపతిని తన ఇంటి చాయలు రావద్దని శాసించడముచేత మధ్య దారిలోనే అతను దిగబడిపోయినాడు.

అతను ఇంటికి వచ్చేసరికి అన్నపూర్ణ బయట ఉంది. ఇల్లంతా మహా రణ్యములాగా ఉంది. నౌకరు లేడు. వంటవాడు ఉన్నాడు. కుక్క మట్టుకు ఎంతో ఆదరముతో అతన్ని ఆహ్వానము చేసింది. అన్నపూర్ణ ప్రసన్నవదనముతో అతని యెదుట దూరముగా వచ్చి నిలుచున్నది. కాని

అతను హిమాలయాపర్వతముకంటే అచలముగాను అకంపముగాను ఉండి ఆమెవంక నయినా చూడ లేదు. అది సమయము కాదని ఆమె అప్పటికి ఊరుకొన్నది. మూడురోజులూ ఎన్నిసార్లో దూరమునుంచి అతన్ని పలకరించి సంతోష పెట్టడానికి ప్రయత్నము చేసింది, కాని లాభము లేకపోయింది.

ఆ మూడురోజులూ అతను అన్నము తిన లేదు. ఏదో ఇంత కాఫీ పుచ్చుకొని మత్తుగా పడిఉన్నాడు. ఎన్నివిధాలనో అన్నపూర్ణ పరామర్శ చేయబోయింది. ఆమెవంక కన్ను అయినా ఎత్తి అతను చూడలేదు.

నాల్గవరోజు ఉదయమే అన్నపూర్ణ వచ్చి అతనిసరసనే కూర్చున్నది. ఊరకే చూస్తూ ఏమీ మాట్లాడకుండా రామారావు ఊరుకొన్నాడు.

"ఎక్కడనుంచి వచ్చినారు? ఎప్పుడు బయలుదేరినారు? ఏమిటి, అన్నము ఎందుకు తినరు. ... ..." అంటూ ఏమేమిటో ప్రశ్నలు ఆమె ఎంతో ఆదుర్దాతో అడిగింది. అత నేమీ సమాధానము చెప్పకపోవడమే కాకుండా ఆమెవంక వెర్రిగా చూడడము మొదలుపెట్టినాడు. అతని ధోరణి ఆమె కేమీ అర్థము కాలేదు. కొంచెమునే పయిన తరువాత "సీతాపతి అన్నయ్య మీకు కనుపించాడా?" అన్నది. ఈ మాట అతనికి పాము కరిచిన ట్టయిపోయింది. వెంటనే కోపముగా "వాడిసంగతి నా కేం తెలుస్తుంది? నీకు తెలియవలెను" అని చివాలున లేచి బయటకు వెళ్ళి పోయినాడు.

సాయంత్రము చీకటిపడే వరకూ ఇంటికి రాలేదు. ఆమె భోజనము మాని వేసి అతని కోసరము ఎదురుచూస్తూ కూర్చున్నది. అత నెందుకు అట్లా అయిపోయినాడో కించిత్తు అయినా ఊహ చేయలేకపోయింది. పోనీ సీతాపతి అయినా అతని విషయమంతా ఉత్తరము వ్రాయ లేదు. కారణము తెలియని ఈ దుఃఖముతో ఆమెకు జన్మమీద విసు గెత్తిపోయింది. ఇక అతను ఇంటికి వచ్చినా, రాకపోయినా ఈవిధముగా ప్రాయోపవేశము చేసి చచ్చిపోదా మని నిశ్చయించుకొని పడుకొన్నది.

చీకటి పడిపోయింది. రాత్రి ఎనిమిది కావచ్చింది. వంటవాడు భోజనముసంగతి రెండుమూడుసార్లు జ్ఞాపకము చేసినాడు. ఆమె ఏమీ జవాబు చెప్పకపోయినందువల్ల వాడు వెళ్ళిపోయి పడుకొన్నాడు.

ఎనిమిదిన్నర గంటలవ్వడు రామారావు మెల్లిగా ఇంటికి వచ్చి పడక కుర్చీలో జారగిలబడి పరధ్యానముగా కూర్చున్నాడు. అతను వచ్చినట్టు అన్నపూర్ణ తెలుసుకొని వెంటనే వెళ్ళి ఎంతో సంతోషము అభినయిస్తూ పడకకుర్చీచేతులమీద కూర్చుని మృదువుగా "ఏమిటి చాలా విచారముగా ఉంటున్నారు. కారణ మేమిటి? అని చుబుకము నిమరబోయింది. చటుక్కున లేచి కూర్చుని ఆమెచేయి కఠినముగా తీసివేసి "నా కేం విచారము లేదు" అని విగ్గరిగా అన్నాడు భర్త.

"అయితే ఈఉపవాసాలు ఎందుకు? ఎక్కడికో పోవడ మెందుకు? ఈపరధ్యాన మెందుకు—ఏమిటో మీవిషయ మంతా విచిత్రముగా ఉందండి." అన్నది అన్నపూర్ణ.

"ఇది నాయిల్లు కాదు. నా కేమీ లేదు. నేను దరిద్రుణ్ణి. నాకు భోజన మెందుకు?" అని మెల్లిగా తనలో తను అనుకొన్నట్టు అన్నాడు రామారావు.

"ఇది మీఇల్లు కాదండీ?"

"నాది, కాదు. మీనాయన నీకు కట్టించి ఇచ్చినాడు."

"అయితే నాఒక్కతె కోసర మండీ ఈఇల్లంతాను? ఏమి టీరాత్రి మాటలు. ఇదివర కెప్పుడూ ఇట్లా మాట్లాడేవారు కారే. మిమ్ములను ఎవరో ఏదో మోసము చేసిన ట్టున్నారు. లేకపోతే మీ కింత విచారము రాదు."

"అవును, అవును."

"సరే ఏం చేస్తాము. భోజనానికి లేవండి. భోజనము చేసినతర్వాత చెప్పుదురు గాని."

"చెప్ప డేమీ లేదు. నా ఆస్తి అంతా అమ్ముకొన్నాను. నా చేతిలో గుడ్డిగవ్వ అయినా లేదు. డబ్బు లేనివాడికి భోజన మెందుకని?"

"మీ ఆస్తి నేను న్నాను ఇంకా. ఇదంతా మీది కాదా? ఇదుగో, నా ఆస్తి మీ ఇష్టము వచ్చినట్లు చేసుకోండి. వ్రాసి యిస్తాను. ప్రస్తుతము మీకు పయికము కావలసి ఉంటే ఈ నగలు తీసుకోండి." అని వెంటనే నగలు తీసి యివ్వబోయింది.

రామారావు కొంచ మాశ్చర్యపడి ఆశ్చర్యము కనబరచకుండా మెల్లిగా గద్గదికతో "నేనే నీ కక్కర లేకపోయినప్పుడు నీ ఆస్తి అంతా నా కెందు కిస్తావో ఆశ్చర్యంగా ఉంది. ఇది ఏదో ఇదివరకటికంటె గొప్ప మోసము చేయదలచుకొన్నట్టున్నావు."

గజగజ వణుకుతూ లేచి నిలుచుని "నేను ఇదివరకు మిమ్ములను మోసము చేశానండీ-మోసము చేశాను టండి-అట్లా మోసము చేస్తే తుపాకి కొరున ఎందుకు చెయ్యక పోయినారు? నేనా-మోసము-మోసము చేయటము-అమ్మో-" అంటూ కండ్లనీళ్ళు కుక్కుకుంటూ చూడ సాగింది అన్నపూర్ణ.

"ఎంత నంగనాచివే-ఇందుకోస మనే పెద్దలు స్త్రీలు ఏడ్పు నవ్వు కోపగించుకొని ఇంకా ఏవేవో పనులు చేసి మొగవాళ్ళను మోసము చేసి తమపనులు నెరవేర్చు కొంటా రని అన్నారు."

"నా అపరాధము ఏమిటో సెల వీయండి. లేకపోతే నే నింకా ఇంత మాట మీనోటినుంచి వచ్చినతరువాత బతుకను."

"ఏమి దొంగవేషము పాపము, ఇంకా అమాయకముగా ప్రవర్తించి నన్ను వెర్రి వెధవాయిను చేదామనుకొన్నావు కాబోలు. నేను ఆ రాత్రి నీవు చేసిన పని చూడలే దనుకొన్నావు కాబోలు. ఈరోజు ఉదయము కూడా కొంచెము సిగ్గు అయినా లేకుండా వాడిని గురించి నన్ను అడుగుతావా?"

కొంచెము వికాసముతో "నేను సీతాపతి అన్నయ్య......"

"అన్నయ్య అన్నయ్య అంటున్నావా?"

"అయ్యో ఇందుకు మీ రింత మనోవ్యధ అనుభవిస్తున్నట్లు మాకు కొంచెమయినా చెప్పక పోయినారా? ఏమాత్రము మీ అనుమానము తెలిసినా ఆక్షణము ఆ అనుమానములో ఉన్న సత్యము మీకు తెలిసేటట్లు చేసేదాన్ని" అంటూ గోడవంక ఆమె చూపేసరికి దీపపుకాంతి వారి ఉభయుల నీడా గోడమీద కనుపించింది. వెంటనే ఆమె అతని ముందు ఒక గజము దూరము వెళ్ళి నిలుచుని వంగి, ఏదో అందుకో బోతున్నట్లు నిలుచుని అన్నది. "ఆగోడమీద చూడండి. ఏలా నీడ పడిందో చూడండి. చూడండి." గోడమీద నీడలో అతను కూర్చున్నట్టున్నూ అతని కంఠాన్ని అన్నపూర్ణ కౌగిలించుకొన్నట్టున్నూ కనుపించింది. అతను ఆశ్చర్య పోయినాడు. తదేకముగా ఆ నీడవంక చూస్తూ "ఏమిటి ఏమిటి!" అన్నాడు రామారావు.

"ఇదే రజ్జు సర్పభ్రాంతి అంటే—ఆ రాత్రి మీకు తలకాయనొప్పి వచ్చిందే- మీరు ఇంకా కొంచెంసేపటికి వస్తారు అనంగా సీతాపతి అన్నయ్య బాల్కనీలో ఉన్నాడు. నే నేమో గదిలో బల్లమీద ఉన్న పుస్తకము అతనికి అందించడానికి వంగేసరికి మే మిద్దరము కౌగలించు కొంటున్నట్టు నీడ కనుపించి అన్నయ్య నవ్వుతూ ఆనీడ నాకు చూపించి వాడు కూడా నండి. అది చూసే కాబోలు మీరు అనుమాన పడ్డారు అనుకొంటాను. ఇక లేవండి మీగొడవ ఇదా అండి" అతన్ని లేవదీయ బోయింది. అతను ఆనీడ చూస్తూ ఏమిటో వెర్రివాడిలాగా ఉండేసరికి ఇక లేవండి భోజనము చేతాము! మొగవాండ్లు ఎంత వెర్రివాండ్లు అండీ అని అతన్ని లేవదీసింది. అతను కొంచెము సిగ్గుతో లేచి నిలుచుని ఇంకా గోడవంక చూస్తూ ఉండేసరికి "నయము: ఎప్పుడు నీడ అట్లాగే ఉంటుం దని అనుకొంటున్నారా ఏమండీ" అన్నది అన్నపూర్ణ.

# చిత్తరువు

శ్రీ మొక్కపాటి నరసింహ శాస్త్రి

## ౧

లజ్ చర్చి రోడ్డు, మైలాపూర్, జూలై ౧౪, ౧౯౧-

అయ్యా: నే నీరోజు ఉదయమే ఇక్కడికి వచ్చినాను. నేటి సాయంకాల మైదు గంటలకు తమరు నా బసకు దయచేసిన ట్లైతే మన ముభయులమూ కాలేజీకి వెళ్ళి పిల్లను చూచి, తరువాత సంగతి మాట్లాడవచ్చును. ఈ సాయంకాలము పిల్లను చూచుటకు ప్రిన్సిపాలు అనుమతిని పొందినాను. తొందరపని యుండుటచేత తిరిగి ఈ రాత్రే నేను వెళ్ళిపోవలెను. కాబట్టి తాము సాయంకాలము తప్పక దయ చేస్తారని నమ్ముతాను.

విధేయుడు,

.భ. కుటుంబరావు.

ఆనాడు సాయంకాలము కొంచెము వర్షము కురిసి వెలిసింది. అస్తమించబోతున్న సూర్యకాంతి బంగారు నీరువలె చూడడానికి ముచ్చటగా ఉన్నది. ఆకు నంటిఉన్న ప్రతివానచినుకూ నక్షత్రములాగ ప్రకాశిస్తున్నది. తూర్పున పెద్ద ఇంద్రధనస్సు ఆకాశాన్నీ భూమినీ కలిపి వేసింది.

చేట్ పట్ లో తనబంగాళాలో పడకగదిలో అద్దానికి ఎదురుగా నుంచుని ప్రపంచములో తనకు మరొక ఆలోచన ఏమీ లేనట్లుగా ఏకదీక్షతో 'టై' సవరించుకుంటూ నిలబడ్డాడు నారాయణరావు. సవరణ అయిన తరువాత కాస్తసేపు తన ప్రతిబింబమును చూచుకొని [illegible]

తొడుక్కొని పట్టుసేలంకండువా పైన వేసుకొని పైఉత్తరము బల్లమీద నుంచి తీసి మళ్ళీ చదువుకొని జేబులో పెట్టుకొని చేతికర్ర తీసుకొని మళ్ళీ అద్దములో ఒకసారి చూచుకొని అద్దముపైన గోడ నున్న పటము కేసి చూచినాడు.

ఆ పటమునందు సుమారు ఇరవై సంవత్సరముల వయస్సు గల జవ్వని రూపు చిత్రించి ఉన్నది:

'కలకల నవ్వినట్ల తెలిగన్నుల నిక్కమ చూచినట్ల తో
బలుక గడంగినట్ల కదు భావగభీరత లబ్బినట్ల పెం
పొలయ దనర్చి జీవకళ యుట్టిపడ, ...

చిత్రించిన ఆపటము చూస్తే ఆదులో ఉన్నరూపవతి జీవము తాల్చి ఉంటే ఇంకా ఎంత అందముగా ఉండేదో అనిపిస్తుంది. ఆ కన్నులలో గభీరత ఎంతమందిని ముగ్ధులను చేసిందో అని ఆలోచన కలుగుతుంది. ఆ పెదవులపైన నాట్యమాడే నవ్వుల ఎంతమందికి మతిభ్రమ కలుగజేసిందో అని భయము వేస్తుంది. తాను ప్రేమించిన పురుషునకు స్వర్గసౌఖ్యము చవి చూపించి మర్త్యలోకమునుంచి ఎత్తివేసి దేవత్వము ఇప్పించే ఉంటుంది.

ఆ పటముకేసి నిదానముగా ఒక్కమారు చూచి "మోహినీ, పోదు తున్నాను, నీ తుదికోరిక చెల్లించబోతున్నాను; తరువాత న న్నేమీ అనకు!" అన్నాడు నారాయణరావు. ఆ సౌందర్యరాశి, కన్నులలో ఆనందము నాట్యమాడుతున్నట్లూ, పెదవులు వెళ్ళండి అంటున్నట్లూ నారాయణరావుకు తోచింది. నిట్టూర్పు విడిచి నెమ్మదిగా మేడమెట్లు దిగి వచ్చి బయట నున్న మోటారుకారు ఎక్కి ఆయన లజ్ చెర్చి రోడ్డుకు వెళ్ళినాడు.

## ౨

నారాయణరావు సుమారు ముప్పైఅయిదు సంవత్సరముల వయసు వాడు, బ్రాహ్మణుడు, కులీనుడు. ఇరవైరెండో సంవత్సరమునందే బి. ఏ.,

ప్యాస్ అయినాడు. తండ్రి వెంకట్రావు రత్నవ్యాపారము చేస్తూ ఉండేవాడు. ఆయన చాలా డబ్బు ఆర్జించినాడు. కొడుకు బి.ఏ., ప్యాస్ కాగానే అతనినికూడా వర్తకములో ప్రవేశ పెట్టి ఆరుమాసములు తరిఫీదు చేసి యూరపులోని గొప్పవర్తకులతో ఖాతాలు ఏర్పాటు చేసుకొని రమ్మని పంపించినాడు.

నారాయణరావు సుఖముగా సంవత్సరముపాటు దేశాటనము చేసినాడు. యూరపు అంతా తిరిగి, అమెరికా చూచి, జపానుమీదుగా స్వదేశము చేరినాడు. కావలసినంత లోకానుభవమూ, జ్ఞానమూ, సంపాదించినాడు. ఎక్కువ పెద్దమనిషి తరహా, మర్యాదా సంపాదించినాడు. అతను స్వదేశానికి తిరిగి వచ్చిన ఆరుమాసములలోనే తండ్రి కాలము చేసినాడు. ఆయన పోయినప్పటినుంచీ వ్యాపార మంతా తానే చూచుకోవడ మారంభించినాడు. వర్తకులలో ఇంత మంచివాడూ, న్యాయజ్ఞుడూ మరొకడు లేడనేపేరు కొద్దికాలములోనే సంపాదించినాడు. దానితో వ్యాపారము హెచ్చినది. వ్యాపారము హెచ్చినకొలదీ అతనికి శాంతమూ, సౌమ్యతాకూడా హెచ్చినవి. అతని పెదవుల పైన మందహాసమూ కన్నులలో దయా, ముఖమునందలి గాంభీర్యమూ చూచి, "ఏమి మనిషి, ఏమి అదృష్టము!" అనుకోని వాళ్లు లేరు.

నారాయణరావు బి. ఏ. సీనియర్ చదువుతూ ఉండగా భార్య కాపురానికి వచ్చినది. మొదిలో దూరములాగా ఒకరి మనస్సులో ఒకరు మెలగుతూ, ఎప్పుడూ ఒకరి నొకరు విడువకుండా దేవతలకుకూడా అసూయాజనక మైన ఆనందమును అనుభవిస్తూ ఉండేవారు. ఈ దంపతులను చూచి మెచ్చుకొననివారు కానీ, వీరి అదృష్టమును కొనియాడనివారు కానీ లేరు.

ఇంతమంది కళ్ళా నోళ్ళా పడ్డ సౌఖ్యము ఎన్నాళ్ళు నిలుస్తుంది. ఎంత వంతో నటాయక మైనా తరకాలభూర్జిత ఎల్లకాలమూ ఎందు కుం

టుంది! చూస్తూ చూస్తూ ఉండగా నాలుగురోజులు విషజ్వరము కాచి పూర్తిగా వికసించిన పుష్పమువలె రాలిపోయింది ఇతని భార్య. ప్రాణము పోయేవరకు బాగా తెలివిగా ఉన్నది. జబ్బులోకూడా ఒక్క క్షణమైనా విడువకుండా నారాయణరావామెను కనిపెట్టుకొనే ఉన్నాడని వేరే చెప్పడమెందుకు! ఇంకొకగంటకు ప్రాణము పోతుం దనగా భర్త దగ్గర సెలవు పుచ్చుకొని అతనిని బెంగపెట్టుకొనవద్దని ధైర్యము చెప్పి ఏమీ సందేహించక తిరిగీ వివాహము చేసుకొమ్మని కడసారి ఒక ముద్దు పెట్టుకొని అతని చేతులలోనే ప్రాణములు విడిచింది.

కొంతసేపటివరకూ నారాయణరావుకు ఒళ్ళు తెలియలేదు. చేష్టలుడిగి కళావిహీనము కాక మామూలుగా నిద్రపోతూ ఉన్నట్లుగా ఉన్న తన భార్య ముఖంకేసి రెప్ప వాల్చకుండా చూస్తూ అలాగే కూర్చున్నాడు. తరువాత తెలివి తెచ్చుకొని ఆమెకు అంత్యవిధులు జరిపినాడు.

తరువాత కొన్ని దినాలవరకూ మతి లేనివానివలె తిరిగినాడు. భార్య పోయిన సంగతే తెలియనట్లుగా ఉండేవాడు. ఏ పుట్టింటికో వెళ్ళినట్లు భావించుకొంటూ ఉండేవాడు. అందరూ ఇతనికి పిచ్చెత్తుతుం దేమో అని భయపడే వాళ్లు. కొన్ని దినాలిలా జరిగిన తరువాత అతనికి మతి కుదుట పడ్డది. తననష్టమును తెలుసుకొన్నాడు. దుఃఖసముద్రము దాటడానికి అతను పడ్డ అవస్థ చెప్ప శక్యము కాదు.

నారాయణరావు భార్యతో ఒకసారి బొంబాయి వెళ్ళినప్పుడు అక్కడ ఒక ప్రసిద్ధ చిత్రకారుని చేత తన భార్య రూపమును చిత్రింపించి, అప్పటినుంచీ దానిని తన పడకగదిలో పెట్టుకొన్నాడు. ఆ పటము అంత సజీవముగా ఉన్నందుకు అనేక మంది చిత్రకళానిపుణులు ప్రశంసించినారు. భార్య ఊళ్ళో లేనప్పుడు రోజూ లేవగానే ఆ బొమ్మ నొక్క ముద్దు పెట్టుకొని మరీ ఇవతలికి వచ్చేవాడు. భార్య పోయిన పిమ్మటకూడా ఆ పటమున ఆమె జీవించి ఉన్నట్లుగానే భావించి ఆమెతో మాట్లాడుతూ ఉండేవాడు. కొత్తగా కాపురానికి వచ్చిన రోజులలో ఆమెకు

'మోహిని' అని అతను ముద్దుపేరు పెట్టుకొన్నాడు. ప్రతిరోజూ సాయంకాలము ఇంటికి రాగానే దుస్తులు విడిచి సావకాశముగా పటము దగ్గర కూర్చొని, "మోహినీ, ఇవాళ ఏమి జరిగిం దనుకున్నావు" అని ఆనాటి విశేషము లన్నీ పూస గుచ్చినట్లు చెప్పేవాడు. మళ్ళీ ఉదయాన బయటికి వెళ్ళేటప్పుడు, "మోహినీ, వెళుతున్నాను, ఇవాళ" అని ఆరోజు తన కున్న పని అంతా చెప్పేవాడు. ఇలా చెప్పేటప్పుడు ఆమె ముఖము ఒకప్పుడు నవ్వుతున్నట్టూ, ఒకప్పుడు చిట్లించినట్టూ అతనికి కనబడుతూ ఉండేది. ఆమె ముఖకైఖరిని బట్టి తాను చేయబోయే కార్యము ఆమె కిష్ట ముందో లేదో తెలుసుకొని ఆప్రకారము తాను నడుచుకొంటూ ఉండేవాడు.

భార్యపోయి సుమారైదు సంవత్సరము లైనది. మొదటిరోజులలో ద్వితీయ వివాహము చేసుకొనవలసిన దని అనేక మంది హితోపదేశము చేసినారు. అనేక సంబంధము లెక్కడెక్కడనుంచో వచ్చినాయి. ఆ సంగ తెప్పుడూ తన దగ్గర తలపెట్ట వద్దని తన స్నేహితులతోటి గట్టిగా చెప్పినాడు. తన కష్టములు మరచి పోవడానికి క్రమేణా వ్యాపారము బాగాచేసి ధనార్జన చేయవలె ననే పట్టుదల బయలు దేరినది. డబ్బు విశేషముగా వస్తూ ఉన్నకొద్దీ అతనికి లుబ్ధత్వము హెచ్చినది. దానితో పాటు హృదయము కొంచెము కర్కశత్వము వహించినది. దయాదాక్షిణ్యములు తగ్గినాయి. వెనుకటి సౌమ్యత వెనుకంటింది. చిరాకూ కోపమూ హెచ్చినాయి. తన స్వభావములోని మార్పు తానే కనిపెట్టినాడు. ఇటువంటి మార్పుకు కారణ మేమై యుంటుందా అని విచారించినాడు. తనలో మంచిచెడ్డలను సవరించుటకూ, హృదయ కాఠిన్యమును మృదుల పరచుటకూ, ప్రేమ స్వరూపురా లైన రాధిక ఒకర్తె లేకపోవడముచేత కదా అను కొన్నాడు. ఇలా కొంతకాలము అఖండైశ్వర్యములో ఏకాకిగా ఉంటే తనలో ఉండే మానవత్వము పూర్తిగా నశించి పశుప్రాయుడనై పోతానేమో నని భయపడినాడు. అందుకని తన్ను రక్షించడానికి సమ

ర్థురాలైన ప్రేమమూర్తి ఎవరైనా దొరికితే బాగుండు ననుకొన్నాడు.

భార్య తన అవసానకాలమందు ఈయనను మళ్ళీ వివాహము తప్ప కుండా చేసుకొమ్మన మని మరీ మరీ చెప్పి పోయినది. అంతటి తోటి ఊరుకోకుండా ఈ మధ్య రోజూ రాత్రి కలలో కనబడి వివాహము చేసు కొమ్మన మని ఈయనను బలవంత పెడుతున్నది. పటములో కూడా ముఖ వికాసము కొంచెము తగ్గినట్లుగా ఉన్నది. అందుచేత వివాహ మెందుకు చేసుకొన కూడదా అని ఈయనకు ఆలోచన పుట్టినది. "చేసుకొంటే పూర్వసుఖము లన్నీ ఎలా మరిచిపోయి మళ్ళీ మొదటికి రావడము! ఆమోహిని స్థానములో ఇంకొకరిని ఎలా నిలపడము! మోహిని కల్పించిన హృదయమును మళ్ళీ ఇంకొకరికి ఇవ్వడ మెలాగు! ఇవ్వడానికి మాత్ర మేముంది! నా హృదయాన్ని నా మోహినే తీసుకొని పోయింది. అలాంటప్పుడు హృదయ శూన్యుడ నైన నన్ను ఎవరు పెండ్లాడుతారు? పెళ్ళి చేసుకుంటే మట్టుకు నా మోహిని జ్ఞాపకం రాకుండా ఎలా ఉంటుంది? అలా ఉంటే బ్రతకడ మెలాగు! నే నింకొకళ్ళను ప్రేమించనప్పుడు వాళ్లు మట్టుకు నన్ను ప్రేమిస్తా రన్న మా టేమిటి? ఎందుకు ప్రేమించాలి. పోనీ, అన్నిటిమాటా అలా అట్టిపెట్టి నా కిప్పుడు ముప్పైయైదేండ్లు ఉన్నాయి కదా! ఏ పన్నెండేండ్ల పిల్లనో పెండ్లి చేసుకొంటే - తనకంటె ఇరవైమూడేండ్లు పెద్దవాడిని - నా మీద అంత అనురాగ ముండ మంటే ఎలా ఉంటుంది! పోనీ ఆ సంకోచ మెందుకు? పెద్దపిల్లనే ఎందుకు పెండ్లాడ కూడదు? నన్ను వెలి వేస్తా రన్న భయము లేదు. నా ఇంటికి రాకపోతే ఎలాగా అన్నంత ఆప్తులా లేరు. తక్కిన నా శ్రేయస్సు కోరేవారు ఎలాగూ వస్తారు. అవును, అలా చేస్తే బాగుంటుంది. పిల్లకు జ్ఞానము వచ్చి ఉంటుంది, సంగ తంతా చెప్పినపిమ్మట నచ్చితేనే పెండ్లాడుతుంది. అలా ఇష్టపడ్డ పిల్ల ఎప్పుడు దొరికితే అప్పుడే పెండ్లాడవచ్చును. అని కొన్నాళ్లు తర్కవితర్కములు చేసుకొని చివరకు తాను వివాహము చేసుకొంటా నని, సంబంధ మెక్కడ నైనా ఉంటే విచారించవలసిన దనీ, ఒక స్నేహితునితో చెప్పినాడు నారాయణరావు.

## 3

ప్రపంచకములో 'నా' అన్నవాళ్లు ఎవ్వరూ లేని ఏకాకిని రుక్మిణి. ఇరవైరెండేండ్లు ఉంటాయి. ఆమె నెంతిసేపు చూచినా చూడబుద్ధి తుంది. సుగుణవతీ, రూపవతీ, పోతపోసిన బంగారుబొమ్మ. నిశ్చయముగా నిలుచున్నప్పుడు చూస్తే ఆమె అసమానుడైన శిల్పి ఎవడో చెక్కిన విగ్రహామువలె ఉంటుంది. అవయవసౌభాగ్యములో గాని రూపసంపదలో గాని రేఖావిలసనలో గాని శరీరలావణ్యములో గాని ఆమెను వంక పెట్ట డానికి ఎవ్వరికీ శక్యము కాదు. మలయమారుతోచ్చలిత మైన లేదీగవలె ఆమె కదలినప్పు డెప్పుడూ విలాస మొలుకుతూ ఉంటుంది అంత నాజూకుగా ఉన్న దని కేవలము అబల కాదు. ఆ తీర్చినముక్కూ, కన్నుగా దగ్గరగా ఉన్న పెదవులందలి పట్టుదలా, కన్నులలో లోతు, మెరపు మెరసినట్లు ఒకొక్కొక్కప్పుడు కళ్ళు తళుక్కు మన్నప్పుడు వాటిలో కన బడే రాజసమూ, చూస్తే చరిత్రలలోని రాజపుత్ర స్త్రీలు జ్ఞప్తికి వస్తారు.

ఆమె పేద బ్రాహ్మణ కుటుంబములో పుట్టినది. తల్లి దండ్రుల కామె ఒక్కర్తె. నిరుపేద లైనప్పటికీ ఏలోటూ లేకుండా వా రామె నెంతో గారాబముగా పెంచుకొంటూ ఉండేవాళ్ళు. కాని దురదృష్టమువల్ల ఆమె పెడవరయేటనే రెండుమూడు రోజులు హెచ్చు తగ్గుగా తల్లితండ్రు లిద్దరూ కాలము చేసినారు. దిక్కులేని పిల్లను ఆ స్థితిలో ఎవళ్ళు నెత్తిమీద పెట్టు కుంటారు!

భమిడిపాటి కుటుంబరా వని ఒక సంపన్న గృహస్థు, ధర్మదేవత, న్యాయ వాది. న్యాయ మైన కేసుగా ఉండి ఆయన చేపట్టినాడూ అంటే అది నెగ్గిన దన్న మాటే! ఆయనకు దైవము ఒక్కటే లోటు చేసినాడు: సంతానము లేదు. అందుచేత ఆయనా, ఆయన భార్యా, దేశములో ఉండే దిక్కులేని వాళ్ళ నందరనూ తమ పిల్లలుగా భావించుకొని తమకు చేతనైన సహాయము చేస్తూ ఉండేవాళ్ళు. చుట్టుపక్కల ఉండే పల్లెటూళ్లలోనూ ఒకరో ఇద్దరో కుటుంబరావు కుటుంబము వాళ్ళే.

కుటుంబరావుకు రుక్మిణి సంగతి తెలిసినది. వెంటనే ఆయన ఆ పిల్లను రప్పించి దైవనిర్ణయానికి ఆశ్చర్యపడుతూ, "అమ్మాయీ, ఇంక ఇదే నీ యిల్లు అనుకో; తల్లిదండ్రులు లేరని బెంగపెట్టుకోకమ్మా. నన్నూ నా భార్యనూ నీ తల్లిదండ్రులే అనుకొని ఇక్కడనే ఉండు. నీకేమీ లోటుండదమ్మా" అన్నాడు. రుక్మిణి తెల్లబోయి ఒకసారి కుటుంబరావుకేసీ, ఒకసారి ఆయన భార్యకేసీ, ఒకసారి ఆ ఇంటికేసీ చూచి, "నే నిక్కడ ఉండ" నన్నది. కుటుంబరావా పిల్లను దగ్గరకు తీసుకొని నిమురుతూ, "భయపడకమ్మా! ఒక్కతెవు ఉంటే చాలా చిక్కిన బడతావు. ఇక్కడ కూడా మీ ఇంట్లో ఉన్నట్లే ఉండవచ్చును. నీకు కావలసినన్ని చొక్కాలూ పరికిణీలూ బొమ్మలూ అన్నీ కొని ఇస్తాను. నీ స్నేహితురాండ్రంతా ఇక్కడకే వచ్చి నీతో ఆడుకొంటూ ఉంటారు" అన్నాడు.

భయము చేతనూ విచారము చేతనూ కన్నీరు కారుస్తూ ఉన్న రుక్మిణిని కుటుంబరావుగారి భార్య ఎత్తుకొని కన్నీరు తుడిచి, ఓదార్చి తల దువ్వి నీళ్ళుపోసి ముఖాన బొట్టూ, కళ్ళకు కాటుకా, పెట్టి వాకిట్లోకి తీసుకువచ్చినది. ఇప్పటికి రుక్మిణికి కొంత బెదురు వదిలింది. కుటుంబరావుగారు బండి పిలిపించి రుక్మిణిని తీసుకొని బజారు వెళ్ళి ఆ అమ్మాయికి పదిపన్నెండు రకాల చొక్కాలు, పరికిణీలు కుట్టించి అయిదారు బొమ్మలు, కొన్ని మిఠాయి, పకోడీలు, కొనిపెట్టి ఇంటికి తీసుకొచ్చేసరికి రుక్మిణి బ్రహ్మానంద పడి తన కష్టాలన్నీ మరచిపోయినది. వారము దినముల వరకూ ఇక్కడ నియమములు కట్టుబాట్లు, ఆమెకు కొంచెము కష్టము కలిగించినాయి. మధ్యన ఒకటి రెండు సార్లు "నే నిక్కడ వుండను, వెళ్ళిపోతా" నని బెదిరిస్తూ వచ్చింది. అప్పటికేదో లంచము పుచ్చుకొని మళ్ళీ సమాధాన పడుతూండేది. క్రమేణా ఇక్కడి సౌఖ్యములలో తన పూర్వ చరిత్ర మరచిపోయింది.

కుటుంబరావుగారు రుక్మిణికి ఇంటిదగ్గర సంగీతమూ చెప్పిస్తూ బడికి పంపిస్తూ ఉండేవారు. "పన్నెండు సంవత్సరములు వచ్చిన తరువాత "అమ్మా, నీ కిప్పుడు పెళ్ళి చెయ్యనా? బి. ఏ. దాకా చదువుకుంటావా?"

అని అడిగినారు. ఏమి తోచినదో మళ్ళీ ఆలోచించకుండా నిర్భయంగా "బి. ఏ. దాకా చదువుకోవలె నని ఉన్నది. నా కిప్పుడు పెళ్ళి చేసుకోవలె నని లేదు" అన్నది. కుటుంబరావు భార్య అందు కంగీకరించక పోయినా ఆ అమ్మాయికి ఇష్టము వచ్చినట్లే చేయవలె నని మళ్ళీ వివాహ ప్రశంస లేకుండా చదువు చెప్పించినారు. సకాలములో స్కూలుఫైనలు క్లాసు ప్యాసు అయినది. అక్కడనుంచి చెన్నపట్నము పంపించి క్వీన్ మేరీస్ కాలేజీలో ఇంటర్‌మీడియేట్‌లో ప్రవేశ పెట్టినారు. ఆమె బి. ఏ. చదువుతూ ఉండగా ఈ సంబంధము సంగతి కుటుంబరావు గారికి తెలిసింది. భార్య కూడా అమ్మాయికి త్వరగా వివాహము చెయ్య మని తొందర పెట్టడముచేతా, సంబంధము బాగుం దని తోచడముచేతా స్నేహితులద్వారా నారాయణరావుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినారు. నారాయణరావు పిల్లని చూడడానికి అంగీకరించగానే ఆమెను చూడడానికి కాలేజీ ప్రిన్సిపాలు అనుమతిని పొంది చెన్నపట్నము వచ్చి నారాయణరావుకు పై ఉత్తరము వ్రాసినారు.

౪

వాకిట్లో మోటారుచప్పుడు వినగానే కుటుంబ రావుగారు, వారి స్నేహితులూ లేచి వచ్చి నారాయణరావుగారిని ఆహ్వానము చేసి, లోపలికి తీసుకు వెళ్ళినారు. కొంచెము ఇష్టాగోష్ఠి అయిన పిమ్మట కుటుంబరావుగారూ వారిస్నేహితులూ కూడా దుస్తులు ధరించి నారాయణరావుగారితో కాలేజీకి బయలుదేరినారు.

కుటుంబరావుగారు మధ్యాహ్నమే కాలేజీకి వెళ్ళి రుక్మిణితోటి అదివరకు ఉత్తరములద్వారా తెలిపినదీ, తాను కొత్తగా స్నేహితులవల్ల విన్నదీ రుక్మిణితో సావకాశముగా చెప్పినారు. అప్పటినుంచీ రుక్మిణికి ఏమీ తోచింది కాదు. హృదయము కల్లోలముగా ఉన్నది. ఆపూట కాలేజీలో

చెప్పిన దేమీ తల కెక్క లేదు. తనజీవితములో మూడవసారి . మార్పు కలగబోతున్నది. ఈ మార్పుకూడా వెనుకటివలె మంచికే అవుతుందో చెడుకే అవుతుందో. దీనిపైన తనభావిజీవిత 'మంతా ఆధారపడి ఉన్నది. ఈనారాయణ రా వెలాటివాడో, పైకి లోకాని కెంతమంచిగా కనపడ్డా అంతర్యం మెట్లా ఉంటుందో? నాగరికులలో ప్రపంచకానికి కనబడే మనిషికీ ఇంట్లో భార్యకు, పిల్లలకూ కనబడేమనిషికీ ఎంతో తారతమ్య ముంటున్నది. అలాటివా డౌతాడా, లేకపోతే మానాన్నగారూ కుటుంబ రావుగారికిమల్లే ఉంటాడా! చూపుల కెట్లా ఉంటాడో మనిషి? రెండవ పెళ్ళివాడుకూడా అంటున్నారు. ముసలివాళ్ళకము పడ్డదేమో. పోనీ, వాళకనుమాట ఏలా ఉన్నా తనప్రేమ అంతా ఇదివర కొకరికి అర్పించిన తరువాత నా కేమి మిగులుతుంది? ఏన్వల్పలోపము వచ్చినా తన ప్రధమ పత్నితో సాపత్న్యము తెచ్చి ఆమె మంచి దని సాధిస్తూ ఉంటాడేమో. అన్నిటిమాటా అటుంచి, పెళ్ళి కాగానే తీసుకు వెళ్ళి మళ్ళీ కాలేజీకి రా నివ్వడేమో. ఒక వేళ ఇప్పుడు రా నిచ్చినా, ఈపరీక్ష కాగానే మామూలు స్త్రీలవలె న న్నింక మళ్ళీ బయటకు వెళ్ళ నివ్వడేమో. ఇంతచదువు చదువు కొని ఆత్మమానమూ లోపల అణగి ఎలా ఉండగలను? నాన్నగా రడిగిన ప్పుడు మొదటిపెళ్ళి వాడు కావా 'లనక ఏమీ ఆలోచించకుండా దీని కెం దుకు సమ్మతించాను? ఏమో ఇంతవరకు దైవము నాపాలిట ఉండి అన్ని విధాలా నాకు మేలే చేస్తున్నాడు కదా. దీనివల్లకూడా మేలే కలుగుతుం దని ఎందు కనుకోకూడదు? నా కిప్పు డీసందేహ మెందుకు అని పరి పరివిధముల ఆలోచిస్తూ గాలిలో గాలిపడగవలె తటపటాయిస్తూన్న మనస్సుతో శుభ్ర మైన దుస్తులు ధరించి చక్కగా తల దువ్వుకని ముఖమున ఎఱ్ఱని తిలకము తీర్చి గదిలో పచారు చేస్తూ మధ్యమధ్య తన తండ్రి మొదలయినవారు వస్తున్నా రేమో అని కిటికీలోనుంచి తొంగిచూస్తూ మహా ఆదుర్దాతో వేచియున్నది.

కాలేజీగడియారము ఆరు గంటలు కొడుతుండగా కాలేజీ కాంపౌండు

లోకి మోటారుకారొకటి వచ్చి నిలిచింది. రుక్మిణి కిటికీలోనుంచి తొంగి చూచింది. కారులోనుంచి కుటుంబరావుగారు, మరి ఇద్దరూ దిగినారు. ఇందులో ఎవరు నారాయణరావుగారై ఉంటారని ఆలోచిస్తుండగానే నౌకరు ఒకతె వచ్చి రుక్మిణిని పిల్చి "మీకొరకు ఎవరో వచ్చినారు" అని చెప్పింది. రుక్మిణి ఒక్కసారి అద్దములో చూచుకొని హృదయములో ఆందోళనము పైకి వినబడుతుందేమో అనే భయముచేత గుండెల నదుముకొని మెల్లిగా తనతండ్రి మొదలయినవారు ఉన్న సిటింగురూమ్ లోకి వచ్చింది. లోపలికి రాగానే కుటుంబరావుగారు లేచి రుక్మిణిని తీసుకవెళ్ళి కుర్చీలో కూర్చోపెట్టి నారాయణరావుగారిని ఎదుట వర్చారు. నారాయణరావు రుక్మిణులు ఒకరి నొకరు రెప్ప వాల్చక తదేకదీక్షతో చూచుకొన్నారు. ఆవీక్షణ క్షణములోనే ఒకరి అంతఃకరణ లొకరికి తెలిసిపోయినాయి. నారాయణరావు కన్నులలో ప్రేమపూరిత మైన హృదయము, నిర్మల మయినమనస్సు, దయాదాక్షిణ్యాది సద్గుణములు రుక్మిణికి గోచరించినవి. యథాప్రకారముగానే దైవము మన పాలిట ఉన్నాడు. ఏవిధమైన సంకోచమూ లేకుండా ఈయనను వివాహమాడి నా జీవిత మంతా ఈయన చేతులలో పెట్టవచ్చును. ద్రోహ మేమీ ఉండదు, అనుకున్నది రుక్మిణి.

రుక్మిణి కన్నులలో తొందర సందేహము నారాయణరావుకు కనుపించినాయి. ఈ అమ్మాయి సందేహము కొంత తీర్చి ధైర్యము చెప్పాలి. ఏలాగైనా మొత్తముమీద చురుకుపాలెక్కువ. కొంత హడావిడిగానే ఉంటుంది. అయినా ఇది బాగానే ఉన్నది. ఈమెకు నేను నచ్చితే నా కేమీ అభ్యంతర ముండ దనుకున్నాడు.

నారాయణరావు రుక్మిణి నుద్దేశించి తన స్థితిగతులు, తనకు మోహినియందుండుకున్న ప్రేమాతిశయములు మొదలైనవి చెప్పి "నే నిప్పుడు శూన్యహృదయములో ఉన్నాను. ఈలాటి మనిషిని నీవు వివాహమాడి ప్రేమపూరితుని చేయగల నన్నే ధైర్య ముంటే నిన్ను వివాహము చేసుకొనవలె నని ఉన్నది. పెండ్లి అయినంతమాత్రమున నీవిద్య కేమీ అభ్యంతర

మాండదు. నీ పరీక్ష అయ్యేవరకూ నీవు ప్రతిరోజూ కాలేజీకి వస్తూ పోతూ ఉండవచ్చును. ఉన్న సంగతంతా రవ్వంతైనా దాచకుండా యథార్థముగా నీతో చెప్పినాను. నీవు సావకాశముగా ఆలోచించుకొని నీనిశ్చయము నీతండ్రి గారి ద్వారా నాకు తెలియపర్చ వలసినది. ఈక్షణమందే నీవు సమాధానము చెప్పవలసిన తొందర లేదు'' అని కుటుంబరావు గారి వైపు తిరిగి, ''అయ్యా! ఇంక నాకు సెలవు ఇప్పిస్తే నేను వెడతాను. మీరూ మీఅమ్మాయీ సంప్రతించుకొని ఆమె ఇందుకు అంగీకరించినట్లయితే వివాహమునకు ఎప్పుడు వీలుగా ఉంటుందో ఆలోచించి నాకు తెలియపర్చండి. సాధ్యమైనంత త్వరలో ఏసంగతీ నాకు తెలిసినట్లయితే నా ప్రయత్నము మీద నేను ఉంటాను. సెలవు'' అని వెళ్ళిపోయినాడు.

ఆయన వెళ్ళగానే కుటుంబరావుగారు ''ఏ మమ్మా, నే నీరాత్రి బయలు దేరి మెయిలుకు వెళ్ళిపోవాలి. నీవు సావకాశముగా ఆలోచించి నాకు ఉత్తరము వ్రాస్తావా? నీవు అసలు ఎవరినైనా వివాహము చేసుకోవలెనని ఉంటే చెప్పు. ఇంతకంటె మంచి సంబంధము దొరకడము దుర్లభమని నా నమ్మకము. అయినా నువ్వు ప్రాజ్ఞురాలవు. వరుణ్ణి చూచుకొన్నావు. ఆయన చెప్పినదంతా విన్నావు. అందులో ఏమి తేడా లేదు. కాబట్టి నీవు బాగా ఆలోచన చేసి నాకు త్వరలో ఉత్తరము వ్రాయి. మన మాలస్యము చెయ్యడము బాగుండదు. ఇంక నాకు వేళ అవుతున్నది. నే వెడతాను. ఉత్తరము వ్రాయడము మట్టుకు ఆలస్యము చెయ్యకు'' అని కుటుంబరావుగారు, వారి స్నేహితులూ లేచి వెళ్ళిపోయినారు.

రుక్మిణి తొందరగా తన గదికి వెళ్ళి నిర్హేతుకముగా పొరలి వస్తున్న కన్నీటి తరగల నాపుకొని, ఈశ్వరున కొకసాష్టాంగ నమస్కారము చేసి తన అంగీకారము అప్పుడే ఉత్తరము వ్రాసి ఆరాత్రి మెయిలుకే పంపించింది.

౫

ఒక శుభవారమునాడు లజ్ చర్చిరోడ్డులో కుటుంబరావుగారి స్నేహితు నింట్లో కొద్దిమంది స్నేహితుల సమక్షమందు రుక్మిణికి వివాహము జరిగింది. మరునాడు నారాయణరావు భార్యను తన ఇంటికి తీసు కొచ్చాడు.

ఉదయము సుమారు ఏడు గంట అవుతుంది. మంచుతెర అప్పుడప్పుడే తొలగి పోతున్నది. తోటలో చెట్లు తమ నిద్రామాంద్యమును విడిచిపెట్టి నూతనదంపతులకు స్వాగత మిచ్చినాయి. పారిజాత సౌరభములు ఇంకా వాయుతరంగములపైన తేలియాడుతున్నవి. పక్క నున్న తామర కొలనిలో ఎర్రతామర ఒకటి కలకల నవ్వింది. చెట్లపయిన పక్షులు ఆనందదాయక మైన పాటలను పాడినాయి. నౌకర్లంతా గుమ్మము దగ్గర నిలబడ్డారు.

మొదటి కారులోనుంచి నారాయణరావు గారు, రుక్మిణి దిగినారు. రెండవ కారులోనుంచి కుటుంబరావుగారు, భార్య దిగినారు. మరిరెండు కారులలో వారి స్నేహితు లంతా దిగినారు. నౌకర్లంతా వధూవరులకు స్వాగత మిచ్చినారు. తోటమాలీ దివ్యమైన రెండు గులాబీ పూలదండలతో వధూవరుల నలంకరించినాడు. నారాయణరావుగారు ఆతనిభార్యను బంధువులను, స్నేహితులను లోపలికి తీసుకు వెళ్ళి ఇల్లంతా చూపించినాడు. ఆగృహ నిర్మాణమూ, అందులో చిత్రవస్తు సముదాయమూ చూపరులను ఆశ్చర్యానంద భరితులను గావించినాయి. ఆనాడు నారాయణరావు ఊరిలో తన స్నేహితుల నందరినీ పిల్చి గొప్పవిందు చేసినాడు.

సుమారొక వారము దినము లున్న తరువాత కుటుంబరావుగారూ భార్యా తదితర బంధువులు నారాయణరావుగారి దగ్గర సెలవు పుచ్చుకొని తమ స్వస్థానములకు చేరినారు.

నారాయణరావుగారు రోజూ భార్యను తీసుకు వెళ్ళి కాలేజీలో దిగ బెట్టి మళ్ళీ సాయంత్రము ఆమెకోసరము వెళ్ళి, ఆమె రాగానే ఇద్దరూ బీచ్‌వద్దను కొంతసేపు కాలయాపన చేసి సాయంకాలము ఇంటికి వచ్చేవారు.

రుక్మిణి మొదట అనుకున్నట్టుగానే నారాయణరావు చాలా ఉత్తముడు. ఇటువంటి సంబంధము దొరికింది కదా అని చాలా సంతోషించింది. ఈమెకు ఏలోటూ లేకుండా నారాయణరావు వెయ్యికళ్ళతో కనిపెడుతూ ఉండేవాడు. ఈమెకు ఏమి కావలెనో అడక్కుండానే తను తెలిసికొని తెచ్చి ఇస్తూ ఉండేవాడు. రుక్మిణికూడా దినదినము నారాయణరావు పైన ప్రేమామృతము అధికముగా కురిపిస్తూ ఉండేది. ఒకనాడు నారాయణరావు తనగదిలో పటము తీసి చూసి "ఏమి మోహినీ, ఈపిల్ల నన్ను మరిపించేటట్టుంది. నన్నుమట్టుకు ఏమీ అనవద్దు. ఇదంతా, నువ్వే తెచ్చిపెట్టుకున్నదే కదా" అన్నాడు. పటములో పెదవులు చిరునవ్వు నవ్వినాయి.

యుక్తకాలములో రుక్మిణి పట్టపరీక్షయందు కృతార్థురాలయినది. అంతటితో చదువు ముగించినది. ఆమె కింక రోజూ కాలేజీకి వెళ్ళవలసిన పని లేదు. ఇంట్లో పని అంతకంటె లేదు. అస్తమానమూ ఏపుస్తకమో చదువుకోవడము, ఏకుట్టుపనో చూచుకోవడము, ఏసంగీతమో పాడుకోవడము. ఎన్ని చేసినా కాలక్షేపము అయ్యేది కాదు. ఇంట్లో ఒక్కతె. ఎవరింటికైనా వెళ్ళడానికైనా అట్టే పరిచితులు లేరు. కొన్నాళ్ళు నారాయణరావును మధ్యాహ్నము ఫలహారమునకు తను కారుమీద వెళ్ళి తీసుకువస్తూ ఉండేది. మళ్ళీ సాయంకాలము అయిదు గంటలకు అతని కోసము వెళ్ళి అక్కడనుంచి ఇద్దరూ షికారుకో సినీమాకో వెడుతూ ఉండేవారు. రానురాను ఒక్కక్షణముకూడా నారాయణరావును ఎడబాసి ఉండలేక పోయేది.

రామచంద్రయ్య సుమారు డబ్భై సంవత్సరములవాడు. నారాయణరావుగారి ఏజంటు. చాలా నమ్మకస్తుడూ ఘరానామనిషీని. నారాయణరావు తండ్రి కాలమునుంచి కూడా ఈప్రాంతమున వారికుండే వ్యాపా

రము లన్నీ చూస్తూ ఉండేవాడు. ఎప్పుడూ ఒక్కదమ్మిడీ తఖావతు రాలేదు. ఒక్క వల్లెత్తుమాట ఎవరిచేతా అనిపించుకొనలేదు. అతను కాకినాడలో మకాముగా ఉంటూ ఉండేవాడు. ఆయనకు కృష్ణమూర్తి అని ఒక్కడే కొడుకు. ఇంటరుమీడియట్ సీనియర్ చదువుతున్నాడు. రామచంద్రయ్యగారి భార్య పోయి ఏడెనిమిది సంవత్సరము లయింది. అప్పటినుంచీ ఆయనే బహుశ్రద్ధగా కొడుకును పెంచి పెద్దవాణ్ణి చేసినాడు. ఇట్టిస్థితిలో ఆయనకుకూడా అవసానము సమీపించినది. ఆసంగతి తెలిసుకొని నారాయణరావుగారిపేర వారి వ్యవహారము అన్నీ అప్ప చెపుతూ, తన స్థితిగతులు తెలియపరుస్తూ దిక్కులేని తన కొడుక్కు విద్య పూర్తి గావించి వివాహము చేయవలసిన దని ప్రార్థిస్తూ ఒక పెద్ద ఉత్తరము వ్రాసినాడు. వారివద్దనుంచి సమాధానము వచ్చేలోపున నిశ్చింతగా రామచంద్రయ్య పరలోకగతు డయినాడు.

ఈసంగతి తెలియగానే నారాయణరావు కాకినాడ వచ్చి కర్మ అయ్యే వరకూ అక్కడనే ఉండి దాని కయ్యేకర్చు అంతా ఇచ్చి కృష్ణమూర్తిని హాస్టలులో ప్రవేశపెట్టి అతనికి కొంతసొమ్ము ఇచ్చి బెంగపెట్టుకో వద్దని ధైర్యము చెప్పి ఈ పరీక్ష అయిన పిమ్మట బి. ఏ. క్లాసుకి చెన్నపట్నము రావచ్చు నని చెప్పి తను వెళ్ళి రామచంద్రయ్యకు ఇచ్చేజీతము కృష్ణమూర్తికి నెలనెలకు పంపుతూ ఉండేవాడు.

కృష్ణమూర్తి బహు నెమ్మదైనవాడు. నిష్కల్మష మైన హృదయము కలవాడు. ప్రపంచముసంగతి విశేషము తెలియకుండా అజ్ఞానములో పెరిగినాడు. చదువుయందు విశేషము భక్తి శ్రద్ధలు కలవాడు. ఆసంవత్సరము ఇంటర్ మీడియట్ ప్యాసు అయినాడు.

వేసంగి సెలవలు కాగానే కృష్ణమూర్తి నారాయణరావుగారి ఆజ్ఞ చొప్పున బి. ఏ. లో చేరడానికి చెన్నపట్నము వచ్చినాడు. నారాయణరావుగారి గుమాస్తా ఒక అతను స్టేషనుదగ్గరకు వెళ్ళి కృష్ణమూర్తిని తారా

యణరావుగారింటికి తీసుకు వచ్చి వప్ప చెప్పినాడు. మరునాడు నారాయణరావుగారే స్వయముగా ప్రసిడెన్సీ కాలేజికి తీసుకు వెళ్ళి బి. ఏ. క్లాసులో ప్రవేశపెట్టినారు. ఇంటివద్దగ్గర ఇతనికి చదువుకొనడానికి దక్కని గది కావలసిన బట్టలూ పుస్తకములూ, రోజూ స్కూలికి వెడుతూ వస్తూ ఉండడానికి సైకిలూ కొని ఇచ్చినారు. అతని ఖర్చు అంతా నారాయణరావుగారే వహించి ఇతనికి ఏలోటూ లేకుండా అన్ని విధములా కని పెడుతూ ఉండేవారు.

కృష్ణమూర్తి చెన్నపట్నము ఎప్పుడూ చూడ లేదు. ఒక చెన్నపట్నము అన్నమా టేమిటి, ఏపెద్దపట్నమూకూడా చూడలేదు. ఇక్కడి మేడలు, తోటలూ, జనసమూహమూ, మోటారుకారులూ మొదలయినవి చూసి కొంతకాలము ఆశ్చర్యపోతూ ఉండేవాడు. క్రమేణా ఊరికి అలవాటు పడ్డాడు. అతని చదువేమిటో అతని ధోరణేమిటో, తప్ప, ఇంకొకరి సౌఖ్యము అతని కవసర ముండేది కాదు. దేనిలోనూ కలుగజేసుకునే వాడు కాదు. అతను ఉన్నసంగతే ఎవరికి తెలియనట్లుగా ఉండేవాడు. అతనికి భోజనముకూడా తనతోటి సంబంధము లేకుండా వేరే పెట్టవలసిన దని నారాయణరావుగా రేర్పాటు చేశారు. అందుచేత ఏరెండుమూడు వేళలలో గాని నారాయణరావుగారికికూడా అతను కనపడేవాడు కాదు.

౭

కృష్ణమూర్తి చెన్నపట్నము వచ్చి సుమా రారుమాసము లయినది. ఆరోజు ఆదివారము. నారాయణరావుగారూ రుక్మిణీ మధ్యాహ్నము తమ స్నేహితులను చూడ డానికి వెళ్ళినారు. తోటమాలీ తోటలో పని చేస్తున్నాడు. గేటులో ఉండేనౌకరు ఏదో పనిమీద బజారుకు వెళ్ళినాడు. రుక్మిణి దాసి అపూట సెలవు తీసుకున్నది. ఇంట్లో ఇం కెవ్వరూ లేరు. కృష్ణమూర్తి ఒక్కడే ఉన్నాడు. అతనికి కాలక్షేపన గాక ఊరికే

కూర్చున్నాడు. కొంతసేపటికి అతనికి ఆమేడ మీద భాగము చూడవలె నని బుద్ధి పుట్టింది. తక్షణము లేచి మేడమీదకు వెళ్ళినాడు. వెళ్ళగానే ముందొక పెద్దగది కనుపించినది. అది నారాయణరావు కచ్చేరిగది. దాని నిండా పదెనిమిది బీరువాలలో పుస్తకములు ఉన్నాయి. గోడలమీద గొప్ప గొప్ప కవులూ సంస్కర్తలూ దేశాభిమానులూ మొదలయినవారి పటము లున్నాయి. కంచుతో చేసిన బుద్ధుడూ, కృష్ణుడూ, నటరాజూ మొదలయిన విగ్రహములు కొన్ని చిన్నబల్లలమీద అమర్చబడి ఉన్నవి. ఒకవక్క ఒక పెద్ద మేజా, దానిముందొక కుర్చీ, ఇంకొకవైపున రెండు పెద్ద సోఫాకుర్చీలు, ౫ చిన్నకుర్చీలు అమర్చబడి ఉన్నవి. చాలాసేపు ఆపుస్తకములూ పటములూ చూస్తూ అక్కడ కాలయాపన చేసినాడు. తరువాత ఆగది వక్కనే ఉన్న నారాయణరావు గారి పడక గదిలోనికి వెళ్ళినాడు. తలుపు తెరువగానే వర్ణములతో చిత్రింపబడిన దివ్యసుందర విగ్రహ మొకటి అతనికి కనవడ్డది. ఆమె నారాయణరావుగారి ప్రథమకళత్రమై ఉంటుం దని ఊహించి కొంతసేపా చిత్తరువు కేసి చూచి తరువాత ఆగది చక్కదనము చూసి, అక్కడనుంచి ఆవక్క గదిలోనికి వెళ్ళినాడు.

అది రుక్మిణి పడకగది. నారాయణరావుగారి గదికీ ఆగదికీ మధ్య తలుపు ఒకటి ఉన్నది. ఆతలుపు తెరవగానే ఎదుట గోడదగ్గర సొరుగుల పెట్టె కమర్చి ఒక పెద్ద నిలువుటద్ద మున్నది కుడిచేతివైపు గోడకు రెండు పెద్ద కిటికీలు. వాటివద్దనే మంచిగంధపు చెక్కతో చేయబడిన పెద్ద పందిరి పట్టెమంచ మున్నది. మంచపు కమ్ములపైన బహు నేర్పరియైన పని వానిచే రామాయణమునందలి కథలు కొన్ని చెక్కబడి ఉన్నవి. గుమ్మ మునకు రెండు వైపులనూ, రెండు బీరువాలు బట్టలతోనూ, బొమ్మల తోనూ నిండి ఉన్నాయి. మంచాని కెదురుగుండా ఒక గుమ్మమూ, దానికి ఒక వైపున తలనూనెలూ, సెంట్లు మొదలైనవాటితో నిండిన డ్రస్సింగుటేబిలూ, రెండవవైపున ఒక పెద్దసోఫా, గోడల కన్నివైపులా గొప్పగొప్ప చిత్రకారులచేత చిత్రింపబడిన పటములూ కొన్ని రుక్మిణి

స్వయముగా చిత్రించినపటములూ, మంచము దగ్గర నారాయణరావు పెద్ద పట మొకటి ఉన్నవి. ఈగది కవతల రుక్మిణి వ్రాసుకోడానికి చదువుకోడానికి వేరే గది ఒకటి ఉన్నది. దాని అవతల స్నానాల గది ఉన్నది.

ఈ పడక గదిలో చిత్రము లన్నీ చూస్తూ ఆనందములో మునిగి విశ్వేష్టుడై ఉన్నాడు కృష్ణమూర్తి. అతను మేడమీదకు వచ్చి ఎంతసే పయినదీ అతనికి తెలియలేదు. ఈ తన్మయత్వములో ఉండగా గది ఎదుట వసారాలో అడుగులచప్పుడు వినపడ్డది. తెలివి తెచ్చుకొన్నాడు. ఏమి చెయ్యడానికీ తోచ లేదు. ఎటు పోవడానికీ కాళ్లు ఆడలేదు. అడుగులు తలుపు దగ్గరకు వచ్చినాయి. ఒక అడుగులో దగ్గరనున్న సోఫా వెనుక చేరి గజగజ వణకుతూ నక్కి పడుకున్నాడు.

ఇతను పడుకోవడము తడవుగా రుక్మిణి గదిలోకి వచ్చింది. వచ్చి తిన్నగా అద్దము దగ్గరకు వెళ్ళి తల ఒకసారి దువ్వుకొని బయటకు వెళ్ళినది. వెళ్ళి పోయిన దేమో లేదామా వదా అని ఆలోచిస్తూ ఉండగానే ముఖము కడుక్కొని తుడుచుకుంటూ రుక్మిణి వచ్చినది. ఒక కుర్చీ పైన తువ్వాలు పారవేసి బీరువాలో బట్టలు తీసి మంచముమీద పెట్టుకొని నిలువుటద్దానికి ఎదురుగా నిలబడి, తను కట్టుకున్న చీర, తొడుక్కున్న జాకట్టు విడిచి, సోఫాపైన వడేసి మంచముమీద చీర తీసి అద్దములో తన అవయవ సౌభాగ్యము చూచుకుంటూ, ఒక్కక్షణ మట్లె నిలబడ్డది. ఆక్షణములో, ఆగదిలో తనొక్కర్తె కాక మరొక రెవరో కూడా ఉన్నట్లు ఆమెకు హటాత్తుగా తోచింది. తోచగానే త్వరగా చేతులో ఉన్న బట్ట చుట్టబెట్టుకొని, గది నాలుగు మూలలా వెతకగా సోఫాకింద గజగజలాడుతూ, ఒళ్లంతా చెమటతో తడిసి, ఆరిపోయిన పెదవులు తడుపుకుంటూ ఉన్న కృష్ణమూర్తి కనపడ్డాడు.

కన్నులనుంచి నిప్పులు కురుస్తూ రుక్మిణి "రా ఇవతల" అని ఒక్క ఊరుము ఉరిమింది. కృష్ణమూర్తి మెల్లగా పాకి ఇవతలికి వచ్చి నిలబడినాడు. కన్నుల వెంబడి నీరు ధారగా ప్రవహిస్తూ ఉన్నది. సిగ్గుచేత

ముఖము ఎఱ్ఱబడ్డది. "ఏమి టీపాకువని! ఎందుకు వచ్చావిక్కడికి" అని మళ్ళీ రుక్మిణి గర్జించింది. పాపము, ఏమి సమాధానము చెప్పగలడు! మరింత వణకుతూ, నోట మాట రాక మరింత కళ్ళనీళ్లు కారుస్తూ నిలబడ్డాడు. "ఏమి మాట్లాడవేమి? ఆడవాళ్ళ పడక గదిలోకి వచ్చి దాగుకోడానికున్న సాహసము ఆడదానికి సమాధానము చెప్పడానికి లేదేమి? మళ్ళీ చూస్తే బి. ఏ. చదువుతున్నావు. చదువుకొన్నవాడు, పెద్దమనిషి, చెయ్యవలసిన పనేనా ఇది? నారాయణరావుగారు నీకు చూపిన దయకూ నీయందుంచిన నమ్మికకూ తగిన ప్రత్యుపకారము చేసినావు. మాట్లాడకుండా ఎందుకు ఇడియట్‌లాగా ఏడుస్తూ అలా నిలబడతావు? నడు అవతలికి. నాకళ్ళ కెప్పుడూ కనపడకు. ఈచర్య వింటే నారాయణరావుగారు బ్రహ్మానందపడతా రనుకుంటా. పో అవతలికి!" అని గుమ్మమువైపు వేలు చూపించినది.

అప్పటికి కృష్ణమూర్తికి కొంచెము చైతన్యము వచ్చింది. "తల్లీ క్షమించండి" అని ఆమె కాళ్ళపైన బడినాడు. "ఏమి టీచిత్రవేషము! లే," అన్నది. లేచి వెక్కి వెక్కి రాగాలు పెడుతూ జరిగిన సంగతంతా చెప్పినాడు. అతను చెప్పినదంతా విని "నేను లోపలికి రాగానే నా కెందుకు కనపడ్డావు కావు" అన్నది. "అమ్మా, భయముచేత నా తెలివి తెల్లనారింది! ఏమి చెయ్యడానికీ తోచ లేదు. ఈ లోపలికి వచ్చినందుకే మీరు కోప్పడతా రని భయము వేసింది. అపైన మీరు తక్షణం వెళ్ళిపోతారేమో, అందాకా దాక్కుంటే తీరిపోతుం దనుకొన్నాను. ఇంతకూ భయము తప్ప సరిగా ఏమీ ఆలోచించడానికి తోచ లేదు. ఇంక మీరు చీర కట్టుకోవడము ప్రయత్నము చెయ్యగానే దైవమును తలంచుకుంటూ కళ్ళు మూసుకు పడుకున్నాను. దైవసాక్షిగా చెపుతున్నాను. నామాట నమ్మండి. నాఅపరాధము మన్నించండి" అని చేతులు జోడించి బతిమాలినాడు. ఒక్కక్షణము అతనిముఖము కేసి—నిదానముగా ఆ అస్థిపంజరము చూసుకు వెళ్ళి లోపలి సంగతంతా పరిశీలించేటట్లు—తీవ్రముగా చూచింది.

అతను చెప్పినదంతా నిజమని తోచింది కాబోలు 'సరే, నేను బయటకు వెళ్ళేవరకూ నారాయణరావుగారి కచేరీ గదిలో కూచుని, నేను వెళ్ళిన తరువాత నీగదికి వెళ్లు. ఇంక దయచెయ్యి' అన్నది రుక్మిణి. మారుమాట లేక తల వంచుకుని కృష్ణమూర్తి నారాయణరావు గదిలోకి వెళ్ళినాడు.

౮

రుక్మిణి కాపురానికి వచ్చి సుమారు సంవత్సరమన్నర అయినది. నారాయణరావును పూర్తిగా స్వాధీనము చేసుకొన్నది. అతన్ని మళ్ళీ మామూలు మనిషిగా మార్చింది. నారాయణరావు వెనుకటివలె ఎప్పుడూ ఖులాసాగా ఉండడ మారంభించినాడు. గుమాస్తాలకూ నౌకర్లకూ సౌఖ్యము హెచ్చింది. రుక్మిణి మనస్సులో ఏదైనా అనుకోవడము తడవుగా నారాయణరావు తీసుకు వచ్చి ఇంట్లో పడవేస్తూ ఉండేవాడు.

అతను అనుకొన్నట్టుగానే రుక్మిణికి కొంచెము చురుకుపా లెక్కువే. మాట్లాడితే కోపము, చిరాకూను, అనుమానమూ ఎందుకో అందుకు నౌకర్లమీద, దాసీలమీద కోప్పడుతూ ఉండేది. కదలిక ఎక్కువ. ఒక చోట ఒక క్షణమైనా నిలకడగా ఉండలేక పోయేది. ఎప్పుడూ ఎక్కడికో మోటారు మీదనే తిరుగుతూ ఉండేది. అలంకారమందు అభిలాష ఎక్కువ. ఎన్నిరకాల చీరలూ, జాకెట్లూ కొనేదో లెఖ్ఖ లేదు. కొత్త రంగు చీర ఏదైనా వచ్చిందీ అంటే బట్టల కంపెనీ వాళ్ళంతా రుక్మిణికి తలొక ఉత్తరమూ వ్రాసేవారు. ఆవిడ గబగబ వెళ్ళి కొనుక్కు వచ్చేది. రోజుకు ఎన్నిసార్లు చీరలూ జాకెట్లూ మార్చేదో ఎన్నిసార్లు తల దువ్వి బొట్టు దిద్దుకొనేదో లెఖ్ఖ లేదు. నారాయణరావు రత్నవ్యాపారము చేస్తున్నప్పుడు రుక్మిణికి రత్నాభరణాలకి లోటేమిటి? ఇంక ప్రతిసాయంకాలము భర్తతో కాని తనొక్కతే కాని, ఏసినిమాకో, ఏగానసభకో, ఏనాటకానికో వెళ్ళేది. ఏదో వినోదము చూస్తేగాని రోజు గడిచేదికాదు.

నారాయణరావు హఠాత్తుగా తొందర పనిమీద ఫ్రాన్స్ వెళ్ళవలసి వచ్చినది. భార్యనుకూడా తీసుకు వెడదామనుకొన్నాడు. కాని ఆమెకు ఒంట్లో కొంచెము నలతగా ఉండడము చేత డాక్టర్లు ఆమె నంత దూర ప్రయాణము తీసుకు వెళ్ళడము అంత మంచిది కాదన్నారు. ఆపైన కాలముకూడా సముద్రయానమున కర్హమైనది కాదు. అందుకని నారాయణరావు రుక్మిణిని ఇంటిదగ్గర విడిచిపెట్టవలసి వచ్చినది. మళ్ళీ తిరిగి రెండు మాసములలో వస్తాననీ, అప్పుడు ఏకముగా ఒకసారి బయలుదేరి యూరోపు అమెరికా తీసుకు వెడతాననీ చెప్పి ఏలాగో సమాధానపరిచాడు. ఆమెకు ఇష్టమయితే రాజమండ్రీ తీసుకువెళ్ళి పుట్టింట దిగబెట్టి వస్తానన్నాడు. "అక్కరలేదు. నే నిక్కడనే ఉంటాను. నాకేమీ భయము లే" దన్నది. సరే నీ యిష్టమన్నాడు నారాయణరావు.

ఆనాడే నారాయణరావు బయలుదేరినాడు. రుక్మిణికూడా బొంబాయి వరకూ వెళ్ళి నారాయణరావును స్టీమరెక్కించి, ప్రతిమెయిలుకూ తప్పకుండా ఉత్తరము వ్రాయమని చెప్పి తనింకో రెండు రోజులు బొంబాయిలో ఉండి, తిరిగి చెన్నపట్నము వచ్చింది.

ఇల్లంతా బావురుమంటూ ఉన్నది. ఎటు చూచినా రుక్మిణికి ఏమీ కనబడలేదు. ఏగదిలోకి వెళ్ళినా, ఏవస్తువు తీసినా నారాయణరావు జ్ఞాపకము వచ్చేవాడు. ఏపని ప్రారంభించినా రెండు నిమిషములలో మనసు భావతరంగములపైన తేలియాడుతూ, స్టీమరులో ఉన్న నారాయణరావు దగ్గరకు పోయేది. ఏపని చెయ్యకుండా ఊరికే కూచుంటే, సముద్రము, దానిలో ఒక పెద్ద స్టీమరూ, అందులో పచారు చేస్తూనో, చదువుకుంటూనో, పడుకునో, నారాయణరావు ఆమె కళ్ళఎదుట నాట్యమాడుతూ ఉండేవాడు. వెనకటి మోస్తరుగా ఎక్కడికీ బయటికైనా వెళ్ళ

బుద్ధి అయ్యేది కాదు. ఒకవేళ వెళ్ళినా అక్కడ నిలువ బుద్ధి అయ్యేది కాదు.

ఆమె ఈలాగు ఒక్కవారము అవస్త పడ్డది. రోజూ పెద్ద ఉత్తరము నారాయణరావుకు వ్రాసి వారము రోజులవరకూ వెళ్ళ దని తెలిసినా పోష్టుకు పంపిస్తూ ఉండేది. ఆఖరుకు ఒకసారి పుట్టింటికి వెళ్ళి వద్దా మని బుద్ధి పుట్టినది. ఉద్దేశము కలగడము తడవుగా ఇల్లంతా కృష్ణమూర్తికి అప్ప చెప్పి రాజమండ్రి ప్రయాణము కట్టింది.

చెన్నపట్నములోనే కాలము గడప లేనిదానికి రాజమండ్రీలో ఏలా కాలయాపన అవుతుంది? అక్కడ మరీ అసహ్యముగా ఉన్నది. ఏలాగో బిగపట్టుకుని ఒక్కవారము రోజులు గడిపింది. అక్కడనుంచి తిరిగి చెన్నపట్నము వచ్చింది.

ఒకటి రెండు ఉత్తరములు నారాయణరావు దగ్గరనుంచి రాగానే రుక్మిణికి కొంత శాంతి కలిగినది. క్రమేణా పరివియోగమున కలవాటు పడ్డది. పగ అస్తమానమూ అనేక రకములుగా నారాయణరావు బొమ్మలు చేస్తూ ఉండడము, లేదా ఏదో ఒక నవల చదవడము, సాయంకాలము ఏగానసభకో ఏసినిమాకో వెళ్ళడమూ— ఈలాగు కాలము గడుపుకుంటూ ఉన్నది రుక్మిణి.

నారాయణరావు వెళ్ళి షుమారు నెలా పదిహేనురోజు లయినది. ఆయన వెళ్ళినపని ఇంకా పూర్తి కాకపోవడముచేత మరొక నెలరోజులు ఎక్కువ ఉండవలసివస్తుం దని ఉత్తరము వ్రాసినాడు. ఆ ఉత్తరము చూడడములోనే రుక్మిణికి చాలా ఆశాభంగము కలిగినది. భర్త ఎప్పుడు వస్తాడా అని ప్రతిక్షణమూ ఒక్క మహాయుగముగా లెక్క చూచుకుంటూ ఉన్నది. ఇంకా ఒకనెలంటే ఎలాగు బతకగలదు? ముప్పై రోజులు ఎప్పటికి గడవను! ఇప్పుడే విరహబాధ దుస్సహముగా ఉన్నది.

నానాటికీ వియోగము ఆమెను దహించి వేయడము మొదలు పెట్టింది.

మనిషి చిక్కి సగ మయింది. ముఖమువర్చస్సు తరిగిపోయినది. ఏలాగో ఈ మహానరకమునుండి బయటపడవలె నని ఆమె కాయకష్టాలా గంటాలు పడుతూ ఉన్నది. ఆమె కాలక్షేపార్థము చదువుతున్న పుస్తకాలూ, చూస్తున్న నాటకాలూ, సినీమాలూ, ఈ విరహాగ్ని నంతకంతకు రగుల కొల్పి సహించ శక్యము గాని జ్వాలగా చేశాయి; కాని, ఈ బాధ మరచిపోవడాని కెంతమాత్రమూ ఉపకరించ లేదు.

అంత కంత కామె అవస్థ గ్రంథములో నాయికలవలె అయిపోయి నది. నారాయణరావు వెళ్ళి రెండు మాసములు పైన అయినది. ఉత్తర ములు వస్తూ ఉన్నాయి. వస్తేమట్టుకు ఉత్తరము లెంతవరకు శాంతి నివ్వ గలవు?

౧౦

ఆమె ఒకనాడు పెందరాడే భోజనము చేసి Ouida రాసిన నవల చదవడ మారంభించినది. పుస్తకము విడువకుండా సాయంకాలము మూడుగంటలవరకూ చదివినది. అందులో నాయకచర్యలు ఆమె మన స్సును మరింత కలత పెట్టినాయి. ఆపుస్తకము కట్టిపెట్టి, ఫలహారము చేసి, కాస్సేపు తోటలో తిరుగుదా మని తోటలోకి వెళ్ళినది. ఆకాశము కొంచెము మేఘావృత మైనది. సూర్యకాంతి మందముగా ఉన్నది. చెట్లనీడలు దీర్ఘముగా ఉన్నాయి. పుష్పజాతు లన్నీ పూర్తిగా వికసించి ఉన్నాయి. ఎటు చూచినా జుమ్మని తేనెటీగలూ, అనేక చిత్రచిత్ర వర్ణములతో తిరునాళ్ళకు అలంకరించుకొని వచ్చిన వైష్ణవాంగనలవలె సీతాకోక చిలుకలూ తిరుగుతున్నాయి. తామరకొలను నిండా తామరలూ, కలువలూ వికసించి ముద్దు లొలుకుతూ ఉన్నాయి. గాలి చల్లగా వీస్తూ ఉన్నది.

ఈ ప్రకృతి సౌందర్యము మధ్యను ఆమె నిలువలేక పోయినది. ఎటు చూచినా ప్రేమ స్వరూపము లైన పుష్పములూ, కామోద్దీపక మైన సౌర

భమూ, ఆనంద స్వరూపము లైన సీతాకోక చిలుకలూ, అనూయాజనకము లైన శకుంత దంపతులూ! ఈ తోటంతా ఒక్కసారి తగులబెట్టవలె నని బుద్ధి పుట్టినది. నాలు గడుగులలో మళ్ళీ తన గదికి వెళ్ళినది. వెళ్ళి తెలుగు పుస్తకాల దగ్గర నుంచున్నది. పుస్తకాలకేసి చూసిం దన్నమాటే కాని అక్షరాలు ఆవిడకు కనుపడ లేదు. పది పుస్తకాలు వెతికి ఏదో చేతికివచ్చిన చిన్న పుస్తకము తీసినది. పేజీలు తిరగవేసి చదువడ మారంభించినది. కొంతసేపటికి కది తారాశశాంకవిజయ మని తెలుసుకున్నది. సుమారొక గంట చదివినది. బాధ మరింత హెచ్చినది. అంతటితోటి ఆపుస్తకము కట్టిపెట్టి సినీమాకు వెళ్ళి ఈసంగతి మరచిపోదా మనుకున్నది. అందుకని పెందరాడే భోజనము చేసి కారులో బయలుదేరి సినీమాకు వెళ్ళినది. ఈమె వెళ్ళేటప్పటి కప్పుడే ప్రదర్శన మారంభించినారు. హాస్యరస ప్రధానమైన Film ఒకటి చూపించారు. అది కాగానే Alphonse Daudet అను ఫ్రెంచి గ్రంథకర్త వ్రాసిన Sapho అనే కథ చూపించారు.

అది చూసినకొద్దీ నిలువలేకపోయినది రుక్మిణి. ప్రపంచ మంతా ఈమెను ఓడించవలె నని పట్టు పట్టినట్లు కనిపించినది. అబల, అసహాయురాలు. శత్రుకోటి ఇంత పంతము పట్టినప్పుడు, ఏమి చేయగలదు! ఈ విరహాగ్ని నుండి తప్తకాంచనమువలె పరిశుభ్రముగా బయట పడవలె ననుకున్నది. కాని ఈ పరిస్థితులలో ఏలాగు నెగ్గుకు రావడము!

చివరవరకూ ప్రదర్శనము చూచినది. కన్నులు అశ్రుపూరితము లైనాయి. ఒళ్లు తహతహ లాడి పోయినది. హృదయములో రక్తము పొంగి వేడి తరంగములుగా రక్తనాళములలో ప్రవహించినది తల దిమ్మెక్కినది. నెమ్మదిగా బయటకు వచ్చినది. కాస్సేపు సముద్రతీరానికి వెడితే ఒళ్ళు చల్లబడి ఈ తాపము కొంచెము తగ్గుతుం దేమో ననుకొన్నది. కారు బీచికి పట్టించి నెమ్మదిగా పోనివ్వ మని చెప్పినది.

ఆనాడు పూర్ణిమ. ఆకాశము నిర్మలముగా ఉన్నది. వందువెన్నెల. సముద్రము మిలమిల లాడుతూ అనేక రత్నకాంతులతో ప్రకాశిస్తూ

ఉన్నది. ఒడ్డున కెరటములు విరిగినపుడు నురగలు నీలిమందు పెట్టిన ఢాకా మస్లిన్‌వలె ముద్దుగా ఉన్నాయి. ఆనాడు Moonlight Band వాయిస్తున్నారు. పాశ్చాత్య యువతీ యువకులు అక్కడ విలాసముగ నిలబడి Band వింటున్నారు. కొందరు చేట్టాపట్టాలు వేసుకొని వచారు చేస్తున్నారు. మరికొందరు పరస్పర గాఢాశ్లేషమున బద్ధులై ప్రపంచమును మరచి ఇసుక పాన్పుపైన విశ్రమించి ఉన్నారు. వారి చుంబనధ్వనులు వాయు తరంగములపైన తేలి రుక్మిణిచెవిని చేరినాయి.

ప్రపంచములో కల్లా రుక్మిణే ఒంటరిగా ఉన్నట్లు కనపడ్డది. ఎక్కడికి వెళ్ళినా విధిలాఈవంతమువట్టినట్లు తరుముకొస్తూ ఉంటే ఏమిచెయ్యగలదు? ఏలాగు నెగ్గ గలదు? ఇక్కడికి వస్తే భగ్గున మండి పోతున్న ఒళ్ళు కొంచెము చల్లారి హృదయములో ఆందోళన తగ్గుతుం దేమో ననుకుంటే గాలి వీచినకొద్దీ జ్వాల ఎక్కువైనట్లుగా ఈచల్లగాలి తగిలినకొద్దీ తాపము హెచ్చిపోయినది. సముద్రములో కల్లోలము చూచినప్పటినుంచీ, అంత కంటే ఎక్కువకథా హృదయములో కల్లోలము ఎక్కువయినది. ఇంక గెలువలే ననుకున్నది. ఆమె బల మంతా నీరై పోయినది. ఇంక నీఒంటరి తనము సహింపలే ననుకొన్నది. ఈరాత్రి గడవడ మేలాగు? ముం దిక్కడి నుంచి పోతే తరువాత సంగతి ఆలోచించ వచ్చు ననుకొని కారు ఇంటికి పట్టించినది.

ఈ అవస్థలలో బ్రతుకడ మేలాగు? ప్రపంచ మంతా ఆనంద సుఖ వార్ధిలో తేలి యాడుతూ ఉంటే తనొక్కతెమట్టుకు ఈలా బాధపడ వలసిన అవసర మేమిటి? తనూ మనిషి కాని దేవత కాదు కదా. దేవతలు మట్టుకు ఏవంకా లేకుండా పవిత్రముగా అఘోరించారా ఏమిటీ! వారా యణరావు ఈలా ఒంటరిగా విడిచి పెట్టి చక్కాపోవడ మేమి? అన్న ప్రకారము వచ్చేసెయ్యకూడదూ? ఇంకో నెల అక్కడ ఆగడ మెందుకు? ఈ నెలా అవగానే మట్టుకు వస్తా దన్నమా టేమిటి? మళ్ళీ ఇంకొక నెల

వసుందని ఆవేళకింకో ఉత్తరము చక్కా వస్తుందేమో? ఏమో అక్కడ ఎందు కాగాడో ఎవరికి తెలుసు. అవని ఏమిపనో. వెళ్ళినద్ది పారిస్. పాశ్చాత్య స్త్రీలు, అందులో పరాను దేశ స్త్రీల చర్యలు ఎరుగని వారెవరు? ఆసంగ తంతా జగద్విదితము. అక్కడకు వెళ్ళి, ఆ స్త్రీల మధ్యను, ఆ దేశములో, ఆ ఉద్యానవనములలో, ఆరంభలతో చెట్టాపట్టాలు వేసుకు తిరుగుతూ ఊరుకుంటాడా ఏమిటి నారాయణరావు అయితేమట్టుకు. ఈయన ఊరుకున్నా వాళ్ళు ఊరుకోనిస్తారా! అక్కడ—ఏమో ఎవరికి తెలుసును. నేనుమట్టుకు...

కారు బంగాళాలోకి మళ్ళింది. సంపంగి, నైటుక్వీను పుష్పముల దివ్య సౌరభముతో తోటంతా నిండిపోయినది. ఆ సువాసన తగిలేటప్పటికి రుక్మిణికి మరీ పిచ్చెత్తిపోయినది. కారు దిగి లోపల ప్రవేశించినది. కింద నొకగదిలో సన్నని గొంతుకతో పాడుతున్న అద్భుత మైన గానము వినుపించింది. ఎక్కడనుంచి ఈ సంగీతము? ఎవరు ఇక్కడ అంత చక్కగా పాడగలవారు? అయినా చూద్దామని నెమ్మదిగా ఆసంగీతము వినబడుతున్న గదివైపుకు వెళ్ళి కిటికీలోనుంచి గదిలోకి తొంగి చూచినది. అది కృష్ణమూర్తి గది. గదిలో కృష్ణమూర్తి తప్ప మరెవ్వరూ లేరు. అతనే పాడుతున్నాడు. ఇంత చక్కగా అతను పాడగలడని రుక్మిణికి తెలియదు. నిశ్చేష్టురాలై సువర్ణప్రతిమవలె నిలబడి సంగీతము విన్నది. జయదేవుని అష్టపది పాడుతున్నాడు. సంగీతము చక్కగా ఆమె శ్రోత్ర పుటములలోనుండి ప్రతిరక్త నాళములోను ప్రవేశించినది. ఒళ్ళు జలదరించినది. హృదయము చెయ్యేసి కలిచినట్లైయినది. శరీరము అట్టుడికినట్లుడికి పోయినది.

పాటపూర్తి అయింది. పూర్తి అయిన సంగతి ఆమెకు తెలియలేదు. ఒక్క అయిదు నిమిషములకు చైతన్యము వచ్చినది. తనగదికి వెళ్ళవలెనని బయలుదేరినది. కృష్ణమూర్తి పడుకోడానికి పక్క వేసుకొని దీపము తగ్గించి

క్షేత్రయపద మొకటి పాడుతూ పడుకున్నాడు. ఇది రుక్మిణికి ఆఖరు దెబ్బ. తల వంచుకొని గాలిలో రావిఆకువలె మెల్లిగా తనపడకగది చేరినది. తలుపు తీసి తిన్నగా మంచముదగ్గర కెళ్ళి దానిమీద అడ్డుగా పడి రెండు నిమిషములు వెక్కి వెక్కి రాగా ఏడ్చింది. అప్పటికీ తుఫాను తగ్గలేదు. కళ్ళు తుడుచుకొని వసారాలోకి వచ్చింది. నిండుచంద్రుడు పక్కన నవ్వుతూ ఎదురుగా కనపడ్డాడు. మధ్యాహ్నము చదివిన తారాశశాంకుల చరిత్ర జ్ఞాపకము వచ్చినది. పాపము, అప్పుడు తార ఎంత బాధ పడ్డదో అనుకున్నది. మళ్ళీ గదిలోకి వెళ్ళినది. కట్టుకున్న చీర విడిచి వేరుచీర కట్టుకొని పడుకుందామని అద్దము దగ్గర కెళ్ళి, చీరా జాకట్టూ విడిచి రాత్రి కట్టుకునే చీర పట్టుకు నిలబడ్డది.

వెనుక ఒక పర్యాయము ఈలాగే నిలబడడమూ, కృష్ణమూర్తి గదిలో ఉండడమూ జ్ఞప్తికి వచ్చినది. ఇప్పుడుకూడా ఉన్నాడేమో. లేదు. ఇప్పుడే కాదూ గదిలో అతను పడుకోవడము చూచి వచ్చినది! ఉంటేనా ... ఆరోజు అతను తనశరీరము చూచినాడేమో. మెరుపువలె ఒకఆలోచన తోచినది. అతన్ని పిలిస్తేనో ... ... మళ్ళీ ఆలోచన లేకుండా బట్టేనా కట్టుకోకుండా వసారాలోకి వెళ్ళి కృష్ణమూర్తిని నాలుగు కేక లేసింది ఎందుకో అనుకొని అతను "వస్తున్నాను" అన్నాడు. మళ్ళీ గదిలోకి వచ్చింది. ముఖము ఎర్రబడ్డది. బుగ్గలమీద చేతులు పెట్టుకుంటే కాలిపోయినాయి. కన్నులలో నీరు నిండుతున్నది. పొంగి బిగియబారిన స్తనములను ఒక్కసారి గట్టిగా అదుముకొన్నది. బయట అడుగులచప్పుడు వినబడ్డది. చీర గబగబ కట్టుకుంది. రవిక తొడుక్కోలేదు. కృష్ణమూర్తి గదిదగ్గరకు వచ్చాడు.

౧౧.

మూర్తి బయటనుంచే "వచ్చానమ్మా, ఎందు కండీ?" అన్నాడు. "రా, లోపలకు రా," అన్నది. ఒక అడుగే లోపల పెట్టి "ఏ మండీ" అన్నాడు మళ్ళీని. "పరవా లేదు లే. లోపలకు రా. నేను ర మ్మంటు న్నాను గనుక తప్పు లేదు రా" అన్నది రుక్మిణి. లోపలికి వెళ్ళాడు. "కూచో" అన్నది. కూచున్నాడు. ఈలాఅన ఏమిటి? ఈ సంగతి ఏమిటి? ఈ అర్ధరాత్రి వేళ నన్ను ఎందుకు పిలిచినది? ఆముఖవైఖరి, అలజ్జ, ఆకళ్ళలో కాంతులూ కొత్తగా ఉన్నాయి. కింద నౌకర్లవరైనా మేలుకున్నా రేమో, వాళ్ళు ఏమన్నా అనుకుంటా రేమో నని అనేక మోస్తర్లుగా ఆలోచిస్తూ ఏమీ తోచక, ఏమి చెవుతుందో అని కని పెట్టుకు కూచున్నాడు.

మూడు నిమిషములవరకూ రుక్మిణి ఏమీ మాట్లాడ లేదు. తల వంచుకునే కూర్చున్నది. ఒక్కమాటు తల ఎత్తి "అయితే నేను లోపలకు వస్తుంటే నీగదిలో సంగీతము వినపడ్డది. ఎవరు పాడుతూంటా? నీస్నేహితు లెవరేనా వచ్చారా ఏమిటి? లేకపోతే గాయకులాలి నెవరినేనా తీసుకువచ్చి గానసభ జరిపిస్తున్నావా?" అన్నది మందహాసముతో. కృష్ణమూర్తి ఉలిక్కిపడి "ఎవ్వరూ లే రండి! నేనే ఏదో కొద్దిగా కూనురాగము తీసుకుంటున్నాను" అన్నాడు. ఆశ్చర్యము నభినయిస్తూ "ఆ ఏమిటీ, నువ్వేనా ఆపాడుతున్నది? నిష్కళముగా కూనురాగ మంటా వేమిటి! అది పాట కాదు, అమృతప్రవాహము! కాని, నిజముగా నువ్వే పాడుతుంటా? నీకు సంగీతము వచ్చు నని ఎప్పుడు చెప్పావు కావు. ఏది, ఆకూనురాగము మళ్ళీ ఒక్కమాటు తియ్యి. విసా అని ఉన్నది. ఏమి, సందేహిస్తున్నావు. నిద్ర వస్తూ ఉన్నదా ఏమిటి" అన్నది. "లే దండి, నిద్ర లేదు. కాని నేను బాగా పాడలేను. ఎక్కడా చెప్పుకున్నది కాదు. ఏదో గాలిపాట" అన్నాడు. "పరవా లేదు. పాట మంచిచెడ్డలు నిర్ణయించేదాన్ని నేను. కానియ్యి" అన్నది. భయముతో. ఆనంద భైరవి కొంచెము సేపు ఆలపించి కృష్ణమూర్తి—

"సాయంకాలే వనాంతే కుసుమితసమయే సైకతే చంద్రికాయాం,
త్రైలోక్యాకర్షణాంగం సురనరగణికా మోహనాపాంగమూర్తిమ్
సేవ్యం శృంగారభావై ర్నవరసభరితై ర్గోపకన్యా సహస్రైః
వందేహం రాసకేళీరత మతిసుభగం వశ్యగోపాలకృష్ణమ్"

అనే కృష్ణ కర్ణామృత శ్లోకము చదివి ఊరుకున్నాడు.

పాడేటప్పుడు అతనిముఖము మారిపోయినది. కన్నులు స్థూలదృష్టికి కనుపడని వస్తువును దేనినో చూస్తున్న ట్టున్నాయి. ముఖములో వింత ఆనంద ముదయించినది. రుక్మిణి సమ్మోహనాస్త్రము తగిలినదానివలె నిశ్చేష్టురాలై పున్నది. "ఓహో, అద్భుతముగా ఉన్నది! కాని శృంగారరసము భక్తిరసములోకి మారిందేమి? అయినా ఇదైనా శృంగారరసముతోటి మిళితమైన భక్తిరసమే. బాగున్నది. కానీయి, మరోటి కానియ్యి. జయదేవుని వాగమృతధారలు నాపైనకూడా పడనియ్యి" అన్నది. అనేటప్పటికి మరొక శ్లోకము చదివేశాడు. క్రమేణా మొదటిసందేహమూ బెదురూ వదలి కొంచెము ధైర్యము వచ్చినది. శ్లోకాలూ, పద్యాలూ, అష్టపదులూ సుమారు రెండు గంటలు పాడాడు.

రుక్మిణి పరవశయై పోయింది. కృష్ణమూర్తిని ఆమె ఎప్పుడూ ఇంత పరిశీలనగా చూడలేదు. మనిషికూడా చక్కనివాడే. ఇంక, పాటా అద్భుతము. కేవలము దేవగానమే. ఇటువంటిమనిషిని ...... "పాపము చాలా శ్రమ పడ్డావు. కాసిని పాలు పుచ్చుకో. లేకపోతే కాస్త టీ కాచి ఇమ్మన్నావా?" అన్నది. "వద్దండి. ఏమీ వద్దండి" అన్నాడు. "అలాగు కాదు. కాసినిపాలు పుచ్చుకో" అని తనకోసము అక్కడ ఉన్న పాలు అతని కిచ్చినది. అవి అతను పుచ్చుకుంటూ ఉండగా తనూ కొంచెము రాగ మాలాపించి అష్టపది పాడింది.

"చరణ రణిత మణి నూపురయా పరిపూరిత సురత వితానమ్
ముఖర విశృంఖల మేఖలయా సకచగ్రహ చుంబన దానమ్ ॥... సఖిహే ...

రతిసుఖ సమయ రసాలసయా దరముకులిత నయనసరోజమ్
నిస్సహ నిపతిత తనులతయా మధుసూదన ముదితమనోజమ్ ... సఖిహే ...

"ఆహాహా, ఏమి సంగీతమండీ! ఏమి గాత్రమూ, ఏమి సౌకుమార్యమూ, ఏమి సౌఖ్యము! ప్రాణానికి ఇంత హాయి నిచ్చేసంగీతము ఎప్పుడూ వినలేదండీ. అతిశయోక్తి కాదు. ముఖస్తుతి కాదు. అమ్మా, ఇటువంటి సంగీతము తమ స్వాధీనములో ఉన్నప్పుడు నాపోటి వాడిని పాడ మని, అది బాగుందనీ స్తోత్రము చేస్తున్నారే" అన్నాడు. "సరే, ఒకరినొకరు పొగడు కోవడము అయిపోయినది. కనుక ఒక్క క్షేత్రయ్య పదమేనా పాడ" మన్నది. "అమ్మా, ఇంక నే పాడలేను. మీ పాట విన్నతరువాత మళ్ళీ నో రెత్తడమే ఈ ఇంట్లోను! మీకు శ్రమలేకపోతే మీరే ఏదేనా పాడుతే సంతోషిస్తాను" అన్నాడు. "అలాగా. సంతోషిస్తావా? సరే, అయితేను" అని సుమారు ఒక్క గంటసేపు శృంగారరసప్రధానము లైన ప్రబంధ కవుల పద్యాలు, శ్లోకాలు, అష్టపదులు శ్రోత్రపేయముగా వినిపించింది.

కృష్ణమూర్తి పరవశు డయినాడు. ఇతని ఆత్మ అంబరవీథిని విహారము చేసినది. నేత్రములు అర్ధనిమీలితము లైనాయి. అవయవములు పట్టు తప్పినట్లుగా జార్లపడి కూర్చున్నాడు. అర్ధరాత్రి. పుచ్చపువ్వులా వెన్నెల. సంపంగి, సైటుక్వీను, పారుజాతము మొద అయిన పుష్పముల దివ్యసౌరభము. దూరమున సముద్రపు రొదతప్ప ప్రపంచ మంతా నిశ్శబ్దము. ఎదుట అప్సరసవంటి స్త్రీ దేవగానము వినిపిస్తున్నది. కృష్ణమూర్తికి ఒళ్ళు తెలియ లేదు. అభ్యాసము లేనివాడు ఘాటైనవిస్కీ తాగితే తల కెక్కినట్లు, ఈఅర్ధరాత్రి వెన్నెలలో ఈసంగీతము ఇతని తల కెక్కినది. ముఖము ఎర్ర బడ్డది. లలాటమున ఘర్మబిందువులు ముత్యములవలె మెరుస్తున్నాయి. ఆనంద పారవశ్యంచేత నేత్రములు అశ్రుపూరితము లైనాయి. ఒళ్ళు పులకరించినది. హృదయములో నూత్న భావతరంగములు బయలుదేరినాయి. మనసులో అనరాని ఆలోచనలు వరుగెత్తినాయి.

రుక్మిణి పాట నిలువగా త నోక అష్టపది పాడినాడు:

"స్మరగరలఖండనం మమ శిరసి మండనం
దేహి పదపల్లవ ముదారమ్
జ్వలతి మయి దారుణో మదన కదనానలో
హరతు తదుపాహిత వికారమ్......ప్రియే..."

ఇతనిలో మార్పు రుక్మిణి గ్రహించింది. ఇతని మనసులో ఉన్న ప్రతి ఆలోచన ముఖములో అద్దములో ప్రతిబింబములాగ కనబడుతూ ఉంది. మనము జయించినా మనుకొన్నది. అష్టపది కాగానే శ్రేయపద మొకటి పాడినాడు. సుమారు రెండు గంట లవుతుంది. రుక్మిణి ఇంక నిలువలేక పోయింది. ఇతనిపాట పూర్తి కాకముందే గాలిలో లేడిగలాగ ఊగుతూ కృష్ణమూర్తి కూచున్న సోఫా దగ్గరకు వచ్చి పక్కను కూచుని ఇతనిని బిగి కౌగిట జేర్చి పట్టి నోటి మీదా కన్ను మీదా ముఖము మీదా తలమీదా గబ గబ ఇరవై సార్లు ముద్దు పెట్టుకొన్నది. అవిడ పైట తొలగిపోయింది. పొంగి బిగియబారిన ఆమె వెచ్చని చన్మొనలు ఇతని హృదయమును దూసుకు పోయినాయి. గజ గజ వణకుతూ అవశుడై తన చేతులలో ఉన్న కృష్ణునకు స్త్రీ స్పర్శ కావడం అదే మొదటి సారి అని ఆమె తెలుసుకున్నది.

కృష్ణమూర్తి ఒక్కక్షణానికి చైతన్యము తెచ్చుకొని ఆమె కౌగిలి పట్టు విడిలించుకో వలె నని ప్రయత్నము చేశాడు. "వద్దు, తొందర చెయ్యకు నా ముద్దు కృష్ణా! భయపడకు. ప్రవరుడు లాగ వెర్రి వేషా లెయ్యకు. అతని కున్న నిగ్రహము నీకు లేదు. నీ కేమీ భయము లేదులే. స్వర్గము దగ్గర కెళ్ళి 'అబ్బే, ఇది కాదు స్వర్గమంటే' అక్కడనుంచి తిన్నగా నరకము లోనే పడడము. మనము కోరినప్పుడల్లా స్వర్గము రాదు. నిజమైన ఆనందము మనకు జీవితములో ఎప్పుడో కాని లభించదు. అదృష్టవశాత్తు అది వచ్చినప్పుడు ఆనందము ఇదవునా కాదా అని మీమాంస పడుతూ ఉంటే మనకోసము అది వేచి ఉండదు. మళ్ళీ యథాప్రకార స్థితిలోనే ఉంటాము.

అందుకని అట్టే సందేహించకు. ముద్దులకృష్ణా, రా!" అని కౌగిలి వదల కుండానే మంచము దగ్గరకు లాగింది అతన్ని.

కృష్ణమూర్తికి ఆమె చెప్పిన దేమీ వినపడ లేదు. ఆమె శరీరము వేడి తన వంటికి ఎక్కింది. ఆమె వేడి ఊర్పులు తన ముఖముకు తగులుతున్నాయి. ఆమె శరీర సౌరభము మత్తు మందువలె ఇతనికి మాంద్యము కలిగించింది. దానితో ఇతని బలము పూర్తిగా నశించింది. కీలుబొమ్మవలె ఆమె పక్కను మంచము మీద కూచున్నాడు. అతని తల ఒక చేత్తో నిమురుతూ రెండవ చేత్తో కౌగిలి మరింత బిగించి రుక్మిణి మళ్ళీ ముద్దు పెట్టుకొన్నది. దానితో అతని, వెనుకటి స్వరూప మంతా మారిపోయినది. కొత్త ప్రాణమూ, దానితో మళ్ళీ బలము వచ్చినది. ఒక్కసారి ఒళ్ళంతా పులకరించింది. కళ్ళు జ్యోతులవలె ప్రకాశించాయి. ప్రవాహములో మునిగిపోతున్నవాడు చేతికి దొరికిన వస్తువును గట్టిగా పట్టుకున్నట్టు రుక్మిణిని తన బలముకొద్దీ అలింగనము చేసుకొని ఆమెకు ఊపి రాడకుండా నోటి మీద ముద్దు పెట్టుకున్నాడు. ఆ కౌగిటిలో పుష్పమువలె ఆమె నలిగిపోతూ "అబ్బా" అని వెనక్కు వాలింది.

ఆ ఉభయులకూ ప్రపంచ మంతటితో అంతరించిపోయినది.

౧౨

ఈ రెండు మాసములనుంచీ పడ్డ అవస్థను మరిపించే ఒళ్ళు తెలియని ఆనందములో ఒకవారము గడిచింది. వెన్నెల పోయి చీకట్లు అలుము కోడము మొదలుపెట్టినాయి. ఎల్లకాలమూ శుక్లపక్షము ఎందుకు నిలుస్తుంది? కృష్ణపక్షము వెంటనే రాకమానదు. ఆ అనాలోచిత కార్యము చెయ్యడమూ, చెయ్యిదాటి పోయిన తరువాత దాని మంచిచెడ్డలను గురించి ఆలోచనా, తరువాత విచారమూ.

రుక్మిణికి ఆ ఉద్రేకము ఇప్పటికి కొంచెము తగ్గింది. పొరపాటు చేశామనే జ్ఞానము కలిగింది. అయితే మట్టుకు ఇప్పుడు చేసే దే మున్నది? “ఇంకా నారాయణరావు ఎప్పుడు వస్తాడో; వచ్చిన తరువాత తెలిస్తే ఏలాగు, కొంప మునిగిపోతుంది. అయినా ఏలా తెలుస్తుంది ఆయనకు? అన్నట్లు ఈమధ్య ఉత్తరము వచ్చి కూడా చాలా కాల మయినది. ఎందుచేతనో, ఎప్పుడూ తప్పకుండా వ్రాసేవారు, ఈసారి ఇంత ఆలస్యానికి కారణ మే మైయుంటుంది? శరీరములో ఏమీ అస్వస్థగా లేదు గదా కొంపతీసి! నేనూ ఉత్తరము వ్రాసి రెండువారములు కా వస్తున్నది. ఏలా ఉన్నారో ఏమిటో” అని ఆలోచించి ఒకనాడు ఉదయము తొమ్మిది గంటలకు రుక్మిణి తన గదిలో కూచున్నది. క్రింద కృష్ణమూర్తి భోజనము చేస్తున్నాడు. ఆకాశాన్ని చిరుమబ్బులు ఒకదాన్ని ఒకటి తరుము కొడుతున్నాయి. ఒక క్షణము నీడగానూ ఒక క్షణము ఎండగాను ఉంటూ ఉంది. హఠాత్తుగా వాకిట్లో మోటారుచప్పుడు వినపడ్డది. ఎవ రయి ఉంటారా వచ్చినవా రని రుక్మిణి ఆలోచించి కూచున్నది. లేచి ఇవతలికి రాలేదు.

నారాయణరావు కారులోనుంచి దిగి నాలుగడుగులలో మేడమీదికి వెళ్ళి తిన్నగా రుక్మిణి గదిదగ్గర నవ్వుతూ నిలబడ్డాడు. గుమ్మాని కెదురుగా పడకకుర్చీలో కాళ్ళూగిస్తూ వచ్చేవా రెవరా అని ఆలోచిస్తూ కూచున్నది రుక్మిణి. భర్తను చూచి నిర్ఘాంత పోయింది. “ఎక్కడ నుంచి ఊడి పడ్డాడు? ఏలా వచ్చాడు? ముందు ఉత్తరము ఎందుకు వ్రాయలేదు? అతని సంగతి అనుకుంటూ ఉండగానే ఈలా ప్రత్యక్షము కావడమేమిటి?” అనే ఆలోచనలు గాలిలో మబ్బుల లాగ పరుగు లెత్తడము మొదలు పెట్టినాయి. ఈ ఆలోచనలో, లేవవ లె నని, అతనికి స్వాగతమివ్వవ లె ననే సంగతి మర చి పోయినది. నారాయణరావు రెండు అంగలలో ఆమె కుర్చీ దగ్గరకు వచ్చి కుర్చీలో వెల వెల బోతూన్న మనిషిని

కౌగిట్లో పట్టుకొని లేవ నెత్తి ముద్దాడి, "ఏమి రుక్మిణీ, అప్పుడే రెండు మాసములకే నన్నుమరచి పోయావా ఏమిటి! లేక పోతే చెప్పకుండా వచ్చినందుకు కోపమా? అక్కడ పని అనుకున్నకంటె పదిహేను రోజులు ముందుగా అయి పోయింది. అందుచేత తక్షణం బయలు దేరినాను. నీకు తెలియ పర్చడానికి వ్యవధి లేక పోయింది. కేబుల్ ఇద్దా మనుకున్నాను, కాని మళ్ళీ నీకు తెలియకుండా హఠాత్తుగా వస్తేనే సంతోషిస్తా వని స్టీమరు, రైలూ తీసుకొని వచ్చి నంత త్వరగా వచ్చాను. పొరపాటు చేశా నన్నమాట. నీకు ముందు తెలియపరచ వలసినదే, అయినా ఆ మాత్రము దాని కంతకోప మెందుకూ? ఈపాటికైనా ప్రసన్నురాలవు కాకూడదూ!" అని నారాయణరావు భార్యగడ్డము పట్టుకొని ముఖము పై కెత్తి మళ్ళీ ముద్దు పెట్టుకున్నాడు.

రుక్మిణి బలవంతముగా తెచ్చిపెట్టుకొని చిన్ననవ్వు నవ్వి, "అబ్బే! నాకు కోప మేమిటి! కోప మేమీ లేదు. ఇప్పటికైనా నాయందు దయ గలిగి వచ్చినారు. చాలా సంతోషముగా ఉన్నది. ఈ పదిహేను రోజులూ మీదగ్గరనుంచి ఉత్తరము రాకపోయే టప్పటికి ఏమీ తోచడము లేదు. ఏలా ఉన్నారా ఏమిటా అనుకుంటూ, ఇంకా రావడానికి వీలులే దని మళ్ళీ ఉత్తరము వ్రాస్తారేమో నని భయపడుతూ ఏమీ తోచక రోజో యుగముగా గడుపుకుంటూ వచ్చినాను. ఇకనుంచి మీ రెక్కడకు వెళ్ళినా, ఒక్కరోజైనా నన్ను విడిచిపెట్టి వెడితే నేను వప్పుకోను. మీతో కూడా తీసుకువెడుతూ ఉండండి!" అని భర్త మెడచుట్టూ చేతులు వేసుకొని అతని రొమ్ముమీద తల పెట్టుకొని, కళ్ళనీళ్లు పెట్టుకున్నది.

ఇప్పటికి కొంచెము రుక్మిణికి మనసు కుదుట పడ్డది. కాని ప్రేమ పురి కొల్పగా రెక్కలమీద ఎగిరివచ్చిన అమృతమయుని ఎదుట అతనికౌగిట్లో నిలబడ్డప్పుడు తను చేసిన అపరాధము పరిమితి తెలుసుకొన్నది. అగ్ని జ్వాలలమధ్య ఉన్నట్టుగా ఉన్నది. కన్నీరు సముద్రపు పొంగుల్లా వస్తూ

ఉన్నది. నారాయణరావు తనజేబు రుమాలుతో భార్యకన్నీరు తుడిచి, "ఏడవకు, అలాగే ఇకమీా దెప్పుడూ నిన్ను విడిచి వెళ్ళనులే, ఊరుకో. ఇంతబెంగ పెట్టుకుంటూ వని తోస్తే ఏమైనా సరే, మొన్ననుకూడా నాతోటి తీసుకువెళ్ళేవాడనే. ఊరుకో" అని ఊరడించాడు.

నౌకర్లు ఇంతలోకే సామాను తీసుకొని పైకి వచ్చినారు. నారాయణరావు బట్టలు విడవడానికి తనగదిలోకి వెళ్ళినాడు.

## ౧౩

నారాయణరావు తన గదితలుపు తీసి "మోహినీ, వచ్చా..." అనే అతని మాట పూర్తి కాలేదు. పటము కేసి చూసి నిర్ఘాంతపోయినాడు. పటము అక్కడనే ఉన్నది. పటములో ఉన్నది మోహిని రూపమే, దానిలో ఏమీా తేడా లేదు. కాని ఆముఖములో మార్పు. ఆనవాలు పట్టడానికి వీలులేకుండా మారిపోయింది. ఆపటము వేయించి మొదట తను ఊరికి వెళ్ళేవరకూ ముఖము ఎప్పుడూ కలకలలాడుతూ ఉండేది. వెళ్ళే రోజునకూడా చిరునవ్వుతో సాగనంపింది. అలాంటి దిప్పుడు ముఖము కళావిహీనముగా ఉన్నది. ఏ వనిమిది లంకణములు చేసినమనిషివలె చిక్కిపోయి ఉన్నది. కన్ను లశ్రుపూరితములయి ఉన్నాయి. ముఖములో కోపమూ, జాలీ కనపడుతూ ఉన్నాయి.

ఇటువంటిమార్పు ఇదివరకు నారాయణరావు ఎప్పుడూ చూచి ఉండ లేదు. పటములో అటువంటిమార్పు సాధ్యమా అని కూడా అతనికి అనుమానము. ఇదివర కెప్పుడైనా నవ్వుతూ ఉన్నట్టు గాని, ముఖము చిట్లించుకున్నట్టు గాని తన అభిప్రాయమును బట్టి తనకు ఊరికే అల్లా కనపడేదనుకునేవాడు. కాని ఇప్పుడుమట్టుకు అలా అనుకోడానికి ఏమీా అవకాశము లేదు. ఒకవేళ బొమ్మని ఎవరేనా మార్చి ఉందురా? మార్చడానికి ఎవరి

కేమి అవసరము! బొమ్మను చూచినా, అలా మార్చబడినట్లు కనుపించదు. చాలా కాలము క్రితము చిత్రించబడిన పటమువలెనే ఉన్నది. పైగా ఇక్కడికి వచ్చి ఈ పటము పాడుచేయుడానికి ఇంకొకళ్ళ కేమి ఆవసరము? అయితే, ఈమార్పుకు కారణ మేమై యుంటుంది? ఎవరిమీద కోపము? ఎవరిమీద జాలి?

అతను బట్ట విడవకుండానే పటము దగ్గరకు వెళ్ళి కూచున్నాడు. "మోహినీ, ఏమి టిది? ఎందు కీకోపము? ఎందు కీలా ముఖము వన్నె తరిగి ఉన్నది? ఎందు కిలా చిక్కిపోయినావు? నేను వెళ్ళిపోయా నని కోపమా? నీతోటి చెప్పి వెడితినిగా! ఉత్తరము వ్రాయలే దనా? నాసంగతు లన్నీ నీకుతెలుస్తూనే ఉన్నాయిగా! నువ్వెప్పుడూ నాకు తోడునీడగా ఉంటూనే ఉన్నావు గామా! వేరే ఉత్తర మెందుకు? పోనీ, నావల్ల లోప మేదేనా వస్తే, అప్పుడే చెపుతే సవరించుకునేవాడిని గామా! ఏమి, మాట్లాడవు. సమాధానము చెప్పవు! మోహినీ, ఏమి టిది? నా కేమీ తోచడము లేదు. నువ్వేదో చెపుతేనే గాని నే నిక్కడనుంచి కదలను" అని అక్కడనే కూచున్నాడు.

ఎంతసేపు కూచుంటేమట్టుకు పటము ఏమి మాట్లాడుతుంది? ఏమీ జవాబు రాలేదు. కళ్ళల్లో అశ్రువులు మట్టుకు ఎక్కువయినట్టు కనవడ్డది. సుమా రొకగంట అలాగే కదలకుండా, ఏమీ తోచకుండా కూచున్నాడు. ఆఖరికి లేచి బట్టలు విడిచి, స్నానానికి ఇవతలికి వచ్చినాడు. ఈసంగతి రుక్మిణితో మట్టుకు ఏమీ చెప్ప లేదు.

స్నానము చేసి రుక్మిణి, తనూ భోజనానికి వెళ్ళినారు. భోజనము చేస్తూ అందరియోగక్షేమమూ అడిగి తెలుసుకున్నాడు. "ఏడీ, కృష్ణమూర్తి, ఏడీ? అప్పుడే భోజనము చేసి కాలేజీకి వెళ్ళేడా ఏమిటి? బాగా చదువుకుంటున్నాడా? అతనికి ఏమీ లోటు లేకుండా కనుక్కుంటున్నావా? అతని కేమైనా డబ్బు గిబ్బు అవసర మయితే ఇచ్చావా? ఏమీ ఇబ్బంది పడ

లేదు కదా అతను!" అన్నాడు రుక్మిణితో.

రుక్మిణి తెల్ల బోయింది. "ఇ దేమిటి! కృష్ణమూర్తిని గురించి ఇంతగా నన్నడుగుతున్నాడు? ఇతని కేమీ అనుమానము లేదుగదా!" అనుకున్నది. 'అయినా ఇతనికి అనుమానము కలగడానికి ఏమి అవకాశము ఉంటుంది' అని ధైర్యము చెప్పుకొని, సమాధానము చెప్పింది. కాని గుండెలలో మట్టుకు ఒకవిధ మైన బెదురు అరంభ మయినది.

౧౪

నారాయణరావు మోహినిపటములో మార్పు చూచినప్పటినుంచీ మనిషి మనిషిలా లేడు. ఒకవిధ మైన బెంగ బయలుదేరినది. పటములో మార్పు నిజమే. ఏదో తగినంత గొప్పకారణ ముంటేనే గాని ఇటువంటిమార్పు కలుగదు. అదేనా ప్రతిపటములోనూ ఇటువంటిమార్పులు కలుగవు. తన మోహిని పోయినా, ఈపటములో ఇంకా జీవించి ఉన్నది గనుక మామూలువలెనే అవస్థాభేదము లన్నీ ముఖములో కనపడుతున్నాయి. కాని ఇంతమార్పు కలిగించే కారణము ఏమై ఉంటుంది? ఏలాగు తెలుసుకోవడము? మోహినా మౌనముద్ర వహించి కూచున్నది. ఇంక ఈ సందేహము తీర్చేవా రెవరు? అని అనేకవిధాలుగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. తన పనికూడా సరిగా చూచుకోవడము మానేశాడు.

దీనికి తగినసమాధానము రుక్మిణి ఏమైనా చెప్పుతుం దేమో అడిగి చూదామా అనుకున్నాడు. మళ్ళీ ఏమి తోచినదో ఆమెదగ్గర ఈసంగతి తలపెట్ట లేదు. రుక్మిణిలో కూడా కొంచెము మార్పు కలిగినది. వెనుకటి ఉత్సాహము ఉద్రేకము కొంత తగినట్టు కనుపించినవి. మునపటిచురుకు పోయి కొంచెము మాంద్యములో పడ్డది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూన్నట్టుగా పరధ్యానముగా ఉండడము మొదలు పెట్టింది. పలకరిస్తే ఉలికి పడి, లేనిహాసము తెచ్చి పెట్టుకొని సమాధానము చెప్తూ ఉంటుంది.

నాటకాలమీద సినిమాలమీదా పూర్వపు అభిమానము తగ్గినది. అన్నిటి మాటా అలా ఉంచి తన విషయములోకూడా కొంచెము దూరదూరముగా ఉంటున్నది. ఏమి విచిత్ర మంటాను అని ఆలోచిస్తూ ఉండగా హఠాత్తుగా మనసు కొకఊహ తట్టినది.

కాని దానినిగురించి మళ్ళీ ఆలోచించడానికి భయపడ్డాడు. తనకే సిగ్గుగా తోచింది. అటువంటి ఆలోచన తనకు తగ దనుకొన్నాడు. ఇంత నీచ మైన ఊహ తనకు ఏలా కలిగిందా అనుకున్నాడు. అనేకవిధముల ఆ ఆలోచనను మనసులోనుండి తొలగించవలె నని కాయశక్తులా తంటాలు పడ్డాడు. కాని అదిమట్టుకు తొలగి పోలేదు. ఏది ఆలోచించబోయినా వంతము పట్టినట్టు ఆ ఆలోచనే పైకి రావడము మొదలు పెట్టినది. వద్దనుకున్నకొద్దీ ప్రతివిషయము ఆ ఊహను రూఢి చెయ్యడానికి ప్రయత్నిస్తూ ఉన్నట్టు కనపడ్డది. ఊరినుంచి వచ్చినప్పటినుంచీ కృష్ణమూర్తి ఒక్కసారీ కనపడలేదు. ముఖము తప్పిస్తూ ఉన్నట్టు కనపడ్డది. ముఖము తప్పిస్తూ ఉన్నది వాస్తవమే. ఆలోచన నిజమే అయి ఉంటుందా? కాదు ఒక్క నాటికీ కాదు! అయినా ఏమో మోహినిని అడిగి చూదాము, అని తిన్నగా తనగదిలోకి వెళ్ళాడు.

గంభీర మైన ముఖముతో, నిశ్చల మైన చూపుతో, దృఢ మైన నడకతో మనోనిశ్చయమును సూచించేటట్లుగా పెదవులు బిగించి తిన్నగా పటము దగ్గరకు వెళ్ళి నిలబడి "ఏమి, మోహినీ! నాఊహ నిజమేనా? ఏమిటి, కొంప తీసి అంతపని జరిగిందా? ఎంతపని! ఎంతద్రోహము చేసింది! నిజమే! సందేహ మేమీ లేదు!" అన్నాడు. వేడినిట్టూర్పులు అతిత్వరితముగా వస్తున్నాయి. మోహిని వేరే సమాధానము చెప్పే దేమిటి, కళ్ళమ్మట నీళ్లు బొటబొట కారుతున్నట్లు, వెక్కి వెక్కి రాగా ఏడుస్తున్నట్లుగా, రొమ్ము కదులుతున్నట్టు, ఎగుపులు వస్తున్నట్టు నారాయణరావుకు కనపడ్డది. ఆ మోచేతులు క్షమాపణ వేడుతున్నట్లుగా జోడించి ఉన్నాయి.

నారాయణరావు నిశ్చేష్టుడై దగ్గరఉన్న కుర్చీలో కూలబడ్డాడు. ఒళ్లు కంపిస్తోంది. మోకాళ్ళమీద మోచేతు లానుకొని అరచేతులలో ముఖము పెట్టుకుని దుఃఖనిమగ్నుడై కూరుచున్నాడు. హృదయము ఎండి పోయినది. పొడిగుడ్లు పడ్డాయి. ఒక్కసారి పిల్లవానివలె ఏడిస్తే, హృదయ భారము కొంతవరకు తగ్గుతుం దనుకొన్నాడు. కాని ఒక్క కన్నీటిచుక్కైనా ఎంత ప్రయత్నము చేసినా రాలేదు. అలాగే కదలకుండా కొన్ని గంటలసేపు కూరుచున్నాడు. అప్పటికి కొంచెము దుఃఖభారము తగ్గింది, హృదయము కొంచెము చులకపడ్డది.

౧౫

మోహిని ఇచ్చిన సలహాయే బాగున్నది. తాను ఒకరియందు దోషారోపణ చేసి, వారిని శిక్షించడానికి తన కేమి అధికారము ఉన్నది?

దూరము ఆలోచించి త నేమీ ఎరగనట్టుగానే ప్రవర్తించడము మొదలు పెట్టేడు. తనుకటికంటెకూడా రుక్మిణియెడల ఎక్కువ దయగా ఉండడము మొదలు పెట్టినాడు. ఒక్క క్షణమైనా బొత్తిగా విడిచిపెట్టడం లేదు. కృష్ణమూర్తిని సెలవలు ఇవ్వడముతోటే తనవని ఏదో చూడమని కాకినాడ పంపివేసినాడు.

కాని నారాయణరావు దయగా ఉంటున్నకొద్దీ రుక్మిణికి మనోవ్యథ హెచ్చింది. అతను దగ్గరకు వచ్చినకొద్దీ రుక్మిణి దూరముగా ఉండడము మొదలు పెట్టింది. అతను అమృతవర్షము కురిపించినకొద్దీ రుక్మిణి కృశించి పోవడము మొదలు పెట్టింది. ఏలాగో తనకు తెలియదు కాని నారాయణరావు తన అపరాధము తెలుసుకున్నాడని రుక్మిణి గ్రహించింది. ఏలా తెలుసుకున్నాడు? ఎవరు చెప్పి ఉంటారు? ఎవరైనా చెప్పడానికి మట్టుకు ఒక్క భగవంతుడికి తప్ప ఈసంగతి ఇంకొకరికి ఎవరికి తెలుసును? ఏలాతెలిస్తే నేమి, తెలుసుకున్నవాడు నన్ను తిట్టడమో, కొట్టడమో పోనీ

నడవక్కా చేయక ఈస్త్రీమీద పెట్టుకోవడ మేమిటి? ఇది మరింత బాధగా ఉందే! ఏలాగు, ఏమి దారి! పోనీ వెళ్ళి అంతా చెప్పేస్తేనో? మనము అను కున్నట్టుగా ఇదివరకు తెలియకపోతే చెపితే ఏమి కొంప మునుగుతుందో! ఇదివరకే తెలిస్తే ఇప్పుడు మనము చెప్పినందువల్ల వచ్చే లాభ మేమిటి?

అంతకంతకు రుక్మిణి మతి పోయినదానివలె ఉన్నది. ఆమె హృదయ ములో ఆందోళన హెచ్చింది. ఏమి చేయుడానికి తోచలేదు. నారాయణ రావు వచ్చి సుమారు నెలరోజులు కావచ్చింది. ఆనాడు ఆదివారము. రుక్మిణి తనగదిలో ఉన్నది. నారాయణరావు గదిలో అతను ఏదో పని చేసుకుంటూన్నాడు. సాయంకాలము సుమారు నాలుగుగంట లవుతుంది; ఆకాశమున కారుమబ్బులు కమ్మినాయి. ఉరుములూ మెరుపులూను. రుక్మిణి హృదయములో బాధ సహింప శక్యము కాకుండా ఉన్నది. ఈ అవస్థ ఏలాగో ఓలాగ అంత మొందిస్తేనే గాని బ్రతుకు దుర్లభ మనుకున్నది. ఏలాగ అంత మొందించడము? తను ప్రాణహత్య అయినా చేసుకోవలె. లేకపోతే అతని కాళ్ళమీద పడి జరిగిన దంతా చెప్పి, రక్షించమనైనా వేడుకోవలె. ఇప్పు డతను క్షమించలేను అని కాదు. కాని అతని నోటంట ఆమాట వస్తే ఈహృదయవేదన తీరుతుందేమో. అలా చెప్పేస్తే కృష్ణమూ ర్తికి ఏమి నష్టము కలుగుతుందో. పోనీ ప్రాణత్యాగము చేసుకుందాము అంటే ఇంత చిన్న వయస్సులో—అర ఏండ్లయినా నిండ లేదు. ఇటు వంటి భర్తను విడిచిపెట్టి ఈ ప్రపంచాన్ని విడిచిపెట్టి ఏలాగు పోవడము. పోలేమట్టుకు ముక్తి ఉంటుందా? ఈశ్వరుని ఎదట నిలబడి సమాధానము చెప్పుకో నక్కర లేదూ? మనలాంటి మనిషిదగ్గరనే ఈలా జడిసేటప్పుడు ఇంతదోషముతో ఈశ్వరుని దగ్గర ఏలా నిలబడడము? అయినా చేసిన దానికి ఫల మెక్కడో ఒకచోట అనుభవించవలెకదా! ఈఅనుభవ మిప్పుడు తప్పించుకుంటే ముందు తప్పుతుం దన్నమా టేమిటి? కర్మ చేసేటప్పుడు ఉండే ధైర్యము దానిఫల మనుభవించే టప్పుడూ ఉండ నక్కర లేదూ?

ప్రాణత్యాగము చేసుకోడము వట్టిపిరికితనం. అది తప్పు. వెళ్ళి ఆయన కాళ్ళ మీదే పడతాను. నాయందు ఇంతదయగా ఉన్నవాడు కృష్ణమూర్తిని పుట్టుకు శిక్షిస్తాడా? పాపము, అతనిని ఇందులోకి దింపినదాన్ని నేనే కదా! అసంగతి స్పష్టముగా నారాయణరావుతో చెపితే అతనియెడల పుట్టుక దాక్షిణ్యము వహించక పోతాడా? అని చాలా దూరము ఆలోచించి చెంగున లేచి నారాయణరావు గదిగుమ్మము దగ్గరకు వెళ్ళినది.

అక్కడకు వెళ్ళేటప్పటికి మొదట ఉన్న ధైర్యము స్వేదరూపమున నీరై ప్రవించి పోయింది. ఒళ్ళంతా బలువు ఎక్కిపోయినది. అడుగు ముందుకు సాగలేదు. బయట ఉరుములూ మెరుపులూ ఎక్కువయినాయి. పెద్ద సుడిగాలి బయలుదేరినది. ఒక్కక్షణము మళ్ళీ తటపటాయించినది. కాని అఖరికి తెగించి ఒక్కఅంగలో వెక్కి వెక్కి రాగా ఏడుస్తూ, వ్రాసుకుంటున్న నారాయణరావు కాళ్ళపైన పడ్డది. ఇదేమని నారాయణరావు భార్యను బలవంతాన లేవదీసి ఒడిలో కూచోపెట్టుకుని కన్నీరు తుడిచి, దుఃఖహేతు వేమి టని అడిగినాడు.

నోట మాటరాక పొంగిపొరలి వస్తున్నదుఃఖమును ఆపుకోలేక, అతని రొమ్ముమీద తల పెట్టి ఏడ్చి తుదకు తను చెప్పదలచుకొన్నదంతా ఎగుర్పులతో చెప్పి తనను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టే సెయ్యవలసిన దనీ, అతని సన్నిధియందు నుంచోడానికి కూడా యోగ్యత లేదనీ, ఏదో ఒక విధమైన శిక్ష విధిస్తేనే కాని ఈబాధ సహించ లే ననీ ప్రాథేయ పడ్డది.

నారాయణరావు నిదానముగా ఆమె నొకసారి చూసి, తల నిమురుతూ "ఈ పశ్చాత్తాపముకంటె వేరేశిక్ష యేమి కావాలి? ఇదంతా మరచిపో. నూతన జీవిత మారంభిద్దాము" అన్నాడు.

తుపాను తొలగి పోయింది; ఆకాశము నిర్మలమయినది. అస్తమిస్తున్న సూర్యుడు గాఢాలింగనమున బద్ధులైన ఈదంపతులను చూచి దొంగతనము

చేసిన వానివలె సిగ్గుచేత ఎర్రవారిన ముఖముతో పశ్చిమాద్రి వెనుక దాక్కున్నాడు.

౧౬

నారాయణరావు విదేశమునుంచి తిరిగి వచ్చినరోజు మొదలు కృష్ణమూర్తి నారాయణరావుగారి ముఖము తప్పించుకు తిరిగేను. వెనుకటి చనువుగా ఆయన దగ్గరకు వెళ్ళడము మానివేసినాడు. తను వారియెడల ఒనర్చిన అపరాధము పరిమితి తెలుసుకొని సిగ్గుపడి పోయినాడు. ఇంత మహోపకారము తనకు చేసినందుకు ప్రత్యుపకారముగా ఇంత నీచకృత్యము చేశాము గదా అని విచారించినాడు. కాలేజీకి వెళ్ళేవాడన్న మాటే గాని అక్కడ గురువులు చెప్పే దేదీ తల కెక్కేది కాదు. ఇంటికి వస్తే పుస్తకము చేత పట్టబుద్ధి అయ్యేది కాదు. భోజనము దగ్గరకు వెడితే అన్నము తినబుద్ధి అయ్యేది కాదు, రాత్రి పడుకుంటే కంటికి కునుకు వచ్చేది కాదు.

ఈఅవస్థలో ఉండగా కాలేజీకి వేసంగి సెలవలు ఇచ్చారు. ఇంటికి వెళ్ళడమా మానడమా? ఇంటికి వెళ్ళడానికి డబ్బో? ఇస్తేఇచ్చు ముఖము తప్పించి నారాయణరావుగారి ఎదుట ఏలా పడడము? ఇంటిదగ్గర "నీ కింత అప్పు ఎవరున్నారు? వెళ్ళి ఏమిచేస్తావు?" అని అడుగుతే ఏమి సమాధానము చెప్పేది? అని సెలవులిచ్చేనాడు రాత్రి పడుకుని ఆలోచిస్తూ పక్కమీద దొర్లడ మారంభించినాడు మూర్తి.

మరునాడు ఉదయాన్ని నారాయణరావు అతన్ని పిలిచి, కొంతసొమ్మిచ్చి కాకినాడ వెళ్ళి వారి పనులేవో చూచి రమ్మని పురమాయించాడు. కృష్ణమూర్తి గజగజ లాడుతూ తల వంచుకుని నిలబడ్డాడు. నారాయణరావుకు తన సంగతి తెలుసునని ఓమోస్తరుగా గ్రహించుకున్నాడు. అక్కడ నిలబడ్డంత సేపు ఆయన చూపులాగ్నేయాస్త్రముల వలె నిలువెల్లా దహించేస్తున్నట్టు ఉన్నాయి. కాని ఆయన మాటలలో మార్దవము గాని ముఖములో కోపము కాని తగ్గ లేదు.

కృష్ణమూర్తి సెలవు దీసుకుని మళ్ళీ నారాయణరావు గారికి కనబడ కుండా అసాయంకాలమే బయలుదేరి కాకినాడ వెళ్ళిపోయినాడు. మద్రాసు విడిచి పూర్వపు స్నేహితుల మధ్యకు వచ్చినా, నారాయణరావు గారికి తెలిసిందేమో, ఏమి చేస్తారో అనే భీతిమట్టుకు వదల లేదు. మనో వ్యధ అనేక విధముల బాధిస్తోన్నది. పోనీ ఈసంగతంతా వారికి ఉత్త రము వ్రాసేదామనుకున్నాడు. అలా వ్రాస్తే రుక్మిణిసంగతి ఏమి కాను? వారి సంసారము ఇంతటితో ఛిద్రమయిపోతుందేమో! దానికి కారణము మన మెందుకు కావలెనని కొన్నాళ్ళు ఊరుకున్నాడు. కాని మనోవేదన పిశాచమువలె వెన్నంటి పీడిస్తూనే ఉన్నది. దుస్సహమైన ఈ బాధనుండి తప్పించుకోడానికి ఒక్కటే మార్గము. ఏమైనా అవని చేసి తీరవలసినదే. లేకపోతే జీవితము దుర్భరమౌతున్నది.

జరిగిన సంగతంతా వ్రాసి, ఇకత నెప్పుడూ చెన్నపట్నము రాననీ, ఈ అపరాధము మన్నించమనీ, తన భావి జీవితమంతా వారి క్షమాపణపైన ఆధారపడి ఉన్నదనీ పెద్ద ఉత్తరము నారాయణరావుగారి పేర వ్రాశాడు కృష్ణమూర్తి. తన్నిట్లా వ్రాసినట్లే ఆమెకూడా ఆయన పాదములపైన పడితే కొంత పాపపరిహార మౌతుందనీ ఆమె రహస్యమును బయలు పెట్టి నందుకు క్షమించమనీ రుక్మిణి పేరకూడా వ్రాశాడు

## ౧౨

ఈ రెండు ఉత్తరములూ రుక్మిణి నారాయణరావుతో మాట్లాడిన మర్నాడు వచ్చినాయి. రుక్మిణి తన ఉత్తరము తీసుకు వెళ్ళి నారాయణరావుకు చూపించింది. నారాయణరావు తనకు వచ్చిన ఉత్తరము ఆమెకు చూపించి నాడు. రుక్మిణి అది చదువుతుండగా గత మంతా మళ్ళీ ఒకసారి అద్దము లోవలె కనుపించినది. తల వంచుకున్నది. కన్నీటి కాల్వలు ప్రవహిస్తున్నాయి. నారాయణరావు రెండు ఉత్తరములూ తీసుకుని నిప్పువెలిగించి అంటిం

చేశాడు. "రుక్మిణీ, దీనితో గతమంతా నశించి పోయింది. ఇంక ఎప్పుడూ ఆసంగతి తలపెట్టకు" అని ఆమె కన్నీరు తుడిచినాడు.

## ౧౮

తర్వాత రెండురోజులకు బి. ఏ. పరీక్షలు తెలిసినాయి. కృష్ణమూర్తి ప్యాసు అయినాడు. నారాయణరావు కృష్ణమూర్తికి ప్యాసు అయినట్టు టెలిగ్రాము ఇచ్చి, అతని తండ్రి ఇదివరలో చేసే పని అతనిని చూస్తూ ఉండ మనిన్ని కాన్వొకేషనుకు తప్పక రావలసిన దనీ ఉత్తరముకూడా వ్రాసినాడు.

ఉత్తరము వ్రాయడము ముగించడముతోనే నారాయణరావుకు పెద్ద నిట్టూర్పు వినపడ్డది. ఎవరా అని తిరిగిచూచేసరికి ఎవ్వరూ గదిలో కనుపించ లేదు. పైన చూచేసరికి మోహినే చిరునవ్వుతో నిజస్వరూపంతో కనుపించింది. మోహినీ! అయితే నేను చేసినపని నీకు నచ్చిన దన్నమాటే" అన్నాడు. మోహిని నవ్వి, నారాయణరావును కళ్ళతో ఆశీర్వదించింది.

# శైలబాల

## శ్రీ అడివి బాపిరాజు

### ౧

శిథిలమై ఒరిగిపోయిన మండపాలు; ముక్కలై భూపతన మైన అంతఃపురాలు; కూలి ప్రీలిపోయిన గోపురాలు; పాడ పడిగి ప్రోగులుపడ్డ దేవాలయాలు; తలక్రిం దైనశిఖరాలు; రాలినవిగ్రహాలు; ఒకనా డాంధ్రప్రపంచానికి శిరోమణియై శత్రురాజ్యాలకు దుర్భేద్యమై సమస్త దక్షిణాపథాన్ని ఏకచ్ఛత్రంగా ఏలినవిద్యానగరమహాపురము నేడు నామమాత్రమై, పెద్దవస్తు పరిదర్శనశాలయై యాత్రికులను నిశ్చేష్టులను చేసి, కళ్ళ నీరు నింపుతున్నది.

తన ఆనందాన్ని చీకు సల్పుతూన్న అశిథిలత్వంలో ఏదారిని నడుస్తున్నాడో తెలియక, తిరిగినదారినే తిరుగుతూ, ఏది చూస్తున్నాడో తెలియక, చూచినదాన్నే చూస్తూ, కళ్ళకాంతులు శిలాత్వము పొందగా తుంగభద్రానదీతీరాన, పెద్దముళ్ళపొద పక్కనే నాగచంద్రుడు చదికిల పడ్డాడు.

నాగచంద్రుడు చిత్రకారుడు, రసానందతన్మయుడు. మహాశిల్ప గానంలో అభయంకరాపశ్రుతి అతని జీవితాశయాలను భగ్నం చేసింది.

ఇంతలో వెనక ఎవరో అతన్ని తీవ్రదృష్టులతో పరికిస్తున్నట్లయింది. చైతన్యరహితుడై ఉన్న నాగచంద్రునికి ఆ చూపుల తీవ్రత చురుక్కుమని తగిలి మత్తు విరిగేమం దిచ్చినట్లయింది. అతడు లేచాడు. వెనక్కు పార జించి చూచినాడు. పెద్దపొదః మరేమిన్నీ కనబడదు. ఆ అదృశ్యవ్యక్తి

మాపులు చల్లనై తోచినవి. నాగచంద్రుడు ఇదే మని పాదచట్రా చూచి, రేదిన్నీ కౌనక, పొగమంచు కమ్మి ఉన్న హృదయపథం మరిన్నీ చీకట్లు అలుముకోగా, వెఱ్ఱివాని విస్మయం పొందుతూ, మళ్ళీ నది ఒడ్డున కూర్చున్నాడు. ఈసారి అతనికి నిట్టూర్పు వినబడింది. నాగచంద్రుడు లేచి, సగము నిద్రమత్తు తెలుస్తున్నవానిలా తూలుతూ, పొదదగ్గిరే నిల్చుని, పొద లోనికి పారచూచినాడు. అస్పష్టంగా మెడలో హారాల చప్పుడు. నాగచంద్రుడు తూలి ముళ్ళడొంకలో పడబోయినాడు. స్పష్టంగా మళ్ళీ నిట్టూర్పు. అది ఘంటారావమై అతని మెదడులో మోగింది. నాగచంద్రునికి పూర్తిగా మెలుకువ వచ్చింది. పక్కనే ఉన్న సంచిలోనుంచి చేతిగొడ్డలి తీసి పొదనరకడం ప్రారంభించాడు.

బ్రరెంక, రక్కాస, నాభిలత, అడవిమల్లె, పురుగుడు, పాలకర్ర, చిట్టిరేగు విసవిసా వీరభద్రుడై నాగచంద్రుడు అరజాములో నరికి పారవేసినాడు. సగము నరికిన ఆపొదమధ్య నృత్యము చేయబోయే శిలాబాలిక! పరువము పండించుకొన్న కోటికోటి సంవత్సరాల యీాసు కల్గిన దక్కను పీఠభూమి నల్లరాయి. స్నిగ్ధాతిస్నిగ్ధమైన చెక్కడం. స్త్రీప్రపంచాన అందం ఏరి తెచ్చి, చేర్చి ముద్ద పోసి, ఆబాలికామూర్తిని శిల్పించినారు. కోల మోము. లో తెరుగని నాసికామూలము. సముద్రవాహపతన మైనరేఖ, రేకమందార మొగ్గవంపులో తిరిగి ఓష్ఠాంచలముపైన సుడి తిరిగి పోయింది. చిరునగవున వికసించబోయే ఆమె పెదవులు కొద్దిగా విడివడి స్వైస్నాత్రై, ఈవ లావణ్య కాశీరత్నపుపూల చెక్కిలిగుంటలను అలంకరించుకొన్నవి. అధరము దిగువ నిమ్నమై, చిరు రసాలఫల మైన ఆమె చిబుకము ధుర్యము గ్రీవశంఖాన ధారై చేరుకొన్నది.

ఆమె చతుర్భంగాభిరామ. ఆమె పరవశనర్తకి. నన్నని బంగారు దుకూ ఆమో పిమో కటిప్రదేశాన వ్రేలాడే మొలనూలు మొలపూసలలో కలిసిపోయి విద్యున్మాల అయినవి. మంజీరములున్నూ, చిరుగంటలున్నూ అలంకరించిన

ఆమె పాదము తరులతై భూమిమీద వాలబోతున్నట్లున్నది. ఆమె ఎడమ పాదపు మునివేళ్ళపైన ఎగరబోయ్యే పక్షిలా నృత్యగతిలో ఆకాశపద భంగిమతో ఉన్నది. ఆటాడే తాదుబాము దక్షిణహస్తము, అర్ధ చంద్రికా ముద్ర; సవ్యహస్తము లోలము, హంసముద్రిక; కంకణాలతో, గాజులతో, భుజభూషణాలతో, చెదిరిపోయే వేణీ బంధముతో, పొంకాలయి ప్రేమ వాహినీమూలాలై, కదంబపుష్పాలై, కలలనిధులైన వక్షాలపైన ఊగిసే ఆడే హారాలతో, నృత్తావేశ దివ్యసుందరియైన తులాన, ఒకక్షణికంలో, శిల్పి ఒకడు శాంబరీ విద్యచేత శిలగా మార్చినట్లు ఆమె ప్రత్యక్ష మైంది!

నాగచంద్రుడు అలాగే నిలుచుండి పోయినాడు. అతని ఊహాపథాలు దాటిపోయిన శిల్పసౌందర్యం.

తొందర తొందరగా ఆవిగ్రహాంచుట్టూ ఉన్న డొంక నరికి పారవేసి, ఆప్రదేశం అంతా శుభ్రం చేసి, తుంగభద్రలోనుంచి తనసంచి కలశంతో, నీళ్లు తెచ్చి ఒత్తుగా చల్లినాడు. వివిధ పుష్పాలు సేకరించి దండలు గుచ్చి ఆమె మెడలోను, వేణీభరంపైన అలంకరించాడు. పూవులతో ఆమె పాదాలు పూజ చేసినాడు. తనివి తీరని చూపులతో ఆమెను చూస్తూ సొక్కరిల్లాడు. అప్రయత్నంగా అతని ఫాలం చివురుజొంపాల లాలిత్యం చూపిస్తూ కఠినమై ఉన్న ఆమె పాదం పైని చేరింది. లోతెరుగని ఉత్కంఠ నాగచంద్రుని [illegible]కించింది.

ఏమిది? అతని శిరస్సుపైన వాతి దూరాన ఉన్న ఆమె కుడిపాదము నెమ్మదిగా దిగుతూ అతని మూర్ధానికి కొంచెం తగిలింది. నాగచంద్రుడు ఉలిక్కిపడి లేచి ఆమె మోముపైన తీక్ష్ణదృష్టులు పరపినాడు. అతని కుడి చేయి ఆమె ఎడమ మీగాలిపైన నఖం పచస్పర్శ నందింది. ఇంతలో

ఆ బాలిక చిరుపులుగు వెలుగులా నవ్వి ఒడలు కొంచెం కదిలించింది. విగిసి పోయే హృదయంతో నాగచంద్రుడు లేచి నిలుచున్నాడు.

చైతన్యోదయ మవుతూ ఉన్న ఆ స్నిగ్ధనీలోపల శరీరాన నులివెచ్చ రక్తము జలజల పొంగెత్తి సమవిషమతలాల గ్రొమ్మెరుగులు పుట్టించి సమస్తనాడుల స్పందించి మెత్తనిదారువై క్రొంజివురై నవనీతమైపోయింది. చూస్తూ ఉండగానే ఆ శరీరము, ఉదయ సంధ్యాకాశములా క్షణక్షణం వన్నెలు మారుస్తూ, కపిశమై, పిశంగమై, శ్వేతమై, పాటలమై, పీతమై, పుటములో బంగారమై పోయినది. కర్కశమైన ఆమె శిలాకబరీభరము నల్ల పట్టు కుచ్చుల వేణీభరమైనది. నగలు బంగారువై తళుకులాడినవి.

'తణికిటతోం' అని ఆ బాలిక నాట్య మాడ ప్రారంభించింది. కాళ్ళ చిరుగంటలు చతురశ్రగతి త్రిపుటతాళము వేసినవి. రాను రాను స్ఫుటమైన కంఠంతో—

లలిత లవఙ్గలతా పరిశీలన కోమల మలయ సమీరే
మధుకర నికర కరమ్బిత కోకిల కూజిత కుంజకుటీరే
విహరతి హరి రిహ సరస వసంతే
నృత్యతి యువతిజనేన సమం సఖి!
విరహిజనస్య దురంతే...

అని పాడుతూ ఆ బాలిక అభినయిస్తున్నది. నాగచంద్రుని ముఖము విరిసిపోయిన దిరిసెన చెట్టులా ప్రఫుల్లమయింది. పాంకో అయి పొలుపు మీరిన ఆమె హస్తాల విన్యాసవేగము అడవి నిమ్మపూవుల పరిమళమయింది. చిరుచెమ్మటలు నఖాగ్రాలతో తుడుచుకుంటూ నాట్యమాడి, మధురమైన ఊర్పులు విడుస్తూ ఆ బాలిక వచ్చి నాగచంద్రుని భుజాలపైన చేతులు ఉంచింది. అతనిదేహాన గగుర్పాటులు మలయసమీరము రివ్వన ప్రవహించినప్పటి చెరువులో నీటి కెరటాలలా పరువు లిడినవి. లిడివడి ఆమె పెదవుల [illegible]శ్వాసలు అతని కపోలాలపైన అలమిపోయినవి. దివ్య

యౌవనం విరిసిపోతూ పరమసౌందర్యం విరజల్లుతూ ఆబాలిక చటుక్కున తనను ఆదరించినప్పుడు నాగచంద్రుని చేతులు అప్రయత్నంగా ఆమెను కౌగిలించుకో బోయి మరల వాలినవి.

"ఏమయ్యా! తుంగభద్రాతీరాన కూర్చుందాము రా" అని ఆమె అతని కుడిచేయి పట్టుకొని నది నీటిదగ్గరికి అతనికి దారి చూపుతూ అక్కడే ఉన్న ఓనల్ల రాళ్ళ గుట్టమీద అధివసింప జేసింది. అతని పక్కనే ఆమె ఆసీన అయింది.

"నీహృదయంలో, నే నెవర్నా? అన్న ప్రశ్న మొలకెత్తింది! ఈరాళ్ళన్నీ ఒకరకం చుట్టాలు నాకు. ఈసంధ్యా శబలరాగంలో అవ్యక్తంగా కనబడే ఆ మాతంగగిరి పక్క ఒక చిన్నశిల నాపూర్వ రూపం. ఈకథ విను!

"ఆనాడు ఎందుకో సార్వభౌముడు విచారమేఘంతో పొదువబడ్డ మలయగిరి శృంగం అయ్యాడు. అప్పాజీ పలుకులు అధీశునిహృదయానికి ఉపశమనం కూర్చలేదు. పెద్దన్నగారి పద్యాలు మేఘంలో ఉరుము లయ్యాయి. పేరుపొందిన అందకత్తెల్ని తెలవెలా పోవచేసే మావాళ్లు భరత పయోరాశి మథించగా పుట్టిన అప్సరసలు, రాజులో రసజ్ఞతాచంద్రికను ఉదయింప చెయ్య లేక పోయినారు.

"ఒక నృత్యాంగన, చెంగల్వరాయ సేనానాయకుల వలపుకత్తె, శ్రీకృష్ణరాయ సార్వభౌములవారి ఆదరణం పొంది శ్రీవారి ఆగ్రహానికి గురియైన తనస్వామికి ఉపకారం చేయచూస్తూ ఉన్నది. ఆమె తన కుమార్తెను పిలిపించి గజ్జె కట్టించింది. ఆబాలిక తిలోత్తమకు అందంలో వంకలు పెద్దగలదు. ఆటలో ఊర్వశికి అపరావతారం. అంతవరకూ, ఆమె కన్నె చెర వీడలేదు. ఆబాలికను సార్వభౌమునికి సమర్పించడానికి తల్లి చెంగరాయనితో మంతనం సలిపి అదను చూస్తున్నది. ఇంతకన్న వేరేసమయం రాదని ఊహించి ఆనట్టువరాలు తనకుమార్తెను సభలోకి ఉత్సవముతో కొని వచ్చింది.

"ఆమేళానికి గురువు అమ్మనాచార్యుల వారు. చక్రవర్తికి జోహార్లు చేసి, మహాప్రభూ! దివ్యనృత్యేశ్వరు పాదాలకడ పూజ చేస్తూ విద్య నభ్యసించిన ఓఅప్సరోంగన దేవరరాజ్యంలో ఉద్భవించింది. ఆబాలిక భరతంలో పద హారు సంప్రదాయలూ నేర్చుకొన్నది. ఆమెవిద్య అవరదేశేంద్రు లైనసార్వ భౌములు దివ్యచిత్తాన అవధరింతురు గాక! రాజరాజేశ్వరుల హాసాంచల సుషమ లోకస్నిపైన ప్రసరించి ఆమెను పవిత్రను చేస్తవి గాక! అని నివేదించు కొన్నాడు. మహారాజులుంగారు అంగీకారసూచకంగా తల వంకించారు.

"అర్థఘటికలో క్రొక్కారు మెరుగుతీగలా ఆబాలిక చక్రవర్తిఎదుట వాట్యాన సాగిలపడి, ప్రభువు 'లే' అనేవరకూ భూమిపైన ప్రాలినచంద్ర కళలా, పచ్చికలో ప్రసరించే కేతగివన్నగిలా అసఖాచంద్రశిలాతలముపైన అట్లే పడి ఉన్నది. మహారాజు కనుసన్న అయినది. ఒక్కుమ్మడిగా తొలి తిత్తి శ్రుతులతో ఒకవిపంచి,ఒకకిన్నెర, ఒకసైరంధ్రి వక్కువాద్యా అయి నవి. దశావతారకథనము ఎత్తుకొని, హంసు చేటిగణికలు తాళాలు వాయి స్తున్నారు. మృదంగం పూర్ణలయాకార మైనది. రసము తొలుకాడే ఒక్కువిహంగనృత్తగతిలో ఆబాలిక సుడిగాలిలా లేచి,—

ప్రళయ పయోధిజలే ధృతవా రసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదం ధృతవా నసి వేదం
కేశవ, ధృతమీనశరీర, జయ జగదీశ, హరే!
క్షితి రతి విపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణ కిణ చక్రగరిష్ఠే తవ తిష్ఠతి పృష్ఠె
శవ, ధృత కచ్ఛపరూప, జయ జగదీశ, హరే!...

అని పాడుతూ అభినయించి సభను సమ్మోహనం చేసింది.

నాగచంద్రుడా బాలికమాటలు వింటూ, సంభ్రమాశ్చర్యాలకు లోనౌతూ, తుంగభద్రా నీళ్లు చీకట్లు తాలుస్తూ ఉండడం కనుగొంటూ, ప్రణయ పూజావేశుడౌతూ, ఆ బాలిక అందాలమోము పరికించి చూస్తూ, దగ్గరగా, అధివసించిన ఆమె యౌవనానందానికే సమ్మోహితుడౌతూ, నిలువునా పులకిస్తున్నాడు.

"ఈప్రదేశం నన్ను దివ్యానందంలో పరవశుణ్ణి చేస్తున్నది!"

"సార్వభౌముల కాలంలో ఇక్కడే ఒక్క శిల్పమందిరం ఉండేది."

నాగచంద్రుడామెవంక చకితుడై చూస్తూ, "ఈ తుంగభద్రానదీ సౌందర్యము ఏలాంటి దివ్యస్మృతులు మొలకలెత్తిస్తున్నది!" అన్నాడు.

"నీహృదయ సౌందర్యమున్నూ అలాంటిదే."

"సుందరతరమైన నీరూపజ్యోతి నన్ను పాదాక్రాంతుణ్ణి చేసుకుంటూంది!"

"అయితే నాకు హృదయం లేదంటావా, ప్రభూ!"

'ప్రభూ! ప్రభూ!' అనుకుంటూ నాగచంద్రుడు విస్మయపడ్డాడు.

"నీహృదయం నాఊహ కందరానిది."

"పణ్యస్త్రీకి హృదయం ఉంటుందా స్వామీ?"

"సర్వప్రపంచానికీ సౌరభాలు చూరలిచ్చిన పణ్యస్త్రీల హృదయాలు వందనీయాలు."

"హేళనా ప్రభూ?"

"హేళనా? నీఆవిర్భావం ఇంతవరకు నన్ను అచేతనుణ్ణి చేసింది. ఏ అందాన్ని నేను ఊహ చేసుకోలేకుండా ఉన్నానో, ఏ అందం నాకు ఇంతవరకూ ప్రత్యక్షం కాలేదో, ఏ అందం ఉంటుందని భావించి భావించి, దేహం పరవశం కాగా, హృదయం ద్రవించిపోగా, నాఆత్మ హ్వారప్రణం

కోసం ఎదురుచూస్తున్నదో, ఆ అందం ఈనాటికి నీలో చూసిన నాకు తెలిసినా ప్రణయదేవీ!'

ఆ బాలిక అతని ఒడిలోకి వాలి పోయింది.

నాగచంద్రుడు ఆవేశంతో, పూజ్యభావంతో ఆమెను బిగియార కవుగిలించు కొన్నాడు. ఆముహూర్తము అతిపవిత్ర మైనది. ఆసంశ్లేషములో వారిప్రేమ మరీ గాఢమై మధురాతి మధుర మైనది.

"దేవీ! దేవీ!"— గద్గద మైన అతని గొంతుక అతి ప్రేమపూర్ణ మైనది. ఆమె కంఠం నుంచి అదృష్ట మైన విచారస్వనము వినిపించి అతని శ్రవణాలకు భూకంప నిస్వన మైంది!

"ఏమి! ఏమి టిది! కళ్ళ నీళ్ళు నింపుతున్నావే! నీబంగారు దేహాలత వణుకుతూ ఉన్న దేమిటి? ఈవిచార మెందుకు? పవిత్రమూర్తీ!"

"నీపూజ నన్ను మూలానికి కదులుస్తున్నది. రూపం అన్నుకొని బతికే నేను ప్రేమమాధుర్యము రుచి యైనా ఎరగను. నన్ను పూజాపీఠ మెక్కించి వివశురాల్ని చేస్తున్నావు!"

"విద్య నాలో వ్యక్త మౌతూవున్న ఇంతనాటినుంచీ ఒక అద్భుత మూర్తినీ, ఆమూర్తిని ఆవరించిఉండే ఓవిచిత్ర హృదయాన్నీ, ఆసర్వాన్నీ ఆవరించి పూర్ణించుకొని ఉన్న పవిత్రాత్మను ఉత్కృష్టాశయం చేసుకొని నేను ఆదేవికోసం లోకాలు గాలిస్తూ, హృదయం దేవాలయం చేసుకొని పూజాద్రవ్యాలతో అంతులేనియాత్ర చేస్తున్నాను."

"ఆ ఆశయిం మృగతృష్ణామాత్రమే కదా ప్రభూ!"

"నిజ మనుకొనే ఈ ప్రపంచానికన్న మృగతృష్ణ ఎక్కువ నిజంకాదా దేవీ!" అంటూ నాగచంద్రు డా విచిత్రబాలికను మరీగాఢంగా కవుగిలించుకొన్నాడు. ఆ అమృతమూర్తిని అలముకొన్న పరిమళాలతో వివశు డయ్యాడు.

"చక్రవర్తిః పరమేశ్వరపదజనిత మైనట్టిన్నీ, నరేంద్రకేశ్వరసముపదిష్ట మైన ట్టిన్నీ, భరతమహర్షి ప్రచరిత మైనట్టిన్నీ, ఏవిద్య ఉన్నదో, అమహాకళ నాడు అబాలికలో మూర్తీభవించి, వికసించడం కనుగొన్నాడు."

నాగచంద్రుడు విస్ఫారిత నయనాలతో ఆమెను తిలకిస్తూ, "దేవీ! ఆ బాలికవు నువ్వే కావుగదా" అని అడిగినాడు.

"ప్రభూ! నేను కాను అని చెప్పనా, అవును అని చెప్పనా!"

ఈషదవనత మైన ఆమె మోమును నాగచంద్రుడు చుబుకము పట్టి లేవ నెత్తుచూ, "దేవీ, నీ పెదవుల్లో మందహాసరేఖ మన్నా నర్తించకుండా నన్నీ విచిత్రస్వప్నంలో తేలుస్తున్నావా?" అన్నాడు.

"ప్రభూ! నాసర్వస్వము నీకు పూర్ణార్పణం చేస్తున్నా. ఈదివ్యక్షణాలు, స్వప్నమో నిజమో నాకే తెలియకుండా ఉన్నవి."

"ఈ దివ్యస్వప్నమే ఎప్పుడూ నిలిచి ఉండరాదా!" "అవును ప్రభూ!" అని నిశ్వసిస్తూ, ఆబాలిక—"అనృత్యము సార్వభౌమునికి ఆనందం నివేద నిచ్చింది. ఆరాత్రి—" అన్నది.

"ఆరాత్రి?"

"సార్వభౌముని అంతఃపురానికి ఆ బాలికను పంపడ మయింది" నాగ చంద్రుడు కూలిపోయినాడు. అతని చేతులు వాడిపోయిన తామరతూళ్ళై వాలిపోయినవి. అతడు నిట్టూర్పు విడుస్తూ ఆనల్లరాతిమీద తల వాల్చాడు.

"ఇక వినలేను, దేవీ!"

"ప్రభూ, నేను పణ్యస్త్రీని."

"నిన్నారాత్రి పంపిన పాతకులు భ్రష్టులు, పిశాచాలు!"

"ప్రభూ! అతిహీనకులంలో జన్మించిన మాపాపహృదయాలు పవి త్రం కాగలవా? సార్వభౌముని క్రీగంటిచూపు మమ్మల్ని అప్సరసల్ని చేయదా!"

"మీరు దివ్యజన్ములే దేవీ! మిమ్మల్ని అనుభవించే ఆ నీచాతినీచులు—"

"ప్రభూ, వినుఃసర్వాలంకారాలతో వాసకసజ్జికనై, మహారాణినైనట్లు ఉప్పొంగిపోతూ, చక్రవర్తిరాకకై ఎదురు చూస్తుంటిని. ముహూర్తాలు గడచినవి. కోటలో ఘంటా రావాలు మోగుతున్నవి. అర్ధరాత్రతూర్యారావాలు, తృతీయయామపు ఢంకానినాదమూ వినబడుతూనే ఉన్నవి. అంతఃపురా లన్నీ నిశ్శబ్దంలో జోగి ఉన్నవి. ఆ చిన్నమాంబారసికుడు రాలేదు. నాహృదయంలో దవానలం చిగురించింది. లజ్జతో కుంగిపోయాను. ఆ మహాపరాభవంలో వైతాళికుల హెచ్చరికలు, వందిమాగధులపాటలు నా హృదయకుహరంలో బ్రహ్మాండము పగిలినట్లు ప్రతిధ్వనించి, ఒళ్లు తెలియని మూర్ఛలో మునిగిపోయినాను.

నాగచంద్రుడు చివుక్కున లేచి కూర్చున్నాడు.

"సార్వభౌముని సౌజన్యము నే నొక్కక్షణమాత్రం సందేహించాను. మ వ్వంతఃపురంలోకి వెళ్ళినసంగతి మహారాజుకు తెలుసునా?"

"ఈపణ్యస్త్రీకి అంత విచారణ, చేసే యోగ్యత కలదా ప్రభూ! చిన్నమాంబాదేవి సరసనుల్లాసానందుడైన చక్రవర్తికి ఆదేవిపైన యేవోకారణంచేత కొంచెం కోపం వచ్చిందనీ, ఆనాటి నానాట్యం ఆయన హృదయంలో సందేహాన్ని కన్నెలై చీకట్లు పారదోలిందనీ, సభనుంచే, ఆపట్టునే మహాప్రభువు చిన్నమాంబాదేవి అంతఃపురానికి పోయి క్షమార్పణ వేడి ఆమెను అనునయించినాడనీ తరువాత నేను విన్నాను."

"శంగల్వరాయుని దుశ్చేష్టితంసుమా దేవీ ఇది!" "అయిదుకోజుల వెనక, తీవ్రజ్వరంలో ఉన్ననాకు స్ఫుటాస్ఫుటంగా మెలకువ వచ్చింది. నృత్యంనాటి ఆసభలో రాజశిల్పి శిష్యులతో వచ్చి ఉన్నాడట, ఒకశిష్యుడు—అవ్యందరపైకజీవి, దివ్యసౌందర్యానందుడు—ఈపాపినీ ఈమె నాట్యాన్ని చూచి శ్రీప్రేమలో మునిగిపోయినాడట—"

"మునిగిపోవటం అబ్బురమా దేవీ?"

"ఆ బాలిక అజ్వరంతో కృశించి కృశించి అసువులను నాలో లయించు–" అమాట ముగించకుండానే నాగచంద్రుడు ఆ శిలాబాలను, చెమర్చే కన్నులతో దరికి చేరదీసుకొని ఆమె మోము తన హృదయాని కద్దుకొని ఆమె తల కన్నీటితో తడిపినాడు.

తూర్పున కొండల ప్రక్కనే ఎర్రనై నాగచంద్రుని సంతోషరాగములా చంద్రబింబము ఉదయించింది. తుంగభద్ర నీళ్ళు శిలాబాల హృదయములా కెంపుజీరలు సాగినవి. సర్వప్రపంచము జ్యోత్స్నానందంలో వివశత్వ మొందింది.

ఆ శిలావేదిక పైన నాగచంద్రుడు మెత్తని తల్పము అమరించి ఆ బాలికను అధివసింప చేసినాడు. ఆమె మోమును తనివి తీరగా పారకిస్తాడు. ఆమె సౌందర్యరేఖల చతులు హృదయాని కద్దుకొని దూరాన్నుండి, దగ్గరనుండి గమనిస్తాడు. ఆమె లావణ్యము పుడిసిళ్ళ కన్నుల కద్దుకుంటాడు. ఆమె ఇంకనూ శిలాబాల కాదు గదా అన్న అనుమానము వీడని చూపులతో, స్పర్శతో కదుష్ణతను కాంతులను పరిశీలిస్తాడు.

ఆమె చిరునవ్వుతో, సిగ్గుతో కొంచెము వంచిన మోముతో, నీలాలు అరుణాలైన కనురెప్పల మాటునుండిన అతని ఆనందము తన హృదయాన్ని నింపుకుంటూన్నది.

నాగచంద్రుడు ఆమె యెదుట మోకరించి, "నువ్వు నా స్వప్నబాలవు. నా జీవితాధిష్ఠాన దేవతవు. నేను తుంగభద్రను, నీవు కృష్ణవు" అని ఆమె ఒడిలో వాలినాడు.

౨

అతడా ఆనందతన్మయత్వంలో, తమి నిండిన హృదయముతో, అరుణావిర్భావమును గుర్తించలేదు. మాల్యవత్పర్వత సానువులపైన ఒక రెప్పపాటు

తన రథము ఆపి కర్మసాక్షియైన సూర్యభగవానుడు ఆదంపతులపైన తన అరుణకిరణ కుంకుమాక్షతలు చల్లినాడు. సుఖపారవశ్యముద్రితా లయిన కనుదమ్ములతో, చెదరిన ముంగురులతో, సడలిన వేణీభరంతో, తనహృదయతలముపైన కలువపూదండలా వాలిఉన్న శైలబాల చెదరిన వన్నెను నాగచంద్రుడు ఆరామోద్భుకనులతో ఆస్వాదిస్తున్నాడు. అలసాలసా అయిన వేబోకకెమ్మోవులు తుంగభద్రాతరంగ శీకర శైత్యాలతో ఆయితమై వచ్చి శైలబాల ముంగురులను పాపటకు చక్కనొత్తుతూ కనుదమ్మిరేకులను ఇంచుమించు విప్పసాగినవి. నాగచంద్రుని కంఠాన పెనవేసికొన బాహులత ఇంచుక సడలించి, తటుక్కున కన్ను తెరచి తల ఇంచుక విప్పి ఆమె అతనిమోము తిలకించినది. ఆమె చూపులలో నునుసిగ్గులు చిరుకెరటాలై ఆనందకాంతుల మిలమిలలాడి, అంతలో ఆమెరెప్పలమాటున అదృశ్యము లైనవి. అర్థపూరితాలయిన చిరునవ్వులు ప్రసరిస్తూ అత డామెను గట్టిగా హృదయాని కదుముకున్నాడు.

రూపవిలాస ముగ్ధ లైన శిల్పుల ఆనందము రూపలయాన్ని కోరుతుందా? ఉత్కృష్టరూపాన్ని సృష్టించే ఆశయంమాత్రం శిల్పుల తపస్సు కాదా? అల్పదోష మైనా ఎరుగని రూపోత్కృష్టాన్వేషణఫలము ప్రాకృతజనులు కోరేదేహానందము మాత్రమేనా? రూపురేఖలు హదగించుకునే వికాసము నులివెచ్చని దేహాంచే బంధిత మైనదా! ఏమిటీ విచిత్ర సంఘటనం!

"ప్రభూ! మీశంకితహృదయాన్ని ఆవరించినతెరను తీయలేను, కాని, సంశయా లెరుగని అతరుణశిల్పి సభలో, నన్ను చూచిన మరుక్షణాన్నుంచీ ఉన్మత్తుడై పోయినా డట!"

"నువ్వు మూర్తిభవించిన సౌందర్య సర్వస్వానివి!"

"అపశ్రుతి లేనిదివ్యసౌందర్యము స్వప్నమాత్రము ప్రభూ!"

"మనోరథప్రాయ మైన రూపానికి రేఖలు లేవు. మూర్తి లేదు మూర్తించుతో గలిగిన ఉత్కృష్టరూపమే శిల్పికి ఆశయం. తీర్థాలు తిరిగిన

ఈనాటికి ఈనాడు ప్రత్యక్షమైనావు."

"ఆనాడు కాదా ప్రభూ!" అంటూ కంఠాన భుజలతలు పెనవేసి కన్నులలోకి చూపుల చొనిపి హృదయాన్ని మేలుకొలుపుతున్న శైలబాలను, కంపించిపోతున్న కరములతో ఎడంగా చాచి పట్టి దేహమనఃప్రాణాల్ని చూపులలోకి తెచ్చుకొని, ఒక్క నిమేషం ఓరసి చూస్తూ, సుఖస్వప్నం నుంచి లేచలేక నిద్ర లేస్తున్న వానిలా, "దేవీ! ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు!" అంటూ ఆనందమూర్ఛితుడైనాడు నాగచంద్రుడు.

తుంగభద్రా తరంగాలవంటి కరతలాలతో ప్రియుడి మేను నిమురుతూన్న శైలబాలను—ఒక్క నిట్టూర్పు పుచ్చి, "దేవీ, స్వప్నం కాదు కదా!" అంటూ హృదయానికి అదుముకొని, "దేవీ! మధురతరమైన మనకథనము నన్నింక చెప్పనీ" అని నాగచంద్రుడన్నాడు.

"నిన్ను చూచిననాటనుంచీ నీస్వరూపాన్ని పరువాలు నింపుకొన్న నీల గ్రావంలో మూర్తింప నారంభించాను."

"ధన్యను!"

"నీకళ్ళలో ఎప్పుడున్నా మీయింటికి వచ్చేవాడను. జీవవర్ణాలు వెలిగే వివిధపుష్పాలు సేకరించి, రసహృదయాలయిన ఫలముల కానుకలతో దిన దినమూ మీమేడకు వస్తూ, నీ కవి అర్పించుకొన్నాను."

"ఫలములే కాదు. నీప్రణయమే ఔషధానికి అనుపానం చేశావు."

"దేవీ, నేను సంకల్పించిన శిల్పమూర్తికి నాప్రేమరసంతో మెరుగులు దిద్దుకొన్నాను. ఎంతరసభావన ధారపోసినా, మూలానికి నా నిర్మించిన ప్రతిమ బింబమాత్రమే అయిపోయిందని సిగ్గుపడ్డాను. నీనయనాంచలాల మెరుపులూ, నీమందహాసాల శీతద్యుతులూ, ఆనాటి నీనాట్యభంగిమలో సౌకుమార్యమూ, హృదయాన పదిలించుకొని తెచ్చి టాంకపు మొనతో నుంచి, నాశిలాబాలకు అందిచ్చుకున్నాను. నాపూజాకల్పనం నీయెదుట [illegible]డానికి నాకు ధైర్యం చాలింది కాదు."

"శిల్పిశేఖరా! నాసపత్ని రూపి! అని నేను దినదినం ప్రశ్నించేదాన్ని ప్రభూ!"

"తేరుకొంటున్న నీఆరోగ్యానికి భంగం కలిగించలేక—".

"దినములు గడుపుతూండే నే నొకనాడు పట్టు పట్టినాను చూస్తా నని, కాదు ప్రియా?"

"దేవీ! ఆదారుణకథ మళ్ళా ఎందుకు స్మరిస్తావు?"

"ప్రభూ! ఉండు. నేను ఎవరు వారించినా వినక, ఒకనాడు పల్లకిలో బయలుదేరాను. నువ్వు నరికివేసిన పెద్దపొదే నీ శిల్పమందిరం కూలగా బయలుదేరినది. ఆశిల్ప మందిరానికి ఆవరాని ఉద్వేగంతో, నిలువలేని ఉత్కంఠతో పల్లకి దిగి వచ్చి, నాప్రతిబింబాన్ని చూచాను. నారూపంలో, నాలో ఉండేలోపాల్ని సవరించుకొని దివ్యత్వం తాల్చిన సౌందర్యం ముందు లజ్జించి, నిశ్చేష్టనై చాపకట్టు పడ్డాను."

"దేవీ! నాశిల్పబాలకు నేను పోయలేని ప్రాణాన్ని నీ వప్పు డర్పించి నన్ను ధన్యుణ్ణి, అధన్యుణ్ణికూడా చేశావు."

"ప్రభూ! ఆవిగ్రహాన్ని చూచి నేను నీప్రేమగంభీరత విశ్వరూపంవలె తెలుసుకొన్నాను. నాతుచ్ఛదేహాన్ని వదలివేసి, నాదివ్యరూపంలో చేరుకొని తరతరాలనుంచీ నీకోసం ఈమందిర శిథిలాల్లో ఈనదీతీరాన తపస్సు చేశాను."

౬

పవిత్రా లయిన మూడురాత్రిళ్ళు లిప్తలై జరిగినవి. దీర్ఘాలు, అర్ధనిమీలితచకోరాలు, చెలుకు లీనుకురంగనయనా లైన ఆమె పెదకన్నులు తనివి తీరని చూపులపూవుల పూజతో తన్ను నింపివేస్తున్నప్పుడు, సరసమై, స్పష్టమై, సున్నితమై, దివ్యరేఖలు కలదై, నునువెచ్చనై, ఉదయారుణ

కాంతిలా మెరిసిపోతున్న ఆమె శరీరసౌందర్యము తన్ను సుడిగుండంలా, చంద్రకిరణంలా, వికసించిన మల్లికావనంలో సువాసనలులా చుట్టివేస్తున్నప్పుడు, ఆమె తనలో లీనమై పోతున్నప్పుడు, కోటిపాటల కుసుమాలలో మధువుల వాకలు ఆమె పెదవులు తన పెదవుల గాఢమైనతమిగో చుంబించేటప్పుడు, నాగచంద్రుని విద్యానంద తన్మయత్వము, కోటి ఉద్యానాల సౌరభా లొక్క బిందువులో సమాహృతా లయినట్లయినది.

అది ఫాల్గుననాటిరాత్రి. సంపూర్ణ పూర్ణిమాజ్యోత్స్న తుంగభద్రా తోయాలపై పన్నీటి పరిమళాల తుంపురు చల్లుతున్నది.

ఆ ఉత్కృష్ట యువయుగ్మానందంలో లయమై లోక మంతా నిశ్శబ్దమైంది.

వారియువ్వురూ యుగాలనాడు ఏమహాతారలలో ఉద్భవించి యాత్ర చేస్తూ భూమి కవతరించిన కిరణద్వయమో!

"ఓకళాధిష్ఠాన దేవా, సుధాకర సార్వభౌమా! పూర్ణతతో కూడగ సౌందర్యబాలకై కల్పాలలో తపస్సు చేసుకొన్నాను. ఆమెను సందర్శించుకున్నాను. పరిపూర్ణతను చేరే సౌందర్యమూర్తిగా సృష్టించుకొన్నాను. రూపరేఖా కాంతిసౌందర్య సంపూర్ణత్వాన కలిగే అద్భుతానందం ఒక క్షణికము మాత్రము. ఈసౌందర్యం, ఈఆనందం, ఈదివ్యనిమేషమూ అనంతం చెయ్య వేడాయి ప్రభూ!" అని మహాయోగకంఠమైన అభ్యర్థనము చేశాడు నాగచంద్రుడు.

ఒక చిరుమబ్బు చంద్రబింబాన్ని ఒకలిప్తమాత్రం కప్పినది. లోకము ఒక లిప్తమాత్రము గాఢాంధకారమయ మైనది.

ఇంతలో దిక్కులు స్పష్టాలై మళ్ళీ చంద్రకాంతులతో తళతళలాడినవి.

శిల్పబాల యథాప్రకారం శిలావిగ్రహమై అనంతనాట్య మొనరిస్తున్నది. నాగచంద్రుడు మోకరించి దివ్యానందభంగిమలో ప్రణామశిల్పస్వరూపాన ఆమె కెదుట కాలశిలా విగ్రహమూర్తిలో ఘనీభూతుడైనాడు.

తుంగభద్ర ప్రవహించింది.

# ఆర్తనాదము

శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి

ఆనాడు కార్తికశుద్ధ చతుర్దశి. రాత్రి తొమ్మిదిగంట లయింది. ధారా మల్లెలు పరిచినట్లు తెరలు తెరలుగా వ్యాపించిన పండువెన్నెల సృష్టికి ఒక విధమైన మైకము కలిగిస్తున్నది.

ఉమాపతి భోజనము చేసి పడకగదిలోకి వచ్చి కిటికీదగ్గర నిలుచోని, సుదూరపరిసమాప్తమైన అడవిచివర మబ్బులగుట్టలలాగు కనబడుతున్న నల్లనికొండల పాదవులు చూస్తూ ఉన్నాడు. గౌతమీ శబరీనదుల కలధ్వని చల్లగాలి తరంగాలమీద సుదూరసంగీతములాగు వినవస్తున్న దతనికి.

కిటికీదగ్గరనే ఉన్న పడకకుర్చీలో కూచోని మేజామీద బొమ్మలపత్రిక చూస్తున్నా డతడు.

ఏవి లేవి ఉంటే ప్రపంచములో అదృష్టవంతు డంటారో ఉమాపతికి అవన్నీ ఉన్నవి. అయిదారువేలు వచ్చే పిత్రార్జితమైన భూవసతీ, కొన్నివేల వడ్డీ వ్యాపారమూ, ఇవన్నీ చూచిపెట్టడానికి తండ్రినాటినుంచీ నమ్మకమైన గుమాస్తా ఉండడమువల్ల సొమ్ము సంపాదిస్తేనే కాని కాలము వెళ్ళదనే విచారము గాని, ఇంటివ్యవహారాలు చూచుకోవలసిన అవసరము గాని అతనికి లేదు. బి. ఎల్. అయినతర్వాత ఏమూడు నాలుగుసార్లో — అదయినా అన్యాయము జరుగుతున్న దని ఏపేదవారో వచ్చి, కాళ్ళా వేళ్ళా పడి బతిమాలుకోవడమువల్ల కోర్టులో అడుగు పెట్టి ఉంటా డతడు.

ఉమాపతి పేరైన నాయుడుకుటుంబములోని వాడు. అతనితాత గారు సైన్యములో చేరి సుబేదారుపని చేశాడు. బర్మాయుద్ధములో చూపిన శౌర్య

సాహసాలకు మెచ్చి ప్రభుత్వమువా రాయనకు ఖబరి ఒడ్డున బంగారము పండే స్వర్ణఖండాల వంటి లంక భూము లీనాముగా ఇచ్చారు. ఇప్పటికీ ఆయన పట్టిన అడ్డతీగె డాలూ వారింట్లో ఉన్నవి. ఉమాపతితండ్రి కూడా మంచి దేహపుష్టి కలవాడు. తాను కాకపోయినా తనకొడుకైనా సైన్యములో చేరి వంశానుగతము లైన శౌర్యసాహసాలను నిలబెట్టేవాడు కావలెనని ఆయనకోరిక. కాని కొడుకు చిన్నతనములోనే ఆయన గతించాడు. ఏకపుత్రవిషయము కాబట్టి ఆయనభార్య ఆయనకోరిక తీర్చడానికి సాహసించలేక పోయింది. నాలుగురోజులపాటు కొడుకు తన కంటబడకపోతే ఆతల్లి ఇప్పటికీ తహతహ లాడిపోతుంది.

ఉమాపతికి సర్వవిధాలా అనుకూలురా లైన భార్య లభించింది. ఆమె పేరులోనే కాక నిజముగా లక్ష్మి. ఒక్కమాట చెపితే చాలు. అత్తగారూ, ఇరుగుపొరుగు సంసారస్త్రీలూ ఆమెను "మాపాలి అన్నపూర్ణ" అని ఉగ్గడిస్తుంటారు. ఉమాపతికూడా భార్య అంటే అమిత మైన అనురాగమూ, గౌరవమూ. ఎంతో అన్యోన్యముగా ఉంటున్న ఆదంపతులకు ఒక్కవిషయములో మాత్రము తరుచు జగడము వస్తుంటుంది. ఒక్కొక్కనాడు రోదనముతో ప్రారంభమై సాంత్వనముతో చల్లారి పోతుంటుం దాజగడము. అది వేటవిషయములోనే.

వేట అంటే ఉమాపతి కున్న సరదా అంతా ఇంతా కాదు. అందులో గోదావరిపైన పడవమీద బయలుదేరి పక్షులను వేటాడడ మంటే అతనికి ఒళ్ళు తెలియదు. అతనిభార్యకు గాని, తల్లికి గాని ఈవే టంటే సరిపడదు. అయినా కొడుకుమనస్సుకు కష్టము కలుగుతుం దేమో అని తల్లిమాత్రము ఈవేటవిషయములో అతనిని వారించలేదు. ఈవిషయములో కొడుకుతో జగడమాడినా కోడలిని ఏమీ అనేది కాదు. లక్ష్మిమాత్రము అవకాశము వచ్చినప్పుడల్లా వేట మాన మని భర్తతో జగడ మాడేది.

ఉమాపతి కాపుర మున్న రామచంద్రపురము చిన్న దైనా నివాసయో

గ్యమైనవూరు. శబరినది గోదావరీనదిలో కలిసేచోటికి మైలుదూరములో ఉన్నది. ఊరికి పశ్చిమాన శబరి, దక్షిణాన మహాగౌతమి. ఊరికి అరమైలు దూరమునుంచీ మహారణ్యము. ఆ అడవిలో మెరుగుమట్టి గను లున్నవి. ఏదో విదేశీకంపెనీ ఒకప్పు డావ్యాపారము సాగించి రేవుస్థలమైన జీడికుప్పవరకూ రాకపోకలకు వీ లైనరోడ్డూ, అక్కడక్కడ గుట్టలమీద మంచిబంగాళాలూ నిర్మించింది. ఇప్పు డా వ్యాపారము లేదు గాని అందుకోసం చేసినయేర్పా ట్లన్నీ ఉన్నవి. ఆమహారణ్యము పాపికొండలు దాటితే గాని ఆఖరు కాదు.

పడవమీద ఉమాపతి పక్షులను వేటాడడమునకు పాపికొండలవరకూ వెళ్ళుతుంటాడు. ఎప్పుడూ కొత్తకొత్తపుస్తకాలు తెప్పించి చదువుతూ ఉండడమో, లేకపోతే నదిమీద షికారు బయలుదేరడమో, ఇవే అతని కానంద మిచ్చేపనులు. తరుచుగా అతడు కొన్నిపుస్తకాలు తీసుకొని వంటవాణ్ణి వెంట బెట్టుకొని పడవమీద బయలుదేరి మూడునాలుగురోజులకు గాని ఇంటికి తిరిగిరాడు. అడవిమృగాలను వేటాడడముకన్నా నదిగట్టున ఆకాశాన్ని వెక్కిరిస్తున్న ట్టున్నచెట్లమీది పక్షులను వేటాడడ మతనికి సరదా.

వానాకాలములోతప్ప ఏడా దంతా శబరినదిలో ప్రవాహ ముండదు. అందుచేత చాలావరకు అతనిప్రయాణము గోదావరిమీదనే. కొండలను చీల్చుకొని ప్రవహించే గోదావరిమీద ప్రయాణము చేస్తున్నప్పుడు మానవప్రపంచములో సంబంధము లేని ఇరుగట్లా పెరిగి ఉన్నమహారణ్యమూ, ఆ అరణ్యములో కొండలలోనుంచి వరుణకన్యలలాగు పాడుతూ వచ్చి గౌతమీప్రవాహములో లీనమయిపోయేసెలయేళ్ళూ, ఆయేళ్ళప్రక్కల గోదుమ రాచుకుబుసాలు పరిచినట్టు ఏజాడా అంటని ఇసుకతిన్నెలూ, ఆ దిబ్బల పక్కనే మనుష్యహస్త మంటకుండా పెరిగిన అరటి, కమలా, మామిడి మొదలైనపండ్లచెట్లూ, ఆచెట్లమీదిగా మెల్లిమెల్లిగా గాలిలో తేలి కొండశిఖరాలకు ఎగబాకి పోయే తెల్లపొగమబ్బులూ, నెమళ్ళకేకలూ, ఈల

కోళ్ళకూతలూ, నీటిపిట్టల కలకలారావాలూ, వెదురుపొదల సంగీతాలూ, కొండలనీడలూ, చెట్లనీడలూ పడి నీలిమ తేరుతూ మచ్చ లేనికొండచిలువ లాగు మెల్లిగా సాగుతున్న నదీప్రవాహమూ, అప్రవాహములో ఈదులాడు తూనో, గాలము వేసి చేపలు పడుతూనో,. వచ్చిపోయే పడవలకేసి వడి చూపులలో బెచ్చిబెచ్చి చూస్తూ ఉండే సిగ్గరగని కోయపడుచులూ, నీరు తాగుతున్న వనగజాలలాగు నీటిఅంచుల కానుకొని నలువు దేరి ఉన్న బండ రాళ్ళకు కొట్టుకొని భగ్న మయిపోయే కెరటాలూ అతనిమనో దేహాలను పులకరింపజేస్తవి. సృష్టిలో వైచిత్రమూ, అకృత్రిమసౌందర్యమూ, చూస్తూ అనదీవక్షాన ప్రయాణము చేస్తున్నప్పుడు అతనికి జరిగిపోయినగాథ లెన్నో జ్ఞాపకము వచ్చి ఒకవిధ మైనపారవశ్యాన్ని కలిగిస్తవి. అందుకే భార్య కిష్టము లేకపోయినా అతడు నదిమీదిషికారు మాన లేకుండా ఉన్నాడు.

బొమ్మలపత్రికలలో వేటమీది వ్యాసము చదువుతున్నాడు ఉమాపతి. ఆకులు చేత బట్టుకొని అతనిభార్య వచ్చి పక్కన నిలబడి "ఏమిటి చదువు తున్నా" రని అడిగింది.

అతడు నవ్వుతూ "ఇదుగో చూడు" అని పత్రిక కళ్ళముందు పెట్టి చూపించాడు.

"మృగాలూ, పక్షులూ కనబడుతున్నవి. ఇదేదైనా వేటనుగురించి వ్రాసిందా?" అంటూ ఆమె వక్కలు భర్తకొకటి కందించింది.

"అవును. ఒకదొర దక్షిణాఫ్రికాలో తనవేటఅనుభవాలు వ్రాశాడు. వ్యాసము చాలా ఉత్సాహకరముగా ఉంటే చదువుతున్నాను" అన్నాడు వక్కలు కొరుకుతూ ఉమాపతి.

కళకళ్లాడే ఆమెముఖము ఈమాటలతో అప్రసన్నమై చిన్నబోయింది. ఇటువంటి పుస్తకాలు చదివితే తనభర్తకు వేటమీద మనసు పుడుతుం దని ఆమెభయము.

లక్ష్మీదేవిహృదయము అతికోమలము. కవిత్వానికి ఛందస్సు ఎటువంటిదో ఆమెహృదయానికి కోమలత్వ మటువంటిది. కావ్యప్రపంచములో మాధుర్యమంజులతలు పడుగుపేకలుగా నేసిన నేత ఆమె మనస్సు. ఆనేతలో సౌకుమార్యమూ, పనితనమూ ఆమె ప్రతిమాటలలోనూ స్ఫురిస్తూ ఉంటుంది. ఆకంఠస్వరము చెవి బడ్డప్పుడు ఎట్టిక్రూర మనసులోనైనా సరే ఒకవిధమైన ఆనందమూ, తృప్తీ వికసిస్తవి. ఇక భర్తమాట చెప్పే దేమిటి! నిజముగా ఆమె అశోకునికాలములో ఉండవలసినదే గాని హింసాచ్ఛాయలలో బ్రతుకుతున్న ఈనాటిప్రపంచములో ఉండ వలసినది కాదు. ఏప్రాణి కష్టపడటము చూచినా ఆమెమనస్సు బాధ పడుతుంది. మాంసపుకూర ముట్టుకోవడానికి కూడా సాహసించని ఆమె మనస్సు ఉమాపతికి తెలియనిది కాదు. అందుచేతనే అత డామెమనస్సుకు నొప్పి కలిగేమాట గాని, పని గాని తలపెట్టడు. తనభార్య ఇటువంటి దనుకోవడమే అతనికి ఎంతో గర్వము. అతనిప్రాణానికి కామె వేయిరేకుల తామరపైన కాలు వున్న విశ్వమాత. ఆమెముఖము అప్రసన్నమైతే అతని గర్వ శిఖరానికి పెద్దదెబ్బ తగుల్తుంది. అందువల్ల ఆతడు అనుక్షణమూ ఆమె హృదయాని కాహ్లాదము కలిగించడానికే యత్నిస్తాడు.

వేటమాట చెవిని బడగానే ఆమెముఖాన పొడగట్టిన భయము కనిపెట్టి అత డామెమనస్సుకు ఉల్లాసము కల్పించవలె నని ఆమె చేతులో ఆకులు తీసుకొని నములుతూ, లేచి ఆమెముఖముపైన చేయి వేసి నెమ్మదిగా కిటికీ దగ్గరకి చేర్చి "చూడు! ఎంత అందముగా ఉన్నదో" అని బయట చూపుతూ అన్నాడు.

నిజముగా బయట శరదుత్సవము సాగింది. విభావరీలక్ష్మి తన జ్యోత్స్నా నృత్యముతో సృష్టిని పరవశము చేస్తున్నది. పచ్చని చెట్ల ఆకుదొంతాల మీద, మవిమందున చెమ్మగిలిన పూలరేకులపైన, మింట తునక తునకలై గుంపు గుంపులై రక రకాలు పొడవులతో చందమామను పట్టుకొనడానికి

లాగు విచ్చుల విడిగా పరుగెత్తుతున్న మబ్బులమీద సౌందర్యదేవత ఊర్పుల కమ్మదనము చక్కగా అలలువారి పోతున్నది.

ఈ దృశ్యమువల్ల, భర్తృసుఖస్పర్శవల్ల ఆమె మనస్సు కలతదేరి వికాసము వహించింది. ఉమాపతి ఉద్వేగరహితముగా ఆమె ఎడమచేతిని తన రెండు చేతులతో పట్టుకొని "లక్ష్మీ" అని రెప్ప వేయకుండా ముఖము చూస్తూ అన్నాడు.

సమీపాన ఉన్న చెట్లలోనుంచి పక్షి ఏవో కూసింది. వెన్నెలవెల్లిలో ఈదుకొంటూ వచ్చి ఆ మధురకూజితము ఆశర(రాత్రి)తో పాటు ఆ దంపతుల హృదయాలను పులకరింపజేసింది.

లక్ష్మి నవ్వుతూ "విన్నారా?" అన్నది.

అతడు "అది రోజూ కూసేపక్షే. ఈవేళ దాని కూత ఇంత మధురముగా ఉండడానికి కారణము నీ మహిమో, వెన్నెలమహిమో మరి!" అన్నాడు. కొంచెము ముఖము చిట్లిస్తూ "మీకొంటెమాటల కేమి గాని అంత శ్రావ్యముగా కూస్తూ ఆనందపెట్టే నిరపరాధిపక్షులను తుపాకీతో కాల్చి చంపడానికి మీకు మనసెట్లా పుట్టుతుందో చెప్పండి" అన్నదామె. ఆ మాటకు జవాబేమీ చెప్పలేక అతడు తన మనస్సులో "వేటలో ఉన్న మజా, ఆనందమూ, వేటగాళ్ళకు తప్ప ఇతరుల కెట్లా తెలుస్తుంది? అందులో ఆడవాళ్ళకు బొత్తిగా అర్థము కాదు" అనుకొన్నాడు.

ఉమాపతి ఏది మరిపించడానికి యత్నము చేశాడో దాని ప్రసంగమే వచ్చిపడింది. వెంటనే అతడు మరి మాటాడక "అబ్బా! నిద్రవస్తున్నది" అని ఆవులించాడు.

"మీ మనసులో దయాదాక్షిణ్యాలు లేవు కాబోలు! పక్షులు ఎంత చక్కనివి! ఎంత తియ్యగా కూస్తవి! అటువంటి అమాయికపు జీవాలను గుండు వేసి కొట్టి చంపేవాళ్ళు—"

ఆమె మాట పూర్తి కాకుండానే ఉమాపతి "అవి నీకంటె దక్కనివా? నీమాటలకంటె వాటిమాటలు తియ్యనివా?" అన్నాడు.

ఆమె నవ్వుతూ "అయితే దక్కదనాన్నీ, తియ్యదనాన్నీ కాల్చి చంపితే గాని—" అన్నది.

"ఛీ ఛీ — నీవు నా హృదయ పంజరశుకివి లక్ష్మీ!" అని రెండు చేతులతో పట్టుకొని ఆమెముఖము తనముఖము దగ్గరికి తెచ్చుకొని ఆమె కళ్ళలో గుచ్చి చూస్తూ "ఇటువంటి తలంపులు నీ మనస్సులోకి రానీయకు. వెళ్ళి పడుకో. చాలా రాత్రి అయింది. నేను పెందలకడనే లేవవలసి ఉన్నది" అన్నాడు.

ఆమె నిట్టూర్పు విడిచి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

పెందలకడనే లేవాలి అని ఉమాపతి అనడానికి కారణ మున్నది. ప్రొద్దుటనే వేటకు వెళ్ళడానికి బోటు సిద్ధము చేయు మని సాయంకాలమే సరంగుతో చెప్పాడతడు.

వేటసన్నాహము పూర్తి అయింది. బోటులోనే భోజనము చేయడానికి ఏర్పాటు అయింది. కావలసిన వంటసామగ్రితో వంటమనిషి రామచంద్రుడు ప్రొద్దున్నే బోటులోకి వెళ్ళిపోయినాడు. చలిదిఅన్నాలు తిని కళాసులూ, సరంగూ రేవులోకి వెళ్ళినారు. ఉమాపతి స్నానము చేసి, వేటకు తగినవేషము వేసుకొని కాఫీ త్రాగడానికి లోపలికి వెళ్ళాడు. కాఫీ త్రాగి మళ్ళా తనపడకగదిలోనికి వచ్చాడు. అక్కడ అతనికి ముఖము చిన్నబుచ్చుకొని నిలుచున్నలక్ష్మి కనబడింది. మిలమిలా మెరుస్తున్న ఆమె కాతరదృష్టులు అతనిని అడుగు సాగనీయ లేదు. వెంటనే అతడు ఆమె దగ్గరికి వెళ్ళి "ఎందుకు అలా ఉన్నావు?" అన్నాడు. గుడ్ల నీరు గుక్కుకుంటూ ఆమె అతనివైపు చూచి "బ్రతిమాలుకుంటాను, ఈ వేళ ఈపాడువేట మానివేయండి. నా మనసు బాగా లేదు. రాత్రి పాడుకలలతో తెల్లవారింది!" అని అతనిచేయి పట్టుకొని అన్నది.

అతడు చిన్నగవ్వు నవ్వుతూ "ఆరోజు ఎవడో సన్యాసి వచ్చి ఏవో పాడుమాటలు చెప్పిన దగ్గరనుంచీ నీకు భయము ఎక్కువయింది. ముష్టి కోసము నోటికి వచ్చినట్లల్లా పేలే సన్యాసులమాటలు విని మనసు పాడు చేసుకుంటే ఎలా చెప్పు?" అన్నాడు.

"సన్యాసిమాటలు కాదు" అని ఆమె అతనివక్షమున ముఖము ఉంచి వెక్కివెక్కి ఏడుస్తూ "భయము కాదు. నిజముగానే ఈరోజు మిమ్మలిని విడిచిపెడితే ఇక మళ్ళీ మిమ్మలిని చూడనే చూడనని నామనసు చెప్పుతున్నది. కలకూడా అలాగే వచ్చింది" అన్నది.

"అయితే చూడు. నీవుకూడా నావెంటరా. నేను అమ్మతో చెప్పి వస్తాను."

"ఇప్పుడు నన్ను పడవమీద తీసికొని వెళ్ళడానికి మీఅమ్మ ఒప్పుకుంటుందా? అసలు పడవప్రయాణం పనికి రాదు," అని ఆమె నేల చూస్తూ అన్నది.

శ్యామాపతి ఉలికిపడ్డట్టు అయి నవ్వుతూ ఆమెను తనహృదయముమీద చేర్చుకొని, మెల్లిగా తనచేతితో నెలలు నిండినగర్భమును నిమురుతూ "నిజమే. నీవు పడవమీద రావడముకు నేనుమాత్రము ఎట్లా సమ్మతిస్తాను? చూడు, దీపాలు పెట్టకముందే వచ్చి వాలుతాను నీదగ్గర. నీకేమీ భయము లేదు. పిచ్చిపిచ్చి ఊహలు ఊహించకు," అని కళ్లు తుడుస్తూ ఆమె రెండుచేతులూ తనభుజాలపైన వేసుకొని ఒక్కముద్దు పెట్టుకొన్నాడు. ఆమెకు మరి మాటాడడమునకు అవకాశము లేకపోయింది. శ్యామాపతి బోటువున్న రేవుకు బయలుదేరి వెళ్ళాడు.

లక్ష్మీదేవి కడుపు నొక్కినట్లయి పెద్దనిట్టూర్పు విడిచింది. గోదావరీ మహాప్రవాహముమీద పడవ తేలిపోతున్నది. తెరచాప ఎత్తారు గాని వాలుగా ఉండడముల్ల తెడ్లు వేయవలసిన అవసరము లేక. కళాసులు ఒకచోట కూర్చొని సంసారపు కష్టసుఖాలు చెప్పుకొంటున్నారు.

శ్రావణ భాద్రపదాలలో, రక్తచందనము పూసుకొన్న వీరాంగనవలె మానవులకు భయంకరమూర్తియై కనిపించే గోదావరి నడుకార్తికమాన నర్తకివలె ఆడుతూ పాడుతూ సాగుతున్నది. ప్రవాహమున సుళ్లు లేవు, పెద్ద పెద్ద కెరటాలు లేవు. చుట్ట చుట్టుకొన్న కోడెతాచులవంటి నురుగుపోగులు లేవు. కేవలము శాంతమూర్తివలె చిరుతరంగాల జలజలారావముతో మనస్సును పులకరింప జేస్తున్నది.

బాలాతపము నదీవక్షాన సౌందర్యజాలము పన్నుతున్నది. ఒడ్డున మాకుల క్రింది బండరాళ్ళమీద మహామునులలాగు కొంగలు దొంగజపము చేస్తున్నవి. కొన్ని చిన్నచిన్ని నీటిపిట్టలు కిలకిలారావాలతో ఎగిరిపోతున్నవి.

గట్టుమీద పొట్టవెళ్ళని జొన్నచేలు గాలితరగలకు వాలి తేలుతూ సస్యలక్ష్మికి వింజామర వీస్తున్నట్లున్నవి. ఉమాపతి పడవలో కూర్చొని గట్టువంక చూస్తున్నాడు. లక్ష్మీదేవి విడిచిన నిట్టూర్పుగాలి ఇప్పటికీ అతని హృదయాన్ని చలింపజేస్తున్నది. కాబోలు!

కాంతిపూర్ణమైన నీలాకాశము నదీప్రవాహములో ఖండ ఖండములై ప్రతిబింబిస్తున్నది. గట్టున ఉన్న పెద్దమ్రాకులనీడలు తరంగాలతోపాటు నదీగర్భమున పాకులాడుతూ మునుముకొంటూ వింతదృశ్యాన్ని సృష్టిస్తున్నవి. నీటిప్రబ్బలి పొదలు ప్రవాహాన్ని అనుసరించి వంగి లేస్తూ నదీదేవతకు నమస్కరిస్తున్నట్లు కనబడుతున్నవి. గాలిపోసుకొన్న వెదురుపొదలలోనుంచి వచ్చేకలనాదాలకు ఈలకోళ్ళు శ్రుతి వేస్తున్నవి. ఈదృశ్యాలు గాని, ఈసౌందర్యము గాని ఉమాపతికి హృదయాకర్షములు కాలేదు. వేటకోనము నదిమీద బయలుదేరినప్పుడెల్లా సౌందర్యముగ్ధమై పారవశ్యమును అనుభవించే అతనిమనస్సులో ఈవేళ తెలియని అలజడి యేదో కలుగుతున్నది.

ఎండలో చురుకు ఎక్కువవుతున్నది. ఉమాపతి 'రిష్టువాచి' చూచి పదిగంట లయిందనుకొని 'చంద్రూ' అని పిలిచాడు.

రామచంద్రయ్య 'బాబూ' అంటూ వచ్చి నిలుచున్నాడు.

"ఇంట అయిందా?" అని అడుగుతూ కాలుస్తున్న చుట్ట నీటిలో పార వేశాడు. అది 'చుయ్యి' మని అరి వెనుకకు కొట్టుకొని పోయింది.

"అయినట్టే. 'పోచారం' రావడముతోనే పడవ ఆపి భోజనము కాని చ్చుకొని మనము గట్టు చేరవచ్చు."

"సరే. మధ్యాహ్నము గాలి సరిగా ఉండక పోవచ్చు. ఎదురు కూడా. ఏలాగైనా ఇంటికి ఆరు దాటకుండా చేరాలి. ఆలస్యము కాకూడదు. మధ్యాహ్నానికి కావలసిన టిఫిన్ వగైరా ఇప్పుడే తయారు చేసుకో" అని ఉమాపతి పెట్టె తీసి తుపాకి చేతితో పుచ్చుకొన్నాడు. గుండెతో పాటు అతని చేయి వణికింది ఎందుచేతనో-అనాడు.

హింసాత్మక మైనవేటలోకూడా ఒకవిధ మైన రసానుభూతి ఉన్నది. ఆ ఆనందరసానికి ఈ సేపథువు సాత్త్విక చేష్ట కాబోలు! కవులు వర్ణించక పోయినా, లక్షణవేత్తలు నిర్వచించకపోయినా, ఈ ఉల్లాసము ఆనందమే.

ఉమాపతి తుపాకీ సరి చేసి అది ఇదీ తుడిచి ఒకసారి గుర్రము నొక్కి చూసి, మళ్ళీ పెట్టెలో పెట్టాడు. తూటాలసంచి బయటికి తీసి పెట్టాడు. ఇంతలో చంద్ర వచ్చి "బాబూ! పోచారం వచ్చాడు. పడవ రేవుకు పట్టవలసిం దని చెప్పాను. భోజనము సిద్ధము చేశాను. దయచేయండి" అన్నాడు.

"అచ్ఛా అంటూ ఉమాపతి భోజనానికి వెళ్ళాడు.

భోజనము కాగానే తుపాకీ, తూటాలసంచి, కొట్టిన పక్షులను వేసే సంచీ, తుపాకి తాను పట్టికొని తక్కినవి చంద్రుచేతి కిచ్చి ఉమాపతి పడవ దిగి గట్టు వెంటనే బయలుదేరాడు.

ఇదివరకు ఎండవేళలో పక్షులు గుంపులు గుంపులుగా చెట్లమీద ఉండేవి. కొన్నిపిట్టలు ఈగట్టునుంచి ఆగట్టుకు పైన ఎగిరిపోతుండేవి. కాని ఆశ్చర్యము, ఆవేళ వేటకు తగినపక్షి ఒక్కటైనా కాన్పించడము లేదు పక్షికులము ఏ మయింది? ఇంద్రజాలమా, లేక ఏదైనా మంత్రప్రభావమా

అనుకొన్నాడు ఉమాపతి. ఏసమయములోనైనా పని సరిగా అనుకొన్నట్లు జరగకపోతే కొంతమందికి విసుగు పుడుతుంది; కొంతమందికి విఘ్నము వచ్చికొద్దీ ఉత్సాహ మెక్కువవుతుంది. వేటకూడా జూదమువంటిదే కదా! ప్రయత్నము వ్యర్థమైనకొద్దీ ఉమాపతికి ఉత్సాహము, పట్టుదలా ఎక్కువవుతున్నవి. ఎల్లాగైనా ఏవో కొన్నిపక్షులను కొట్టకుండా తిరిగి వెళ్ళప్రకృతి కా దతనిది.

మూడుగంట లయింది. పొద్దు వాలిపోతున్నది. ఎండవేడి కొంచెము కొంచెము తగ్గిపోతున్నది. ఆకాశాన మబ్బుతునకైనా లేదు. పోచారము దగ్గర నదీతీరభూమి అరణ్యమయము. నదీప్రవాహాని కంటే, పెద్దపర్వత మున్నది. ఆపర్వతముచరియల్లో కోయలు పోళ్లుచల్లారు. జొన్నపైరు బాగా పెరిగి ఉన్నది. దూరాన విప్పపూవు లేరుతున్న కోయిలపడుచుల 'రేలపాటలు సన్నసన్నగా వినబడుతున్నవి. రాళ్ళను ఒరసుకొంటూ నదీప్రవాహము చప్పుడు చేస్తూ పోతున్నది. ఉమాపతి తుపాకి బుజముమీద పెట్టుకొని చెట్ల పైభాగాలనూ, పొదలనూ పరికించి చూస్తూ ముందుకు వెళ్ళుతున్నాడు. వేటకు వచ్చి కొట్టడానికి ఏమీ దొరకనప్పుడు వేటకానిమనస్సు ఎలా గుంటుందో! వ్యర్థ మవుతున్నది గదా తనిప్రయత్నము మానివేయుడము వేటకానిలక్షణము కాదు. అయినా 'రిస్టువాచి' చూచి 'నాలుగు కావచ్చింది. ఇక ఆలస్యము కాగూడదు' అనుకొని ఉమాపతి నలుదిక్కులా వెదకడ మారంభించాడు.

గట్టుకు కొంచెము దూరములో అంత ఎత్తుగా లేని చెట్లకొమ్మమీద కలిసి కూర్చున్న రెండుపక్షులు ఉమాపతి కంట బడినవి.

అది జక్కవజంట. కావ్యప్రపంచములో దాంపత్యప్రణయము వర్ణించేటప్పుడు ఏకవీ ఈజక్కవజంటలను స్మరించకుండా ఉండలేదు. సూర్యాస్తమయము కాబోతున్నది. రాబోయే విరహాగమునుగూర్చి, అజంట మాట్లాడుకుంటూ, ఒకదాని నొకటి ఓదార్చుతున్నదో, ఏమో! అప్పు డప్పుడు

రెక్కలాడ్చుతూ ముక్కులు కలుపుకొని అవ్యక్తాలాపము చేస్తున్నది. మనుష్యుని అలికిడి వినేస్థితిలో లేదు కాబోలు ఆజంట.

చంద్రుడు ఇంకా వెనకనే ఉన్నాడు. ఉమాపతి మెల్లిగా ఒకపొద చాటు చేసుకొని ఆపిట్టలను గురిచూచాడు.

తుపాకిగుర్రము టక్కు మన్నది. పెద్దమోత బయలుదేరి ఉరుమువలె రాళ్ళగుప్పలుమీదుగా కొండచరియను మారుమోగిస్తూ పరుగెత్తిపోయింది. గొట్టములోనుంచి సన్నపొగ వచ్చింది. పిట్టబడిన చిన్న చప్పుడు వినవచ్చింది. ఒకపిట్ట కాతరధ్వనితో పైకి ఎగిరింది. ఆపక్షి ఆర్తధ్వనితో మళ్ళా కొంత ప్రదేశము ఒకమారు కలిగిపోయింది.

అటువంటి జాలిగొలిపేకూత ఉమాపతి ఇదివర కెన్నడూ వినలేదు. అతని హృత్పిండము కలుక్కుమన్నది. చీత్కారము చేస్తూ ఆకాశాన తిరుగుతున్న ఆపక్షికేసి అదే పనిగా చూడడము మొదలుపెట్టాడు!

ఇంతలో చంద్రువచ్చి "పక్షి పడ్డది పక్షి పడ్డది" అంటూ ఆచెట్టుకిందికి పరుగెత్తి వెత్తు రోదుతున్న పక్షి మెడ పట్టుకొని పైకెత్తాడు.

పూర్వ మొకప్పుడు తమసాతీరాన వియోగకాతరమైన పక్షి యేడ్పు మహాముని వాల్మీకిచెవిని పడింది. రామాయణ కావ్యముతో పాటు ఆపక్షి యేడ్పు నేటికీ మానవజాతిహృదయమును స్పృశిస్తూనే ఉన్నది. మానవుల యేడ్పుకంటె పక్షియేడ్పు తక్కువదా?

తనప్రియురాలిని కోల్పోయిన చక్రవాకము కరుణామయమైన తనవిలాపముతో సమస్తాకాశతలమును నింపివేస్తున్నది. ఇటువంటి పక్షిశోకము ఉమాపతిచెవిని ఎన్నడూ పడలేదు. కాని వాల్మీకి హృదయమును ద్రవింపజేసిన క్రౌంచవిలాపముసంగతి హఠాత్తుగా అతనిమనసులో తోచింది. ఆసంగతి జ్ఞప్తికి రావడముతోనే అతనిమనస్సులో అతనికే తనచర్యమీద అసహ్యము వేసింది. దుస్సహమైన తనశోకముతో ఆచక్రవాకము మానవహృదయానికి ఎన్నడెరుగని యాతన కలిగించింది.

పక్షికళేబరమును చేతితో పట్టుకొన్న చంద్రుని చూచి "ఆపిట్టను అక్కడే ఉంచు- ముట్టుకో వద్దు" అని చెప్పి, తుపాకి వీపున తగిలించుకొని ఉమాపతి పక్షివిలాపము వినలేక చెవులు మూసుకొని గబగబ పడవవైపు బయలుదేరాడు.

ఆ కళేబరము చెట్టుక్రిందనే పడిఉన్నది. అనుగపక్షివిలాపధ్వని దానితో పాటు ఆ చెట్టుచుట్టూ ఆకాశాన సుట్టూ తిరుగుతున్నది. హృద్భేదక మైన దానిరోదన వాయుమండలమునుగూడా కరుణమయము చేసివేస్తున్నది.

ఉమాపతి వాలకము చంద్రుడుకు అర్థము కాలేదు. సామాన్య మైనపక్షి చావు ఉమాపతిహృదయమును ఎందుకు కలతపెట్టుతున్నదో. అర్థము చేసుకునేశక్తి వాడికి లేదు.

మానవకాఠిన్యమువల్ల ప్రియురాలిని కోల్పోయిన ఆ పేదపక్షిరోదన వృద్ధగౌతమి ఓదార్పులతో కలిసి, చెట్టుచెట్టుకు, పుట్టపుట్టకు గాలితరంగాలతో పాటు వ్యాపిస్తున్నది. ప్రతిదినమూ వియోగమును భరిస్తూ ఉన్న ఆపక్షికి ఎందరు సూర్యులుదయించినా, మరి సంయోగమన్నమాట లేని నేటివియోగము జీవశక్తిమూలమును పెల్లగించివేస్తున్నది కాబోలు!

పడవ ఇంటిమొగము పట్టింది. ఇల్లుచేరడమునకు ఉమాపతి ఎంతో ఆరాటపడుతున్నాడు. అతని హెచ్చరికవల్ల కళాసులు శ్రమ లెక్కచేయకండా తెడ్లు వేస్తున్నారు.

పొద్దు కుంకింది. చతుర్దశి వెన్నెల గౌతమీవక్షాన మిలమిలలాడుతూ, దూరాన ఉన్నవస్తువు కనబడకుండా సన్నని తెల్లనితెరతో సమస్తమునూ కప్పి వేస్తున్నది. గౌతమీతరంగాల నాదములో అడవిలోనుంచి వస్తున్న అవ్యక్తనాదములో, ఒక కరుణస్వరము తేలుతూ వచ్చి ఉమాపతి చెవిలో ఏదో అశుభసూచక మైన వార్తను ఊదుతున్నది. ఆజక్కవరోదన అతన్ని మరుపు రావడము లేదు. ఆరోదనే అతనిలో మాటిమాటికీ వ్యాపించి, తలలో గిరగున తిరుగుతూ, హృదయానికి వచ్చి తగులుతున్నది. ప్రొద్దున

బయలుదేరేటప్పుడు తనకంటబడిన లక్ష్మీదేవి చిన్నపోయినముఖము మాటి మాటికీ మనసున ఆడుతున్నది. కన్నీటితో మిలమిలలాడుతున్న ఆమె కళ్లు పొడగట్టినపుడు, మరణయాతన అనుభవించేటప్పటి వాతచక్రవాకి కళ్ళు జ్ఞప్తికి వస్తున్నవి. "నాప్రాణానికిప్రాణమైనలక్ష్మి వేటకు వెళ్ళవద్దని చెప్పినమాట విని ఉంటే హృదయాని కింత ఆవేదన లేకపోయి ఉండును! ఆమె నాకోసము ఎదురు చూస్తుంటుంది కాబోలు!" అని మనసులో అనుకొన్నాడు ఉమాపతి. అందుచేతనే ఇంటికి చేరడానికి ఎన్నడూ లేని ఆరాటము వేడతనికి కలుగుతున్నది. "చంద్రూ! ఎంతసేపటికి రేవు చేరగలము?" అని అడిగాడు ఉమాపతి. "అరగంటలో చేరవచ్చు. దాదాపు వడ్డిగూడెము దగ్గరికి వచ్చాము" అన్నాడు చంద్రు. తెడ్లపవ్వడు వెన్నెలరాత్రిని కదిపివేస్తున్నది.

విరహాతురమైన అజకక్రౌన చిన్నిగొంతులోనుండి వెలువడే హాహాకారము ఇంతదూరానికి కూడా తరుముకొని వచ్చి ఆకాశముతో పాటు ఉమాపతిధైర్యశక్తిని గూడా మింగివేస్తున్నది. అంత చిన్నపిట్టదేహములో ఇంత శక్తి, ఇంత ప్రేమా ఎట్లా ఉన్నవో?

ఇంటికోసము ప్రాణమెంతో తల్లడిస్తున్నది. రాత్రి తొమ్మిది కావచ్చింది. నిన్నరాత్రి ఈవేళకే పక్షికూత వినవచ్చి లక్ష్మి అన్నమాట అతనికి జ్ఞాపకము వచ్చినది. పడవ శబరిమొగకు వచ్చింది. ఇంటికి దగ్గరవుతున్న కొద్దీ ఉమాపతిఆరాటము హెచ్చిపోతున్నది. తల్లిమాట అతనికి స్ఫురణకు రావడమే లేదు. లక్ష్మి, తనలక్ష్మి. ఏమి చేస్తుంటుందో, తనమాట వినక బయలుదేరి వచ్చానని ఎంత విచారపడుతున్నదో, ఆమె కిష్టము లేనిపని చేసి ప్రేమవిషయములో ఆమెకు సంశయము కల్గింపడము మానివేయవలెను. ఈవేటమీది మోజు తగ్గించుకోవలె. ఇక నా లక్ష్మిని విడిచి ఉండకూడదు, అని అతడు మనసులో నిశ్చయించుకొంటున్నాడు.

చంద్రుడు వచ్చి "వర్షవ రోడ్డురేవుకు వచ్చింది" అని చెప్పాడు.

వెంటనే ఉమాపతి ఒక్కదూకులో ఒడ్డుకు దూకి 'సామానూ, తుపాకీ నీవు వెనకనుంచి తీసుకొనిరా'' అని చంద్రుడితో చెప్పి, రోడ్డు ఎక్కి ఇంటి వైపు గబగబ నడచిపోసాగినాడు.

కనబడుతున్నది అవెన్యూలో ఇల్లు. ఇంటిముందు అంతమంది జనము మూగి ఉన్నా రెందుకు?

ఉమాపతి గుండె దడదడ లాడింది. ఊపిరి బిగుసుకొని పోతున్నది. వేళ గాని వేళ తవఇంటికి ఈజనము రావడమునకు కారణమేమిటో ఎవరినీ అడగడాని కతనికి నోరు రాలేదు. ఆజనము ఇతన్ని చూచి తప్పుకొన్నారు. లోపలికి పోగానే సావడిలో ముఖము వంచుకొని గుమాస్తా కనపడ్డాడు. అతనివాలకము చూచి ఉమాపతి కొరాట మెక్కు వయింది. అడుగుల చప్పుడు విని గుమాస్తా ఉలికిపడ్డట్టు ఉమాపతిని చూచి "వచ్చారా? త్వరగా లోపలికి పొండి. కూనవరమునుంచి డాక్టరుగారు వచ్చి లోపల ఉన్నారు'' అన్నాడు.

డాక్టరు రావలసిన అవసర మేమి వచ్చింది? తనభార్యకు నీళ్ళాడ పొద్దు అన్నమాట అతని కప్పుడు వెంటనే జ్ఞాపకము వచ్చింది. గబగబ లోపలి గది దగ్గరికి వెళ్ళాడు. లోపటినుంచి సన్ననిఏడుపు వివవస్తున్నది. ఆగది ముందే డాక్టరు నిలబడి ఉన్నాడు. ఉమాపతిని చూడడములోనే అతనిముఖము వెలవెలపోయింది. నెమ్మదిగా "వచ్చారా? కాని—" అని మరి మాట పిగిలి రాలే దతనికి.

ఉమాపతి గట్టిగా అతనిచేయి పట్టుకొన్నాడు. ఆగదిలోనుంచి, భద్రాచలమునుంచి రప్పించినడాక్టరు, మంత్రసాని బయటికి వస్తూన్నారు. ఉమాపతి ఆగదిలోపలికి వెళ్ళి చూచాడు.

అతనిప్రాణశక్తి, జీవితలక్ష్మి, లక్ష్మి కింద పడుకోబెట్టి ఉన్నది. డాక్టరు నెమ్మదిగా దగ్గరికి వచ్చి ఉమాపతిచేయి పట్టుకొని 'ఒంటిగంట

నుంచి ప్రయత్నించినా, లోపల పోయినపిండాన్ని బయటికి తీయడానికి వీలుకాలేదు" అన్నాడు.

పక్కగదిలోనుంచి ఉమాపతికి తల్లియేడ్పు వినవచ్చింది. మంత్రసాని వచ్చి "ఎంత కష్టపడితే ఏమి లాభము? ఎనిమిదింటికి నొప్పులు వచ్చినవి. శిశువు లోపలనే పోయింది. బయటికి తీయగలిగితే తల్లి బ్రతుకుండునేమో! కాని— పాపము! ఆతల్లి అంతబాధలోనూ వారు వచ్చారా! వారు వచ్చారా! అని ఎన్నోసార్లు అడిగింది. మిమ్మల్ని చివరసారి చూడడానికి నోచుకో లేదు" అన్నది.

సర్వము శూన్యము. జగత్తంతా ఉమాపతికి అంధకారమైపోయింది. ఎంతో దూరాన్నుంచి ఏదో హాహాకారము అతనిహృదయమునూ, అగదిలోనూ నిండిపోయినట్లై అతన్ని క్షోభింపజేసింది.

పడి ఉన్న లక్ష్మీకనులు, మృత్యుగ్రస్తచక్రవాకీకనులు ఒకవిధముగానే తోచి అతని జీవశక్తిని కదిల్చి వేసినవి. రెండుచేతులతో ముఖము మూసుకొని ఆచక్రవాకమువలెనే అతడుకూడా ఆర్తనాదము చేశాడు.

# మాక్లీ దుర్గంలో కుక్క

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

మాక్లీదుర్గం రైలుస్టేషను గుంటకల్లునుంచి బెంగుళూరు పోయేత్రోవలో నాల్గుస్టేషనుల కివతల నున్నది. ప్లాటుఫారంకన్న రైలుస్టేషను పదిగజాలు ఎక్కి వెళ్ళాలి. రైలురోడ్డుప్రక్కనే పెద్దకొండ ఉన్నది. దానినిండా చెట్లూ చేమలూ, రాళ్ళూ రప్పలూ ఉన్నవి. అప్పు డప్పుడు వేగోలాలు సివంగులు రాత్రిళ్ళు స్టేషనులోకి వస్తూ ఉంటవి. స్టేషనుకు వెనుక పెద్దలోయ ఉన్నది. ఆలోయ అంతా సారవంత మైన ప్రదేశం. లోయ కవతలవట్టు ఉన్నకొండమీద ఎవరిదో భాగ్యవంతునిది పెద్దసౌధం ఉన్నది. ఈలోయలో రెండుమూడు వాగులు ఉన్నవి.

మాక్లీదుర్గం స్టేషను చాలా చిన్నది. అందులో చిన్నఅంగడి ఉంది. రైళ్ళు వచ్చేవేళకు ఆ అంగడి తెరిచి ఉంటుంది. ఒకకుక్క అంగడి తెరచినప్పు డల్లా అక్కడ తయారు. అంగడి ఎత్తుగా ఉంటుంది. కుక్క తన చూపు అంగడిలోని పళ్ళికలలో ఉన్నమిఠాయిమీద పడేఅంత సమరేఖలో ఉంచుకొని ఊర్ధ్వదృష్టితో తపస్సు చేస్తుంది. ఎప్పుడైనా, వా డంగడి సర్దేటప్పు డైనా, ఎవ డైనా కొనుక్కునేటప్పు డైనా చిన్నముక్క జారి పడుతుం దేమో అని ఎదురు చూస్తూ ఉంటుంది. వారానికో పదిరోజులకో అట్లా ఎప్పుడూ పడదు గాని, పదిరోజులక్రింద చేసినపకోడీ కొనుక్కొన్నవాడు చద్దివాసన వేసి పారేస్తే కుక్క దాన్ని నోటితో అగావుగా పట్టుకొని ముందుపళ్ళతో నొక్కి అంగట్లోకి పోయేందుకు రెండుగతులు

గతికి ట్రింగి దగ్గ వచ్చి మళ్ళీ కక్కుతుంది. రైలు వెళ్ళిపోవటంతోటే అంగడివాడు మూస్తాడు. కుక్క పోయి సెలయేట్లో నీళ్లు తాగుతుంది. ముందుకాళ్ళు చాచి గడ్డిమీద పడుకొని, లేతగరికపోచలు కొరుకుతుంది. ఆకుక్క మంచి మిడతలవేటకాడు. అప్పుడప్పుడు పొలమూ పిచ్చుకలను గూడా పట్టుకుంటుంది. సెలయేటినీళ్లూ, మంచిగాలీ, లోయలోకి దిగటం, ఎక్కటం—కుక్క మంచి దేహపటుత్వంలో ఉన్నది. కుక్క చెదరినా స్టేషను ఎదురుగా ఉన్న కొండమీదికి పోదు.

ఒకసారి ఒకపెద్దమనిషి ఆడసీమకుక్కను స్టేషనులోకి తెచ్చాడు. వాటి రెంటికీ ప్రథమదర్శనంలో ప్రణయం ఏర్పడ్డది. ఆపెద్దమనిషిచేతిలో కర్ర ఉంది. దాన్ని చూచి మనకుక్క తనప్రియురాలిదగ్గరికి వెళ్ళింది కాదు. పుట్టింట ఉన్న ఆడపిల్లవలె సీమకుక్కమాత్రం నిర్భయంగా తనవలపుకాణ్ణి చూడటం మొదలెట్టింది. పెద్దమనుష్యులు తన్ను పోకిరీ అనుకుంటారేమో నని దుర్గపుకుక్క దానివంక చూచీచూడకుండా చూడటం మొదలెట్టింది. పెద్దమనిషి తనకుక్కను కటకటాలకు కట్టివేసి సామానులు తూయించుకో టానికో దేనికో వెళ్ళాడు. రెండుకుక్కలూ కలిసికొన్నవి.

స్టేషనుమాష్టరు కొంచెము చదువుకొన్నాడు. పెద్దమనిషికీ, ఆయనకీ ఆధునిక సిద్ధాంత రాద్ధాంతాలచర్చ జరుగుతోంది.

స్టే. మా: కాదండీ! వర్ణవ్యవస్థ ఉండాలి. మనపూర్వులు దాన్ని నియమించారు. వాళ్ళు ఏప్రయోజనాలకోసం దాన్ని ఏర్పరిచారో ఆప్రయోజనాలు తెలియకుండా మనం వాటిని తీసివేయరాదు.'

పె. మ: అట్లా అంటే లాభం లేదండీ! ఆసిద్ధాంతా లేమిటో చెప్పండి. మనవాళ్ళు ఏర్పరచారు కదా అని గ్రుడ్డిఎద్దు చేలో పడ్డట్లు పోరాదు. మన వాళ్ళు చెప్పారు కదా అని ఆరోజులు పోయినై. ప్రతిదీ వాదానికి నిలవాలి. వాదానికి నిలవంది మేము ఒప్పుకోము.

స్టే. మా: వారు ఏప్రయోజనా లర్థించారో మనకు తెలియదు. మనకు వాటిని తెలుసుకునే టంతమేధా శక్తి లేదు.

పె. మ: దానికి నే నొప్పుకోను. జ్ఞానము ప్రపంచం నడచినకొద్దీ వృద్ధి అవుతుంది గాని తగ్గడం లేదు. మనపూర్వులకు మన కున్నంతవాదనాశక్తి లే దంటాం. మానసికశాస్త్రం ఇప్పుడు వృద్ధి అయినంత పూర్వం వృద్ధి కాలేదు.

స్టే. మా: అయితే మీరు వర్ణవ్యవస్థ తీసిపారవెయ్యాలి అంటారా?

పె. మ: తీసి వెయ్యా లంటాను. ఈవ్యవస్థ మూలంగా అనేకభేదా లేర్పడుతున్నవి. కొంద రనవసరంగా తాము గొప్పవాళ్ళ మనుకొంటున్నారు. తక్కినవర్ణాలమీద అధికారం చెలాయిస్తున్నారు. వర్ణాంతర భోజనాలు, వివాహములూ జరగవలె. అప్పుడు దేశానికి ముక్తి.

స్టే. మా: సర్వభూతములయందూ సమత్వం ఉండాలిసిందే కాని వర్ణాంతర వివాహం నేను ఒప్పుకోను. పైకి కనపడేభేదాలు మనసా లేకుండా చేసుకోవాలి. మనపూర్వులుకూడా అదే చెప్పా రని నాఉద్దేశం.

పె. మ: మనవాళ్ళట్లాగూ చెప్పలేదు. మనవాళ్ళు సంఘానికి చేసిన ద్రోహం ఇం తంత కాదు.

పెద్దమనిషి బయటికి వచ్చాడు. తనకుక్కవంక చూచాడు. రెండు కుక్కలూ తమవర్ణభేదం మరిచిపోయి కలిసికొంటున్నవి. పెద్దమనిషి పరుగెత్తుకొని పోయి దుర్గపుకుక్కను పదిపదకొండుదెబ్బలు కొట్టినాడు. 'జ్ఞాతాస్వాద' మైన ఆకుక్క వెంటనే వదలిపెట్టడానికి సమర్థము కాక చివరకు వదిలించుకొని పోయింది. స్టేషనుబయటకు పోయినతరువాత కుక్కకు తెలిసింది. తనతోంటి విరిగిం దని. ఆపెద్దమనిషి తనకుక్కనుకూడా నాలుగు మోదినాడు.

స్టేషనుమాస్టరీగందరగోళం విని బయటకు వచ్చాడు. సంగతంతా తెలిసికొన్నాడు. "అయ్యా, ఎందుకు కుక్కనట్లా కొట్టారని?" అన్నాడు.

పె: మ: ఇది జాతి గలకుక్క. దీనికి తోడు మగకుక్కను కొనవలె నని చాలా ప్రయత్నం చేశాను. దొరకలేదండీ. దీనికి ఋతువు వచ్చింది.

దీన్ని బెంగుళూరు తీసుకుపోతున్నాను. ఈజాతిమగకుక్కతో కలపవలెనని.

స్టేషనుమాష్టరు కొంచెము నవ్వాడు. పెద్దమనిషి కనుబొమలమీద మాత్రం కొంచెం నల్లనిరేఖ యేర్పడ్డది. ఆయనా నవ్వాడు.

తరువాత మళ్ళీయిద్దరూ స్నేహంగా మాట్లాడుకొన్నారు. స్టేషనుమాష్టరు సీమకుక్క అందానికి, మొగాన మచ్చకూ, తోకకుచ్చుకూ, దాని గోధుమ వన్నె రంగుకూ మిక్కిలి మెచ్చుకొని దాన్ని ముద్దాడాడు. దానికి పిల్లలు పుడితే నాకోపిల్లను తప్పకుండా ఇవ్వాలని వాగ్దానం చేయించుకొన్నాడు.

ఊరకుక్కసంసర్గంచేత సీమకుక్క ఒళ్ళంతా మన్నయింది. అంతకు ముందే వాన కురిసి పక్కనున్న పెద్దబండలమీద నీటిపడెలు కట్టినై. పెద్దమనిషి తనతోలుపెట్టె తెరచి రెండు ఉతికిన తువాళ్లూ సబ్బుబిళ్ళా తీసి ఆపడెలో కుక్కను అభ్యంగము చేయించి తువాళ్ళతో దాన్ని చక్కగా తుడిచాడు. ఇంతలో రైలు వచ్చింది. ఆయన కంయికంయి మని అరుస్తున్న కుక్కను తువాళ్ళలో చుట్టి చంకను పెట్టుకొని రైల్లో ఎక్కాడు. మగకుక్క ఆడకుక్కకు దూరంగా నిలుచుండి కుంటుతూ కుంటుతూ దానివంకనే సాకూతంగా చూడడం మొదలు పెట్టింది. ఆయన కిటికీలోంచి తొంగి చూచి కుక్కవైపు రెండుసార్లు కర్ర ఆడించాడు. అది మరీ దూరం పోయింది.

రైలు సాగింది. సీమకుక్క కంయి కంయి మని తలుపుదగ్గరకు పోతుంది, తొంగి చూస్తుంది. అతడు గొలుసుతో లాగి పట్టుకుంటాడు. రైలు బెంగుళూరు పోయినతరువాత కుక్క ఏడుపు మానేసి యజమానిదగ్గర అనువుగా కూర్చుంది. అతడు దాన్ని ఒళ్ళోకి తీసుకొని "లీలా! అల్లా చెయ్యవచ్చునా?" అని దానినోట్లో నోరు పెట్టి ముద్దు పెట్టుకొన్నాడు. ఇందాకటి కుక్క ఈపనే చేస్తే అంత హృదయంగమంగా ఊరుకొన్న ఆకుక్క పరపురుష చుంబనం పరిహరించినట్లుగా అతనిచుంబనం పరిహరించింది.

దుర్గములో కుక్క తనతోంటి గాడిదగడపాకులకూ, అడ్డసరపాకు లకూ చేసి రుద్దుకొని సెలయేటిఒడ్డున ఉన్న ఒండుమట్టిలో అద్దుకొని పది హేనురోజులకు కాలు నరిచేసుకొన్నది. మళ్ళీ స్టేషనులోకి వస్తున్నది. మిఠాయిదుకాణంవంక చూస్తున్నది.

ఒకనాడు ఇద్దరు విద్యార్థులు అక్కడికి వచ్చి దుకాణంలో ఏదో కొనుక్కొని తింటూ బల్లమీద కూర్చున్నారు. వాళ్ళ యిద్దరి మాటలూ కుక్కచెవిని పడ్డవి.

"మనదేశంలో భూతదయ అన్నది లేదు. పెద్దవాళ్ళందరూ చిన్న వాళ్ళమీద అధికారం చేస్తారు. నేను బి. ఏ. ప్యాసైనాను. ఉద్యోగ మిచ్చే దిక్కులేదు. పేదవాళ్ళు మలమల మాడిపోతున్నారు, గొప్పవాళ్ళు సోఫాలమీద గాని ఒరగరు" అన్నాడు ఒకడు.

"మనవాళ్ళు అందరూ స్వార్థపరులే. పిడికెడు బిచ్చం పెట్టరు. చివ రకు కుక్కకు వేసిన ట్లన్నా పేదవాళ్ళ కింత వెయ్యరు" అన్నాడు రెండోవాడు.

కుక్క వాళ్ళదగ్గరకు వచ్చి వాళ్ళచేతిలో పొట్లంవంక చూసింది. వా ళ్ళిద్దరూ ఇంగ్లీషులో మాట్లాడు కొంటున్నారు. అందులో ఒకతనికాళ్ళకు బూట్లు ఉన్నవి. కాలుమీద కాలు వేసుకు కూర్చున్నాడు. ఆబూటు కాలితో కుక్కను డొక్కలో తన్నాడు. దానికి రెండుమూడు రోజుల నుంచీ తిండి లేదు. ఆదెబ్బ పొట్టలో ఏనరానికి తగిలిందో అది మెలికలు తిరిగిపోయింది. కొంతసేపటి కది తెప్పిరిలి లేచి పోయింది. రెండవవిద్యార్థి తనచేతిలోది కొంచెం దానిముందర వేశాడు. అది నొప్పిచేత దానిని ముట్టు కోకుండా పోయింది.

ఆరోజుసాయంత్రం కొండమీదనుంచి ఒక వేగోలం దిగి రాత్రిపూట

స్టేషనులోకి వచ్చింది. కుక్క భయపడి దుకాణంక్రింద గూడుగా ఉంటే దానిలో దాక్కుంది. స్టేషనంతా నిర్జనంగా ఉంది. వేగోలం పసి పట్టి ఆగూటిదగ్గర కావలా వేసింది. వేగోలం మూతి గూట్లోకి పెడితే కుక్క లోపల దాక్కుని దానిమోరంతా కరిచింది. వెనక్కు తిరిగితే తోకా, పృష్ఠభాగం గాట్లు చేసింది. వేగోలం మై మరచి ఉంటే కొంచెం బయటికి వచ్చి దానిమెడ పట్టుకొని గుంజింది. అది కరవవస్తే తను గూట్లో దాక్కుంటుంది. ఇట్లా మూడు నాలుగు గంటలు దాగుడుమూతల యుద్ధం చేసి ఒక ఒడుపులో వేగోలంపీక పట్టుకొని దానిఊపిరి ఆగేదాకా కుక్క వదల లేదు.

తెల్లవారిన తరువాత అందరూ వచ్చారు. కుక్క పౌరుషం చూశారు. ఏడాది రెండేళ్లుగా మర్యాద లేని ఆకుక్కకు ఆనాటితో మర్యాద ఎక్కువైంది. స్టేషనుమాష్టరు దానికి రోజూ అన్నం పెయ్యమని ఫర్మానా యిచ్చాడు. ఆరోజు సాయంకాలం అంగడివాడికి మహాదయ కలిగింది. ఒక్క బూందీపూస టీరు వోనియ్యని ఆపిసినిగొట్టు సంవత్సరముబట్టీ పరిశిష్టపు నూనెతో పరిశిష్టంగా వస్తున్న మిఠాయిజంగిలీ దానిముందర పెట్టాడు. ఆ మిఠాయి మరెవ్వరూ కొనరు. ఎవ్వరూ కొనకపోడం చేత, వారం రోజుల కొకసారి తాజాగా నూనెలో వేస్తున్నా ఎవ్వరూ కొనలేదు. కుక్కమీద మహాదయ పుట్టి ఆజంగిలీ దానిముందర పెట్టాడు. అది తిన్నది; ఆప్యాయంగా తిన్నది. ఆరాత్రి కుక్క తెల్లవార్లూ మహాబాధ పడుతున్నట్లుగా ఏడవటం మొదలుపెట్టింది. ఇంట్లో పడుకొన్న స్టేషనుమాష్టరూ, పోర్టరూ వేగోలాలు వచ్చినై అనుకొన్నారు. కుక్క పగలు పోయి పొలాలమీద అడవులమీద తిరిగి వస్తుంది. దానికేదో మహావాతం పుట్టింది. కనపడ్డ ఆకల్లా కొరికింది. ఏ ఆకూ పని చెయ్యలేదు. ఒందుమట్టి నాచేత కాదంది. సెలయేటినీళ్ళు ఇది మాపని కాదన్నవి. రాత్రిళ్ళు స్టేషనులో పడి ఏడుస్తుంది. మెలికలు తిరిగిపోతుంది, తన నడుము

రైలు కింద పడ్డట్టు గోల చేస్తుంది.

వారమురోజు లీరీలిగా కొట్టుకులాడితే దాని వ్యాధి ఉపశమించింది. రెండురోజు లుపవాసం ఉండికూడా వేగోలాన్ని చంపిన యీకుక్క వారము రోజు లయ్యేటప్పటికి చిక్కి శల్య మయింది. దాని వెనుక కాళ్ళు మొత్తా తప్పుబడిపోయినవి. అది యెక్కడో ఒకచోట పడుకొని మూలగడానికి కూడా ఓపిక లేకుండా సన్నగా యేడుస్తుంది. దానికి మిఠాయి అంగడి అంటే భయం వేసింది. అంగడివైపు పోదు, అంగడివంక చూడదు. మునుపు స్టేషనులో యథేచ్ఛంగా తిరిగేది. స్టేషనుమాస్టరు గదిలోకి పోయి తొంగి చూస్తే చీడకుక్క, పేలకుక్క అని దాన్ని కొట్టడం మొదలు పెట్టారు.

ఆరునెల లైంది. ఆకుక్క చావదు, బతకదు. ఒకరోజు సీమకుక్కను తెచ్చిన పెద్దమనిషి వచ్చాడు. మాస్టరూ ఆయనా పూర్వపరిచయాన్ని మగిడించుకొని మాట్లాడుకొన్నారు. మాస్టరు "ఏమండీ, కుక్క పిల్లలను పెట్టిందా?" అని అడిగాడు: పెద్దమనిషి ఇట్లా అన్నాడు. "అయ్యా, కుక్కను బెంగుళూరు తీసుకెళ్ళారు. జాతికుక్క నెక్క నివ్వలేదు. మా పాడుకుక్క పాడు చేసింది. కుక్క రెండుపిల్లలను పెట్టింది. ఊరకుక్కల్ని పెట్టింది. నాకు చాలా విచారం వేసింది. ఈసారి మంచిపిల్లలు పెడితే మీకు తీసుకు వచ్చి యిస్తాను." స్టేషనుమాస్టరు "మా కుక్క చాలా మంచిదండీ! అది మంచిపౌరుషశాలి. కొన్నాళ్ళకింద అది వేగోలాన్ని చంపిం" దన్నాడు. పెద్దమనిషి "పోనిద్దురూ! వెధవకుక్క! నాకు దానిని చంపవలెనని ఉంది. ఇంకా అది మీ స్టేషనులో ఉంటే చూపించండి, దాన్ని నరికి పోతా" నన్నాడు. ఇంకా స్టేషనుమాస్టరు "ఏదో పెద్ద వాతం పుట్టి కుక్క పాడై పోయిం" దన్నాడు.

ఇంతలో ఆకుక్క యీడ్చుకుంటూ అక్కడికి వచ్చింది. స్టేషనుమాస్టరు ఇదే నండీ అని చూపించాడు. పెద్దమనిషి కోపం పట్టలేక తనచేతిలోని పేముబెత్తంతో ఒకటి వేశాడు. అది పారిపోలేక అక్కడే ఒకపక్క కొత్తిగిలి మెడా కాళ్ళూ యెత్తి యేడ్చింది. పోర్టరు వచ్చి కాలితో దాన్ని అవతలికి తోశాడు. మాస్టరు నవ్వి "మీ కెంత కోపమండీ!" అన్నారు.

వారి యిద్దరి స్నేహమూ బలిసి ఆరాత్రి పెద్దమనిషి స్టేషనుమాస్టరుగారికి అతిథిగా ఉండిపోయినాడు. ఆనాటిరాత్రి ఆకుక్క రైలుక్రింద పడ్డది. రైలు దాని నడుమునీదనుంచి పోయింది. "అంగవ్రాతములో చికిత్సకును దుష్టాంగమ్ము ఖండించి" నట్లు, రైలు వ్యాధిగ్రస్తమై నష్టశక్తివయై దానిపశ్చార్థమును ఖండించింది. కాని శేషాంగ శ్రేణికి రక్ష లేక అది అరగంట తన్నుకొని చనిపోయింది.

౪

తరువాత నాల్గునెలలకు ఆపెద్దమనిషి తనరెండు కుక్కపిల్లలలో ఒకటి చచ్చిపోయిన దని చెప్పి రెండవదానిని స్టేషను మాస్టరుగారి కిచ్చాడు. అది ఆరు నెలల్లో యెదిగి తనతండ్రివలె వినది. దానికి భయము లేదు. ఎదురుగా నున్న కొండమీదికి షికారు పోయివస్తుంది. ఎవరన్నా దానికి మిఠాయి పెట్టబోతారు. అది వాళ్ళకు పళ్ళు చూపించి కరవవస్తుంది. ఎన్ని ఆడ కుక్కలు వచ్చినా వాటివంక చూడను అది పిల్లవెగోలాలను కుందేళ్ళనూ నక్కలనూ వేటాడుతుంది. విద్యార్థులు వచ్చి భూతదయాప వ్యాసములు చేస్తూంటే వాళ్ళవంక ఓరగా తిరస్కారముగా చూస్తుంది. ఆపెద్దమనిషి వచ్చి వర్ణవ్యవస్థనుగూర్చి స్టేషనుమాస్టరుతో మాట్లాడుతూ ఉంటాడు. ఈ కుక్క వస్తే దీనిని ముద్దుగా ముట్టుకోబోతాడు. అది కోపంగా పళ్ళు చూపించి జీర్ణముకాని వెగోళ్ళ మాంసం కక్కిపోతుంది. రైలు మైలుదూర

మున్నదనగా ముక్కోళ్ళతో శ్వాస యెగలాగి వదిలిపెట్టి సీదరించుకొని తొలగిపోతుంది.

మిఠాయిదుకాణమువాడొకనాడు చద్దిమిఠాయి దానిముందర వేయబోయినాడు. అది వాడి పిక్కకండలు పట్టి లాగింది. అది వేగోలం గాని కుక్క కాదన్నా రందరూ. దానికి మనుష్యుల్ని చూస్తే వెగటు వేసింది కాబోలు. కొన్నాళ్ళకి జనసమ్మర్దమైన ఆస్థలాన్ని వదలిపెట్టి అడవుల్లోనే ఉంటూ వచ్చింది. అప్పుడప్పుడు స్టేషనుదగ్గరకు వస్తుంది. నిత్యగహన సంచారంవల్లనో, తల్లిపోలికో తోకకుచ్చు బలిసింది. కోరలు వచ్చినై. మనుష్య గాలి తగిలితే బృహస్పతి తమ్ముడు సంవర్తమహర్షివలె సీదరించుకొని తొలగిపోతుంది.

# మట్టెల రవళి

శ్రీ కవికొండల వేంకట రావు

తొలకరివానలకు తగిలిన కొత్తకొత్తనీటితో గోదావరితల్లి చెందిరించి ఉర్రుట్లూగుతూ వుంది. ఆయమకు కుంకుమర్పిస్తూ వుందా అన్నట్టు ఎర్రగా తురాయిమొక్క పూసి, పొద్దునే కనిపిస్తూవుంది. ఆయమ కెరళ్ళ నాదానికి తాంగుగా తాళం వేస్తూందా అన్నట్టు పసరాకులతో రావిచెట్టు రేవు చెంత ధ్వనిస్తూ వుంది. ''ఓ గంగమ్మతల్లీ! ఇదిగో! నీకు రవికల గుడ్డలు, ఇదిగో! నీకు రంగురంగుల చీరలు అన్నట్టు సాయంకాలసంధ్యాదేవి వన్నెచిన్నెలమయమై తొలుకాడుతూ సౌభాగ్యవతు లగు ద్విజాంగనలో అనే పక్షులవరసల్ని వెనుదరుముతూ వుంది.

కొత్తగా తగిలిన నీరు, శబరి నీరా కాకపోతే పరిసరాల్ని వున్న ఎర్ర రాళ్ళదిబ్బ మీదుగా ప్రవహించి రంగునుద్ద కలిపిన రాజమహేంద్రవరపు నీరా, అనే సంశయం గట్టునుండి వితర్కించే మనుష్యమానసాన్ని ఇంకా గుంజిస్తూనే వుంది. శబరి నీరైతే అంత ఎర్రగా వుండ దంటున్నారు కొందరు. శబరి నీరు కాకపోతే ఆ మారుదల వుండ దంటున్నారు కొందరు.

ఇలా కొందరు, అలా కొందరు అనుకునేవాళ్ళు అనుకుంటూనే వున్నారు. ఆరాత్రి గడచిపోయింది. మరునాడు తెల్లవారి ఎనిమిది తొమ్మిదిగంట లవుతుంది. పట్టపగలు పుష్కరరేవులో పల్లెజవ్వని నావలోంచి చేపలగంప నిండుది వొడ్డుకు దించుకుని, పయ్యెట సవరించుకుంటూ వుంది. పదిమంది కొను

గోలుగాళ్ళు మూగేరు. పెద్దచేప, చిన్నచేప, ఎత్తి చూచి ఎంత కిస్తావు? ఎంత కిస్తావు? అని అంటున్నారు.

దూరాన్నే వడ్డెట్లో అంక, అంకలమీద జనం, ఆజనం వేసుకొన్న తాత్కాలిక కుటీరాలూ, కుటీరాలను బట్టి అరగట్టిన వలలు- అన్నీకూడా ఒక్కక్షణంలో అల్లకల్లోలం అయిపోతూ మహాదృశ్యం వొకటి ప్రదర్శింపున కొచ్చిందే. ఏమిటది? పెద్ద ప్రవాహం! నీటివంక చూస్తే ఏనుగువడక, నురువువంక చూస్తే లేడివరుగు. లంక మీది జనం, జనం వేసికొన్న కుటీరాలు అరటితోటలు వృక్షశాఖలు అన్నీ మునిగిపోయినాయి. ఒక్కవంతెన వంతెనమీదగా వస్తూవున్న మెయిలుబండీ, అవొండే శాశ్వత మన్నట్లు,, తోచినాయి. పల్లెజవ్వని వెనక్కి తిరిగి చూచింది. ప్రవాహం వచ్చేసిందని తెలిసి కాదు. మెయిలుబండి అప్పుడే వస్తూంది. దాని చప్పుడుకు వెనక్కి చూచి, బేరగాండ్రతో " నన్నుపోనీయండర్రా! బండికూడా వచ్చేసింది నాకుదా రియ్యండర్రా! చూడండి ... మీతో బేరాలు ఎప్పటికీ తెగవు. బజారుకు పోతాను'' అని అనాఅనీ, బేరగాండ్రను తప్పించుకు బజారుకు పోదామనీ దానివూహ. అవ్వూహతో వెనక్కి తిరిగి చూచింది.

కాని పాపం! మెయిలు వేగం కంటె, మెయిలు చప్పుడు కంటె, గోదారిగంగ యెక్కువగా మెరిసింది, ఎక్కువగా ఉరిమింది, దానికన్నుల్లోనూ, దానివీనుల్లోనూ. అంతే కాదు; దాని హృదయకుహరంలోకి వంతెన స్తంభాలు కూలి వంతెన వ్రీలి పడ్డట్టు అయిపోయింది. దానికనువు తరుక్కుపోయింది.

తెచ్చిన చేపలన్నింటినీ వచ్చినమనుష్యులే యెత్తుకుపోయినారో, గద్దలే యెగరేసుకు పోయినారో కూడా కానకుండా ఆస్త్రీ గట్టమ్మటే వాలు వడివలా నడుస్తూ వుంది. మధ్యాహ్నం ౧౨ గంట లైంది. అపరాహ్ణం మూ డైంది. సాయంకాలం ౬ లైంది. ఆమె అలా నీటికేసి చూపెట్టుకునే

నడుస్తూ వుంది. ఆమె కేదో దృష్టిపథాన్ని కనబడుతూ వుంది. ఆమె పెనిమిటిలా కనిపిస్తూ వుంటూ డెవడో మనిషి. నీటితో పెనగులాడుతూ ఎదరీతను గట్టుకు వస్తూవున్నట్టు వుంటాడు. మళ్ళీ జారిపోతుంటాడు. దృష్టి నుంచే జారిపోతుంటాడు. ఎలా రక్షించేది అతణ్ణి? ఎవరు రక్షించేది అతణ్ణి?

బహుళపక్షము. చీకటి పడిపోతూ వుంది. పైపెచ్చు ఝంఝామేఘం కమ్ముతూ వుంది. చిటపట చినుకు ఇదిగో అదిగో అంటూ వుంది. రాత్రి ఎనిమిది తొమ్మిది కూడా అయింది. ఎలుగెత్తి పిలుస్తుందా? వెలుగేదైనా చూపిస్తుందా? చేయి విసురుతుందా? ఆమె ఏమి చేయడానికి అశక్తురాలనుకోండి. ఆ అబలకు మరో ఆలోచన తట్టలేదనుకోండి. ఏలాగయితే ఉదయం తొమ్మిది నుంచీ గట్టమ్మట నడుస్తూ ఆ దృష్టిపథాన్ని పడేవాడు తనభర్తేమో అని ఆశతో అనుకొంటూవుందో అలాగే అనుకొంటూ అలాగే నడుస్తూ వుంది రాత్రి తొమ్మిదిగంటలప్పుడున్నూ!

ఆమె దృష్టిపథాన్ని అప్పుడప్పుడొడుతూ అవునా, కాదా అనిపించేవాడు నిజంగా ఆమె పెనిమిటి నాగడు. వాడు హఠాత్తువరదలోమన్నా చటుక్కున కొట్టుకుపోయినాడు. ఈదగలడు. కాని ఎందాకా ఈదగలడు? ఆధారమేదైనా వుంటే కొద్దిగా నిలదొక్కుకోని ఒడ్డున పడగలడు. కాని తొందరలో మనిషికి అసలే ఆధారం సున్న. జంతువు కేదో స్వతస్సిద్ధమైన శక్తి సామర్థ్యం అనంతమయి వుండవచ్చును. కాని మనిషికి అలాంటిది వున్నట్టు కనుపించదు. మనిషి శరీరనిర్మాణంలో కొమ్ములు లేవు, తోక లేదు, నాలుగు కాళ్ళు లేవు. వానికి పడగ లేదు. ముడుచుకుపోయ్యే గోళ్లు లేవు, ముందుకు వచ్చే కోరలు లేవు, ముళ్ళు లేవు, పొలుసు లేవు, వేళ్ళ వేళ్ళ మధ్యనూ చర్మం లేదు. ఏదీ లేదు. మనిషి కేదీ లేదని చెప్పొచ్చు.

మనిషి అయినవాడు తలీవరదలో ఏదైనా పోనీ ఓ ఆధారం చూసుకుంటాడా అంటే వాడి కగపడే వన్నీ అల్లాడే కాని ఒక్కటి సజావైంది

దొరకదు. నురుగు అడ్డు. నురుగుతో కంప అడ్డు. ఇం తెందుకు, తనకడ్డతే తన కడ్డు. పోనీ కొట్టుకు వచ్చేకలప సాధారం చేసుకుంటాడా. అంటే ఆకలపలో ప్రాణి కన్పించింది. సాహుకార్లు కలపను కూనవరం మీదుగా తెప్పలు కట్టి తోసుకు వస్తూ వుంటారు. అలాంటి తెప్పలు కొంతదూరం వచ్చేసరికి వాటికంటే ముందంజ అయిన వరద ఆతెప్పల్ని విడగొట్టి చెల్లా చెదురు చేసి ఆకలపనూ అసలు సద్యఃఆవరదకు విరిగిపడ్డచెట్లనూ ఏకం గావించి దొర్లించేస్తూ వుంటుంది. ఈదేమనిషి సాహుకార్ల కల పెక్కడా ఆకలప నిలవకలవ అవడంవల్ల పాకుడు కట్టి వుండి జర్రున జారి తిరిగి గోదార్లో పడిపోతాడు. ఆకలప దిగువాయకు పోతుంది. ఇల్లాగ్గా మోస పోతాడు. అడివిచెట్టు కొమ్మేదో దొరికిందా బ్రతుకు జీవుడా అనుకొంటూ కాస్తంత సేద తేరతాడు. కాని దాని తొర్రలోనో, దాన్ని చుట్టబెట్టు కునో మహాసర్పం కనుపించి పై ప్రాణాలు పైనున్నపాళంగా ఎగరగొట్టే స్తుంది. తొల్త నాగడి కెంతసేపూ సాహుకార్లకలపతెప్పల విడిపోయిన దుంగల్లే దొరుకుతూ వచ్చేవి. వచ్చి వచ్చి జారిపోయేవి. అలా జారిపోవ డంలో అనకట్టు ధరిదాపునకే జారిపోయినాడు పాపం! అక్కడ గడ్డిపరక పట్టుకున్నాడు. ఇంకోక్షణాన్ని పాముతోక పట్టుకుని దాన్ని వెనక్కు లాగి అది కాటు వెయ్యబోతే బుడుంగున మునిగిపోయి నీట్లోనే 'అమ్మో' అన్నాడు. ఇంకోజాముకో ఎద్దుమూపురం పందెట గడించి కొంతదూరం ఈది, అది పట్టివ్వకపోతే, వదిలేసి అలావకాతలే కొట్టుకొస్తూ వున్న ఇలారం ఎక్కి కూర్చున్నాడు. అలా కూర్చున్న నాగడిమీద కాకి వాలింది. ఆ దేదో బ్రహ్మరాక్షసి అనుకొని పిల్లిమంతరం వేసి ఆకాకిని తప్పించుకొని, నీటిలో కరిగి అలసిపోయినాడు.

యోచిస్తే నాడిబతుకు అసమయంలో ఎలాంటి బతుకు అయి పోయిం దంటే- బుడగలో ఊపిరే వాడి ఊపిరి అన్నట్టయి పోయింది.

కనుచీకటి పడేవేళ క్యాంమోసు నాగడి కోవచ్చికొమ్మ కొట్టుకొస్తూ

వున్నది చేతికి దొరికింది. కాని చీకట్లో దానిరం గానింది కాదు, అదే వొడ్డనుకొని రక్కాడు. ఆకులు తగిలాయి చేతికి. ఏదో గడ్డం అనుకొన్నాడు. ఆ ఆకుల్ని ఇలా అలా వూపి "ఎవరవు నీవు, మనిషివా?" అని అడిగాడు. ఎవరూ పలుకలేదు. అయినా అలాగ్గానే గడ్డం పట్టుకొని వ్రేలాడుతూ వున్న అభిప్రాయంతోనే దాన్ని ఊంటాడించాడు. అదో సుడిగుండంలో గిర్రున తిరిగి, అవతలదూరం వున్న దల్లా, ఈతట్టుకు నాగడి సమీపంగా వచ్చిపడింది. ఏలాగైతేం రాత్రి ౯ గంటలకు నాగడు గోదావరీ ప్రాంతానికి చేరుకున్నాడు.

చేరుకున్నాడు! కాని చేరుకున్నలాభ మేమిటి? చీకటి అయోమయం: మనిషీ మాకూ ఒకటే అన్నట్టుంది అంతాను.

మేఘాలు మెరిస్తే కద్దు వెల్తురు, మేఘాలు ఉరిమితే కద్దు చప్పుడు, కాని పిడుగు పడితే? వడగ తగిల్తే? నాగడు! నాగడు! మృత్యుదేవత కఠోర దంష్ట్రా కరాళాల్లోంచి యివతల బడ్డనాగడు! చచ్చిపోతాడే! వాడిబుర్ర చిల్లడి నెత్తురు వర్రయి పోతుందే!

ఆ చిక్కుసమయంలో నాగడి కెలా తోచిందో! "ఒరేవ్" అని కేకశాడు. వాడికాళ్ళదగ్గరగానే వుంది ఆదాకా నడిచి నడిచి వున్నవాడి పెళ్ళాం. ఆ ఆడమనిషి ఏమన్నా "నివ్వే నంబ్రో!" అంది. "అవును నేను" అన్నాడు నాగడు.

ఇద్దరూకూడా ఒక్కమాటు పైచీకు ఆకాశం కేసి చూచారు. "నిన్న సాయంకాలం లంకమీద మనం వున్నప్పటి ఆకాశానికి ఇప్పటి ఆకాశానికీ ఎంత తేడా వుందో చూశావంట్రా?" అంది పిల్ల. నాగడు "దీని ముండామోపిన వరద!" అన్నాడు.

"ఇంకిప్పు డీచీకట్లో ఎక్కడికిపోతాం?" అంది పిల్ల. నాగడు "ఎక్కడికి పోతాం?" అన్నాడు.

ఇద్దరూ అలా కూలబడ్డారు గట్టుమీద. నాగడు అడిగేడు "ఒరేవ్!

నీవు ఇవ్వాళ్ళనుంచీ చేప లమ్మిన రూపాయలు లంకమీద ఏదరిని కప్పెట్టావే!" అని. పిల్ల అంది "ఆవరినే గుడిసెలో ఉత్తరదెస కనిపించదే" అని. "కనిపించడానికేం లే. అవి మోగించిన పెద్దరాయే కొట్టుకుపోయి నప్పుడు అవి ఉంటాయా వెర్రిదానా!" అన్నాడు నాగడు. అంటూ ప్రేమ కొద్దీ పెళ్ళాం శరీరాన్ని తడుముతూ "నీ కాలివేళ్ళను మట్టె లున్నాయా!" అన్నాడు. "ఆ" అంది పిల్ల.

"అయితే నడిచిపోదాం! లే! మనవూరు! నీ మట్టెలచప్పుడికి పురుగు పుట్రా వుంటే తప్పుకుపోతాయి. భయం లేదు" అన్నాడు నాగడు. ఇద్దరూ లేచి నడుస్తూ వున్నారు. పిల్లవి మట్టెలచప్పుడు అవుతూ వుంటే నాగడింకా అంటాడు, "ఇల్లాంటి చప్పుడేనే పొద్దుగూకా నే నీపొద్దు గోదారిమీద వచ్చిపోతేనం పోయ్యాప్రాణంగా ఈత్తూ వున్నంతసేపూ విన్నాది! ఈ మట్టెలచప్పుడే నే నీమట్టెలచప్పుడే నే!"

ఆలా అంటున్న నాగడికి ముందు నడుస్తూ పైయ్యానుకు జవాబుగా పిల్ల అంది: "మరీపొద్దల్లా నీకోసమె ఈగట్టుమీద నడిచిందెవ రనుకుంటున్నావు? నేనే ఈమట్టెల్లో, మట్టెలో నేనే! నేనే!"

# ఎండమావులు

శ్రీ వెంపటి నాగభూషణం

కుహూ...కుహూ...కు...హూ

— కలకంఠ వధూకలకంఠ రవానుకారి ... కాకలీధ్వని ... ఆ సుషుప్తి ముద్రాలంకారమూర్తిని... ఉహుఁ కదప లేదు.

ఓ... మదవతీ నవమన్మథ మోహనరూపా!...సంతత రసానంద పారవశ్యత కేళీలోలా! ...

—అలా... ప్రబంధకవుల రచనాచమత్కృతులను ... తాత్కాలికంగా ఉపసంహరించి, ... మృదుమధుర కంఠంతో, ... కొంచెం అధునాతన భావకవిత్వపు మజాతో ... ప్రబోధించే సరికి:

నాయిక పుణ్యఫలం ... స్వల్పంగా ఫలించి, ఆతడు ... కొంచెం అటు నిటు మసలి...

—తిరిగి నిద్దురలో కలిసి మెలిసిపోయి...

ఇక ... మామూలు మేలుకొలుపులతో ప్రయోజనం లేదని,... పాన్పును దరియబోయి, పిలుక్కు చతుష్కాని పక్కకు తొలగించి, స్వీయ బాహువల్లరీ కళలవ్యాపార పారీణతను ... అతనికి చవి చూపి ఒకవైపునుంచి ఒక వైపుకు ఊగించి ... రెండు చెంపలమీదను, నెన్నొసటను చుంబనాలంకారములను...తోరహత్తుగా ప్రసాదించ:

ఆ ... రసికావతంసుడు ... తమాయించుకో లేక, జాగరణావస్థలోకి ట్రాన్స్‌ఫరు అయి, ... అర విచ్చిన కన్నుదోయితో,—తనమీదకు

ఓరగిలి, ... వైతాళిక విధిని నెరవేర్చి .. చిరునవ్వు చలువలు చిలుకరిస్తూన్న ... గృహిణిని విలోకించి...

అప్పటికి, పూర్తిగా సుస్తోత్థితుడై,... ఆమెను నయగారపు మాటలతో ఊరడిస్తూ, ... మెల్ల మెల్లగా ... ఆమె గండద్వితయముమీద లేగులాబీలను సృష్టించి, ... కోమలస్మితరుచులను తెలుపరిస్తూ, ... కొంచెం ధూకుడుగానే ... మంచం విడిచి...

...భర్త విధించినదే అయినా, తనకూ సరదా నిచ్చేపనే కాబట్టి, ... ఆ దైనందిన రసోపేత ధర్మ నిర్వాహణానంతరం ... ఆమె, ... ... శయ్యా మందిరం వీడి, ... వెళ్ళలేక, ... వెళ్ళ ... లేక ... వెళ్ళినా ...

అతడు మాత్రం ... అక్కడే, నిలువుటద్దం ముందు నిలువబడి, ...వన్నె చిన్నెలు మధురభావనలో స్మరించుకుని, ... కులాసాగా క్రాపింగ్ సవరించుకుని, రెండు ... మూడు ... మారులు ... ఆవులించి,———ఈలతో ...ఏదో ఆలపిస్తూ, ... ఈ జగతిలో వాడై పోయినాడు.

* *

కవి ననుకునేవాడు గనుక ... తత్కారణంగా విధివశు ... కాఫీగత ప్రాణి గనుక, ఆ భూలోక సుధను ... పూర్తిగా సేవించి రోజ్ వుడ్ మేజాముందు ... రాకింగ్ చైర్ లో సుఖాసీనుడై — శ్వేతకాష్ఠోద్భూత ధవళధూమరేఖా శిల్పాన్ని ... ఏకాగ్రతతో పరామర్శిస్తూ, ... భావజగతిని విహరించడానికి రెక్కలు విప్పుకొనబోతూ, ఏదో అనూహ్యపుటూహాంచలముల నొరసుకొంటూ ... మై మరచి, ఉపాసనశిఖరిని ... ఉండగా ...

“చూశారా ... ఎంత అన్యాయమో...!”

—అధిష్ఠించిన ఉన్నతశిఖరాల మీదకు ... ఆమె మాటలు వినబడక పోయినా, ... ఎదురుగా నిలిచిన ఆమెను...చూడనట్టుగా నటించలేక... కృషిచేసి అలవరచుకున్న ... కలల చూపులతో ...

"ఏమిటి..." అనే అర్థం...స్ఫురింపజేశాడు:

కిరణావళిని,...తూలుతూ... తొట్రుతూ... ఆమె అతని పరాకును మన్నించకుండానే...దగ్గరకు వచ్చి...చేతుల్లో ఉన్న "మాగజీన్"ను... పుటలు త్రిప్పుతూ...

"చూశారా...అన్యాయం..."— అని రెట్టించింది: తప్పనిసరిగా... అతడు, మొహం ఆమెవైపుకు త్రిప్పి:

"ఏం... "కిరణావళి"... వచ్చిందా?..." అన్నాడు.

"ఆఁ... వచ్చింది, ఏలాగైతేనేం. ఎందుకూ?... మీగీతాలుగాని,... కథ గాని అచ్చు పడలేదు..."

కలిగిన ఆశ్చర్యాన్ని...అంతగా పైకి కనబడనీకుండా... "మాగజీన్"ను అందుకుని,... అటు ఇటు త్రిప్పి చూచి. ఆమె అన్నది యథార్థమే నని రూఢి చేసుకుని...కొంచెం దిగులుతో మూగవోతగా

"ఏం...లాభం మళ్ళీ... పైకి అందరూ స్నేహితులే. ప్రతిమాలి... మరీ ప్రతిమాలి కాదూ... మీ రచనలను తీసుకు వెళ్ళారని... చెప్పారు మీరు?...మొదటి సంచికకదా... మీ కృతులకు గౌరవస్థాన మిచ్చి ప్రకటించకూడదూ... అంత మాత్రం..."

"...ఈమాత్రానికే..."— చిన్నబుచ్చుకున్నాడు...

"నేను... అనడంలేదు మీతో, ...అడపాదడపా... మీ సాహితీ కుసుమాలు... వట్టి... ఎండమావు అని..."

అతడు... తొణకలేదు...

పరస్పర సంవీక్షణదీక్షలో... అయిదు నిమిషములు:— ఆ క్రొత్తమాస పత్రికను...ఆమె గది మూలకు విసిరివేసి...ఇక అక్కడ ఒకక్షణమైనా... నిలువ లేదు:

అతడు,...అధూతమనస్కు – డైన అతడు...స్థాయి చిక్కించుకునే టందుకు...మరొక సిగరెట్ కన్యను చేరదీసి...భావసమాధి

* *

రాత్రి:

“చూశారా... ఎంత బాగున్నదో... శేఖర్...”

ఒయ్యారంగా...తూగుటుయ్యాలలో కూర్చుని...తమలపాకుల చిలకలు తయారుచేస్తోంది—కిటికీలోనుంచి... ఆకాశం మీద పేరుకుంటూన్న... మబ్బు దొంతరలను...చూస్తూ:

“చూశారండీ... మేఘమేదుర మంబరం?... మీరేకనుక ... నెమలి అయితే...పింఛం విప్పి నృత్యంచెయ్యక పోయూరా...ఏం...కాదూ?...

అతడికి వినపడ లేదు: వినిపించుకునే ధోరణిలో లేడు... తల వంచుకుని...అదే పనిగా అక్షరముల సహాయంతో... భావమణిమాలను పోహణిస్తున్నాడు:— సాహితీ సౌధ చంద్రశాలను...కవితావల్లకిని...ఇంద్రజాలి కాంగుళీయములతో...స్పృశించి... కవితాయోగమున... సాయుజ్యము నందుతూన్న... అరసతృప్తాళువును...మేనక అంతటి వన్నెలాడిమాడా... ఆ సమయంలో... భంగపా టొనర్చలేక... మరలిపోయేది...

మెరుపులు... వెను వెంటనే...ఉరుములు... పిడుగులు...— ఫెళఫెళా ...తపతపా...ఆకాశం చిల్లిపడినట్టుగా...ఎడా తెరిపీ లేకుండా...చినుకులు హోరున పెనుగాలి...

ఆ...జవరాలు, పూర్తిగా తెచ్చిపోయి...ఇక ఎదలోపలి తల పొవలేక...లేచి వెళ్ళి...కిటికీ తలుపులు బంధించి...అతడు కూర్చున్న కుర్చీ చేరి పైన వ్రాలి...

అతడు... చూడడు:

అతొ ... ఆగలేకపోయింది. దఖాలున ... అతని ముఖాన్ని వక్షోవ క్షోంకాణక్రిమంలో ...

"ఏమండీ, పైకి పోదాం. రారూ! పొద్దు పోయింది ... అతడు... తప్పించుకోడానికి ప్రయత్నించాడు ... ప్రత్యుత్తర మీయకుండానే. ఆమె ... వెనకేసుకో బోయింది: కాని ... అతడే గెలిచాడు. పట్టు విడిపించుకుని ... తిరిగీ వ్రాతలోకి దిగాడు......

ఆమెకు ... ఆగ్రహం వచ్చింది: కాని ... అనునయాలాపాలతో ... కార్యం సాగించుకోవా లని:

"నిద్దర .. వస్తోందండీ: రారూ..."

—రాననే సూచనగా ... అతను తల త్రిప్పాడు.

"అయితే ... స్విచ్ నొక్కి ... లైట్ ఆర్పివేస్తాను..."

"మారాం చేయక ... వెళ్ళి పడుకో..."

"ఒంటరిగా నేనా?..."

"ఊఁ ... ..."

ఆమె ... ఆపాదమస్తకము శోధించి ... తన ఎత్తు సాగలేదు గదా అని నిస్పృహ చెంది ... ప్రయోజనం లేదని నిర్ధారణ చేసుకుని ... అతన్ని వదలి వెళ్ళలేక ... వెళ్ళలేక ... వెళ్ళి ... పో ... యిం ... ది.

——చలించకుండా ... వ్రాస్తూనే ఉన్నాడు: కవి ... కథకుడు ... విమర్శకుడు — అయిన అతని ఆదర్శములు ... ఆలోచనలు ... పోకడలు ... ఇతరులకు అంతగా ... సులభ గ్రాహ్యములు కావు:

...బాహ్యాంతర ప్రవృత్తులలో ... నిబిడీకృతమై ఉన్న ... విశిష్ట సౌందర్యాన్ని అభివర్ణించి... తెనుగుతీగలు తీయ తియ్యములను పొంది... పూచి, పరిమళించేటట్టుగా దోహదం చేసి, —

... ఆత్మసాక్షాత్కారం కోసం ... ఏకాంతవరణ జన్యములే అయిన ... సౌందర్య రసానందములతో అక్షినిమీలన కేళి సాగిస్తూ ... ఆనందగీతమును పాడుతూ ... ఆనందసూత్రమును అల్లుతూ ... ఆనందమూర్తిని చిత్రిస్తూ: ... తా నొక అక్షరరమ్య శిల్పిగా ... భావుకుడుగా ...

అదే అతని ఆశయము. ఏది ఎటులైనను ... ఎటు పోయినను ... సరే. తన కోర్కెలు ... తన పద్ధతులు ... సమకాలీనుల సమాదరణకు పాత్రము కాకపోయినప్పటికీ ... ఆతనికి ... అలమట లేదు. ... కాని, ... ఏమో? ... మానవత్వము అంత పూర్తిగా మరుగుపడి పోతుందా? ...

* *

టీ—సిప్ చేస్తున్నారు. ... ఎదురెదురుగా కూర్చుని:

అతడే ... ముందు పలుకరించాడు:

"మరి...?"

"ఊఁ..."

"పై శుక్రవారమే ... కాదూ"

"ఏమిటి...?"

"నీ పుట్టిన రోజు"

"ఏమో...ఎప్పుడు అయితే ఏం?..."

"అబ్బ...ఎప్పుడూ...అలుకేనా...?"

"తమరు చేసేవి...అలా ఉన్నవి..."

ఠంగున గంతువేసి...లేచి, ఆమెను చేతుల్లోకి తీసుకున్నాడు...

అబ్బ...ఉండండి...నొక్కుకుంటోంది...లోలాకు..."

"ఊహుఁ...చెప్పదలచుకున్నది...చెప్పి గాని..."

"చెప్పండి...మరి..."

"నీ...పుట్టినరోజుకు...ప్రెజెంటు..."

"మీ...యిష్టం..."

"శర్మచేత...నీ బొమ్మ పెద్దదిగా గీయించి..."

"అవును,...అలా చెప్పడం...ఎన్నోమారో..."

"ఈమారు...తప్పదు. అతనికి కబురంపుతాను ... సామగ్రితో సహా

కమ్మని...ఇంకో పదిహేను రోజు లున్నది:—చక్కగా, శుక్రవారం నాటికి తయారు అవుతుంది..."

"...చూస్తానుగా..."

"మరి...మరి...నాకేమి...ఇస్తావు..."

"ఎందుకూ... రెట్టించడం? నేను ఇస్తా ననేది... ఏమీ మీకు పనికి రావుగా..."

అలా...జరిగేది...అప్పు డప్పుడేగా..."

"మీరు...వ్రాతలో...భవిష్యద్భావ స్వప్నానంద పిపాసలో...మగ్నులై ఉన్నప్పుడు..."

"అది... నిజం. అలాంటి అమృత ముహూర్తాలలో... చతుర్ముఖుడు వచ్చి...చెంత నిలబడినా...చలించను..."

"ఊహుఁ అదీగాప్పే. అవు నవును...ఎవరి పిచ్చి...ఎందుకో...ఆ వ్రాతలన్నీ పట్టుమని పది అయినా...ప్రపంచం ముఖాన్ని చూడలేదు..."

"అలాటి...కీర్తికాంక్ష నాకు ఉంటేగా..."

"పోనీ, వాటిని ... ఆదరించినవాళ్ళు ... ఎవ రైనా ఉన్నారా ... చెప్పండి..."

"ఇతరులు ... మెచ్చుకోవా లని కాదు ... నేను రచయితను ... అయినది..."

"ఈ దంభవామనము కేం? ... తగినంతగా... పేరు ప్రఖ్యాతులు రాలేదని...మీరు అనుభవించే... వ్యథాభిన్నత...మీ చూపుల్లో...నాకు కనపడ దనుకున్నారా...అప్పు డప్పుడు..."

'...పొరపాటు... నాసాహితీశ్రమ అంతా ... కేవలం... ఆత్మానందం కోసం...'

"అందుకు...అయితే...ఇది ఒకటేనా మార్గం..."

"ఎవరి... రససిద్ధి వారిది..."

"ఊహుఁ... అరిదుగనే కావ్యాలు ...... కథలలోను, ఖండ కావ్యాల లోను... నిరాటంకంగా ... చక్కని చుక్కలతోను ... సాగను కోర్కెలతోను...సయ్యాట లాడుతూన్న మీరు...నాలోని రసికత్వానికి నిజంగా ఉండ లేక...జీవన మాధురీ రుచులను... దూరం చేసుకుని..."

అతడు... నొచ్చుకున్నాడు. ఆమె... అది, గమనించకూడా:

"అందుకనే...మన ఉభయుల పంథాలూ... భిన్నములవుతూన్న వని... సందేహం కలుగుతూ ఉన్నది: ముందు... ముందు... ఇంకా... మరీ, మరీ దూరం అయిపోతా మేమో!... అతనికి...ఏమీ తోచినది కాదు. లేని... చిరునవ్వును... తెచ్చిపెట్టుకుని... ఏదో...అనబోతుండగా:

బంయ్...బంయ్...బంయ్...

హారన్...వినబడ్డది. కారులో వచ్చిన మిత్రుణ్ణి...ఎదురుగా వెళ్ళి గౌరవించే...నెపంమీద...

ఆ నాటకం మానేసి... బయటకు వచ్చేశాడు......

* *

శుక్రవారం ... ...

పున్నమి వెన్నెల ... కళలు చిమ్ముతూన్నది: అతడు ... అస్వాభావికమైన అతిమత్తతతో, హుషార్‌తో ... అంగలో మెట్లన్నీ లంఘించి ... లోపలికి వచ్చి...స్టాండుమీద ఉత్తరీయాన్ని ఉచ్చువదలి... డ్రాయింగ్ రూమ్ తలుపును అరవిరియించడానికి ... తళతళలాడుతూన్న గుబ్బను తిప్పి ... నెట్టబోతూ ...

మాటలు వింతగా వినబడగా ... అలకిస్తూ ... అనుకోకుండానే అని ... చప్పుడు కానీయకుండా, బెట్టును మెల్లిగా వదలి ... అడుగులు తడబడి, నడి చేయకుండా, గోడకు భుజం ఆనించి .... ఉండిపోయినాడు:

"ఏమండీ ... మీ ... నేర్పు .... నాకు ... చేతనవుతుందా ... ఏమో ... అంతభాగ్యమూ ... రసికజీవులు ... ధన్యులు ... మిమ్ములను

... ఎడబాయకుండా ... శాంత ఉండడానికి ... నోచుకున్నవారు ... నావంటివానికి ... మతం ... ఇద్దరం ..."

——విన్నంతవరకూ ... చాలదూ? ... ఆశాసౌధము లన్నీ ... గిరగిర తిరిగి ... నేలలో కలిసిపోయినవి, — ఇంకా ... సందేహమా? ... అయినా ...

చీమ చిటుకు మన్నంతయినా ధ్వని కానీయకుండా... తలుపు తీసి, చూడ లేక... చూడలేక చూసి...అర్థం కాక... తన కళ్ళను ఒకపట్టున నమ్మలేక...పోయినాడు:

ఎదురుగా...సోఫాలో... ఒకరిమీద... ఒకరు తూలి... ఆమె ... చిత్రకారుడు:

వెనుకవైపుగా ఉండటంచేత...అతని రాక వారికి...పొడకట్టలేదు.

కృత్రిమ తన్మయత్వం... దర్పణంలో ప్రతిఫలించిన... యజమాని దీన మూర్తిని...కనబడనీయలేదు. ఐనా...లక్ష్యం చేసే...స్థితిలో ఉన్నారా...

—అలా...అలా...జారుతూ... వళ్ళు తప్పి...నిరీహతో కూలిపోయి నాడు—... ఎండమావులను... దివ్యోదపూరము లని... అత్యాశతో... డాయబోయి...పోయి... చివరకు... హతాశుడైన... పాంధునిలాగు...

౧౯౩౬

# కామకోటి

## శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి

సూచయంతి సుందరి...తవ...సూచయంతి సుందరి! కుసుమాయుధ శాస్త్ర పండితమ్...రమణమ్...'

...కోపం తల మునకలుగా...సంస్కృత గ్రంథాలన్నిటికీ...మనుక భోజరాజు చరక సుశ్రుతాదులకు తలపెట్టిన సత్కారం చేయాలని... లోకాన్నంతా...

ఓఁ...నిలువలేనంత చిరాకు వస్తున్నది.

అప్పటికి నాలుగురోజుల నుంచీ ప్రయత్నం చేస్తున్నాను...మరిచిపోదామని: కాని, మేలుకున్నా కలువరింపు మానేశాపాయం తోచడంలేదు. ఆ పద్యార్థం లాపాలాగా...పట్టుకు వదలకుండా ఉన్నది.

మొదట...తమాషాగా...ముచ్చటపడి నవ్వుకున్నాను: తరువాత, కొంచెం చిరాకు తెచ్చుకున్నాను: ఇప్పుడు...గింజుకుంటున్నాను; ఊహుఁ...ఏ సుముహూర్తమున నన్ను వరించిందో...ఏమో...వెన్నెల వచ్చింది.

క్లబ్బునుంచి అప్పుడే యింటికి వస్తున్నాను: గుమ్మానికి పెడల్ డీకొట్టకుండా, కాలితో ఆదుకుని, సీటు దిగకుండా...పని అయిపోయినా... చిగురుదమ్ముల పస తెలిసిన రసికుణ్ణి గనుక పెదవులకు అంటే చురుకును సహించుకుంటూ, శేషమాపలేశమైన సిగరెట్-కన్యను బలవంతాన మరో రెండు వలపులు వలచి...మేనకకు ఉద్వాసన చెప్పి తప్పించుకున్న గాధేయుడి దర్జాతో లోపల ప్రవేశించాను.

కోటు కుర్చీమీదకు...విప్పుకునేటట్టు: విసిరివేసి, రేకెట్ ప్రెస్‌లో అమర్చి

కూర్చుని ఘూతీసివేస్తూ...పరధ్యానంగా...తన నూచయంతి...సుందరి...

'నాయనా!'

...మెలకువ వచ్చినట్టయింది: మనస్సు చేస్తూన్న మోసం తెలిసిపోయింది. కాని...కనబడని వస్తువుమీద, పగ ఎలా సాధించడం? నిలుచీ...ధూతుడుగా...ఏ పాపమున్నూ ఎరుగక, నా పాదములే నమ్ముకొని ఉన్న...షూజ్ ను...తన్నేశాను, తల ఎత్తి చూశాను.

జాలిగా, దీనంగా, కన్నీళ్ళతో, నా పలుకరింపుకు ఎదురుచూస్తూ... అమ్మమ్మ!

కలకల లాడుతూ...ఎప్పుడూ సిరి ఓడిపోతూండే పండుముత్తయిదువ అలా ఉండటానికి...కారణం?

'ఏం...ఏమిటి' అని గాభరా పడుతూ అడిగాను; ఆమె, మాటాడలేదు. కళ్ళ వెంట మరీ, జల జలా...

'ఏం...ఏమిటి మాటాడవేం? కొట్టించాను. సంగతి ఏమిటో అర్థం కాదు. నాకు మనసు నిలవడం లేదు.

'తాతయ్య ఏడీ?'

అడగడం వ్యవధానంగా...నానోటివెంట ఆ రెండుముక్కలూ వస్తూండగానే...అమ్మమ్మ శ్రుతి ఎక్కించింది; నాకు మరి సాపుగా పోయింది.

ఆమె ముందూ, అనుసరించి నేనూ అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి వెళ్ళాము. చుట్టతిరగకుండా, మడి వసారా తలుపు తీసుకుని... తులసికోట వక్కనుంచి, తోటలోకి వెళ్ళేసరికి...

చూసే చూడటంతోనే, నవ్వు పట్టలేక పోయినాను. తాతయ్య, మామిడి తిన్నెమీద పద్మాసనం వేసుకుని, చిత్రాసనంమీద కూర్చుని, చిన్ముద్రిలు ఇవ్యావ పవ్యములు చేసుకుంటూ...దృష్టిని ఊర్ధ్వాభి ముఖం చేసి, భ్రూమధ్యాన నిలుపుకోవడానికి యత్నం చేస్తూ...అచల సమాధిలోకి వెళ్ళిపోయే హంగామాతో ఉన్నాడు.

...ఉద్దండుడు, యేదో పథకం పన్నుతున్నాడు; అలా కాకపోతే... ఏమిటి యీ చోద్యం? మదన సామ్రాజ్యానికి యావత్తూ ప్రధాన అమాత్య హోదాలోవాడే...వర్షీయసి ముక్తికాంత ఉపగూహనం కోసం, రాచ కార్యాలు కట్టి బెట్టుకుని కూర్చోగల తీరిక ఉన్నదా? వేదాంతమా అంటే, ఛాందోగ్యం పాఠం చెపుతూ, దహరాకాశాన పరమాత్మకు ఉనికి ఉన్నా, మానినా, ప్రణయజ్యోత్స్నలు అక్కడ వాలలాడి పోతూండ వలసినదే నని...పంతానికి సాధించిన భావకుడే!...మరి ఏమిటి ఈ వాలకం?

ఇక ఆలోచించకుండా ఆయన కొంటెతనానికి పైఎత్తుగా, సాగిలపడి ప్రొక్కి, లేచి; పేంట్సుమీద మోకాళ్ళకు అంటిన మన్ను దులుపుకుంటూ, చేసిన ఘనకార్యానికి అభినందనా లేమైనా తగులుతాయేమో నని... అమ్మమ్మవంక చూశాను.

...లాభించ లేదు: పైగా, ఆమెకు అల్లరి అర్థం కాకపోవడం అటుం దగా 'నీవూ మీ తాత గారు చేసిన పనికి హర్షిస్తూన్నావా' అనే అర్థపు చూపు పెట్టి...మన్యువేగం నిలవదీసుకుంటూ...

'ఇదీ వరుస, నాయనా' సంధ్యపడక ముందునుంచీ; ఎన్నో విధాల బతి మాలాను. కాళ్లు పట్టుకున్నాను, నెత్తీ నోరూ కొట్టుకుని 'ఇది మీకు తగదు' అని మొరపెట్టాను. నీవుకూడా చెప్పిచూడు; అప్పటికీ ఆయన మనసు మారవట్టారయినా, నన్ను భరించడానికి ఆ గంగాభవానే ఉంది! ఇంత కాలానికి...ఇన్నో వడిలో...నన్ను విడిచేసి—సన్యసించుతారా?

నేను, ఆమె మాటకు అడ్డం వెళ్ళి.—

'ఇప్పుడు ఆనంగతేం వచ్చిందీ? నీ మీద కోపంగా ఉన్నాడా?' అన్నాను.

ఆ మాట అడగగానే, వాళ్ళ సంసారిక ప్రణయాన్ని అవమానించా నని, రోషం వచ్చి, ఆమె చూపు చురచుర లాడింది–ఆ పుణ్యదంపతుల విష యంలో అలాంటిది అసంభవం అని తెలుసును. కాని, కేవలం మాటవరస

కవి అని... చేసినతప్పు దిద్దుకుంటూ,

'ఏం జరిగిందో చెప్పు; నాకు తెలియదు కాదూ!' అని సానునయంగా అడిగాను.

'అకారణంగా, ఉన్నవారు ఉన్నట్టుగా...సన్యసించితే మేలు' అని అనుకుంటూ, లేచివచ్చి ఇక్కడకూర్చున్నారు. మాటా మంతీ లేదు; ఉలకరు...పలకరు. కోప మేమో ననుకుందామా...ఆ మహారాజు ఎన్న డన్నా పల్లెత్తి ఒకమాట అనడం విన్నావా?"

ఒక మా టేమిటి? నిమిషానికి లక్షమాట అంటూండటం ఎరగనా? తాతయ్య తన రసికత్వ మంతా, నా మీదనే వదును చేస్తూంటూ డాయెను! ...ఈ ధోరణిలో ... ఆమె దిగులు మరపించడానికి విసిరి చూశాను- పని చేయలేదు.

'వాటి కేం లేస్తూ ... ఇప్పుడు ఏమిటి చేయడం?'

'ఏమీ చేయకుండా, చూస్తూ ఊరుకోవడం.'

'ఏమీ చేయక...'

'స్వాములారీ' లోకి ఇంకా పూర్ణంగా దిగనీ. అప్పుడు సుష్టుగా భిక్ష పెడ్దాం. అందాకా ఏమీ తొందర లేదు. మనం, ఒకవేళ ఈ లోపల ఏ మన్నా చేద్దామన్నా ఆయ నేం ఊరుకునే రకమా?

ఈ దఫాతో, నే నేమీ; అర్చ్భవాడినీ, తీర్చ్భవాడినీ కా నని ఆమెకు తెలిసిపోయింది. ఇక నా మాటలు వినిపించుకోకుండా పునః లిన్నెను అనుకుని కూర్చుని ఆయన బొజ్జపెట్టు దగ్గరగా తల ఓరగిల వేసి విలపించటం మొదలు పెట్టింది.

"భిక్కానీ!"

...వకవకలాడే సింహం, గుహా ముఖమున గర్జించే దమ్ములో, తాతయ్య భావమూర్తి ధ్వనించింది. నేను ఫక్కు మన్నాను. ఏం ప్రభూ! బొద్దం లోకి మార్చాడే బాణీ ... అదు గదీ ఇప్పుడూ అసలు రంగంలోకి

దిగుతున్నాడు. ఆశ్రమ స్వీకారానికైనా... ఆడు బాహుళ్యం ఉన్న సత్త్ర పాయం ఏరుకున్నాడు.

—అమ్మమ్మ ఆ మాట ఏదో తిట్టు అనుకుని, ఉలికిపడి, తెల్లమొగం వేసి ... లేచి దూరానికి తప్పుకున్నది. స్వాములు కళ్ళు...రెప్ప లల్లార్చి... తెరిచారు:

జయము శ్రమణ భదంత కామాయనులకు! అని నేను ప్రత్యుద్ధాన స్వస్తి వాచక మాడాను.

తాతగారు, విజృంభించి...ఒళ్లు మలుపులుసర్ది విరుచుకుంటూ,

"అయితే మన కేంలే! అగ్ని పేటిక, మిగతా సరంజామా, ఇలా రవాణా చెయ్యి. సన్యసిద్దా మనుకున్నాను కాని, ఉన్న హాయి ఊరికే పారవేయటం ఎందుకూ?... నేను తప్ప తట్టుకునే సాధువు లేడాయెను. ఈయింట్లో ...రేపు పాగోలు సరుకు ఊళ్ళో దిగితే బాగుండును.' అన్నాడు.

'మరి నీ సన్యాసం!'

తాతయ్య, మాటమెలకువ అర్థం చేసుకోలేని అమాయికతనం చూపులో తొణికించి...నాకు విప్పి చెప్పుతున్నట్టుగా...

'గీర్వాణం వెలిగించా నయ్యా! ఈ పొగాకు సరిగా లేదు, మానివేద్దా మనుకున్నాను...అది స్వగతంగా...అర్ధోక్తిలోనే...అసలు మనసు దాటి రానీయకుండా ఉండవలె నన్నే, మాటే మరచిపోయినాను. సంకల్పం పవిత్రమైనది గనుక, కూతురు ఎందుకని తల్లినే ఆశ్రయించాను!...తల దిమ్ము...తిక్క...తీరేందుకు తరుచ్ఛాయ...

"అందుకూ మాగృహిణికి యింత అలుక" కని తీర్చుకున్నానుగా. 'భిక్షుకి' అని తిట్టి. ఏం అపానా? ఇంటావిడా?

"ఇంకో విషయం...విశేషం ఉందోయ్...వేళకు, సరిగ్గా అన్నీ అల్లా జరిపోయినాయి చూడు...నీవు, సంఘం...సరే, ఈ ఆరామం మరి ఎక్కడో!—

నేనూ నాతోబాటు అమ్మమ్మా తాతయ్యా శ్రుతి అందిపుచ్చుకుని... నవ్వాము.

పాపం! హడలి పోయిం దయ్యా!

అలా కాదు: మాట దక్కించింది. మా అమ్మమ్మ, విరహవేదన ఎంత మహాగా అభినయించేదనుకున్నావు...పడుచుదనంలో! ఒకమారు చూద్దామని ముచ్చట వేసింది. ఫరవా లేదు. వెనుకటి బింకం ఏలా వస్తుంది కాని!... నేను మాత్రం...ఇప్పుడు నిత్యం...భోజనానంతరం, రాత్రులు...మహాభి నిష్క్రమణం చేస్తున్నా నా ఏం...ఉద్దీపన లేంది వీణ మోగదు.

ఎంత నాటకం ఆడావూ!

అవును బాబూ...మా ముసలి ముచ్చట్లు మేమే తీర్చుకోవాలి కాని... ఎవరు ఆదుకుంటారు?...

...వాక్ప్రవాహానికి, చప్పున అడ్డుకట్ట వేసి...తాతయ్య...చెవులు దోర పెట్టుకుని...వింటున్నాడు...కారుమబ్బులు దూసుకుని...ఫెళ్ళున వెలిగే చందమామ లాగా...ఆయన ముఖం 'కళకళలాడి' పోయింది...అంటించ బోతూన్న చుట్టను...తీసి, చేత పుచ్చుకుని...అతి హుషారుగా...లేచి నిలు చున్నాడు. నేనూ...సిగరెట్...ఆ పరిస్థితిలో అంటించడమా మానడమా అనే విచికిత్సలో పడిపోయినాను...తాతయ్య...ఇంత హంగమా చేసిన తరువాత...కొంచెం తెప్పరిల్లేదాకా...ఆయనను అక్కడనుంచి కదల నియ్య దలచుకోలేదు...వదల దలచుకో లేదు.

కూర్చో...

వీలులేదు...శివాజ్ఞ అయింది: వలచని పద్మినులను తలచే...సుకుమార రసికులు అయినను...మీ సజ్జ అంతా...నీవు తీరామిగా...కూర్చుని... కాల్చుకో...పొగలతీగలలోనే ... మీకు ...'ప్రియురాలి వగ' అన్నీ కను పిస్తవి...హుం...అంత తీరుబడి మా పడుచుదనంలో కూడా లేదుగా

లేదు సుమా?...ఎందుకు...చెవులూ, కన్నులూ కలిగినలాభం ఇంకా వినిపించడం లేదూ?

ఒకరిని మించాలని ఒకరము ... పందెం వేసుకున్నట్లుగా ... అంగలతో దూకుతూ...వాకిటిలోకి వచ్చాము...అమమ్మ మాటే మరచిపోయి.

ఇంటిముందర పెళ్ళివారు ఎవరో, ఊరేగుతూ ఆగారు. మేళంలో... వచ్చునీలు( వ్రాణీ చేసుకున్న ఓ పిల్ల...

రమ్మనే! మహారాజుగ..., అనేపదం పల్లవి ఎత్తుకుని అభినయిస్తోన్నది.

౧౯౩౪

# నిరీక్షణ

## శ్రీ సురవరం ప్రతాప రెడ్డి

"శంకరన్! దినమూ సూర్యుడు తూర్పుసముద్రమునుంచి పైకి లేచి మళ్ళీ పడమటి సముద్రములో మునుగుతూ వుంటాడు. రాత్రంతా యెక్కడ వుంటాడు? మళ్ళీ తెల్లవారేసరకు తూర్పు కెట్లా వస్తాడు?"

"కుమారీ! అది అనాదినియమం. ప్రతివస్తువుకూ ఉదయం అస్తమయం ఉన్నది అస్తమించే వస్తువు మళ్ళీ ఉదయిస్తుంది. మన యీవూర్లో తూర్పు పడమటిసముద్రాలు కలుస్తవి. అందుచేత సముద్రంలోనే పుట్టి సముద్రంలోనే మునిగినట్లు కనబడుతుంది"

"అయితే వేరేదేశాల్లో ఎట్లా వుంటుంది?

"ఈఅందం అక్కడ లేదు. ఉత్తరానికి పొయ్యే కొద్దీ భూమిలో మునిగి, భూమిలోనుండి పైకి వచ్చేటట్లు కనబడుతాడు"

"ఆ అలలు చూస్తివా? యెట్లా వొకటిమీద వొకటి పడుతున్నాయో! ఎప్పుడూ వాటికి విరామం లేదా?"

"అఖండప్రేమ అంటే అట్లే వుంటుంది... ఈముచ్చట్లకేమి గాని యింక కొంచెం సేపట్లో సూర్యుడు మునుగుతాడు మనము దినములాగా యిక్కడ నుండి సముద్రం అందువరకు దొర్లుదాము, రా"

"ఊహూం దినమూ నేనే ముందు దొర్లాలేమి? చూడు, ఎంతయెత్తు నుండి దొర్లుతామో? ౪౦ అడుగుల ఎత్తయినా వుంటుంది యీయిసుక దిబ్బ!

"నీవే ముందు దొర్లవాలె."

"లేదు. నీవే"

"సరే, రా!"

శంకరన్ ముందు ఆపేటవాలు సముద్రతీరం యిసుకదిబ్బమీద అడ్డము పండుకొని పల్టీలు కొడ్తూ క్రిందికి దొర్లినాడు. కుమారి వానివెనుకాలనే దొర్లింది. శంకరన్‌మీద కుమారి పడింది. కిలకిలా నవ్వుతూ ఇసుకంతా దులుపుకొని చేతులు చేతులు పట్టుకొని మళ్ళీ పైకెగబాకినారు. ఇట్లా ఎన్నోమారులు దొర్లినారు. ఇంతలో ప్రొద్దు మునిగింది. ఇద్దరూ వళ్ళొక్కరు రాచుకుంటూ యింటిదారి పట్టినారు.

శంకరన్ తల్లిదండ్రులు చిన్నప్పుడే చనిపోయినారు. తనమేనమామ యింట్లో పెరుగుతున్నాడు. ఇప్పటికి వయస్సు ౧౫ వుంటుంది. మంచి సుపురద్రూపి. సాధారణంగా తిరువాన్కూరు దేశస్థులంటే నల్లగా వుంటారు. కాని శంకరన్ గోధుమవర్ణమువాడు. దినమూ ఆకన్యాకుమారి తీరమువద్ద సముద్రములో తనమేనమామ వెంటపోయి చేపలు పట్టుక వచ్చేవాడు. కుమారి తలిదండ్రుల కొకేకూతురు. వయసులో చిన్నదైనా చేపలకూర, అరటికూర, పనసకూర, అన్నము, సాంబారు బాగా వండగలదు. మంచి అందమైనపిల్ల. కొస్త నల్లనిదైనా ముక్కుమొగమూ తీరూ చూచిన చాలా ఆకర్షణీయముగా కనపడేది. కొబ్బరినూనెతో నిగనిగమనే వెంట్రుకలు అప్పుడే బారెడేసి పెరిగినవి. నల్లని పెద్దకండ్లతో నవ్వింది దంటే శంకరంహృదయంలో మెరుపు మెరసినట్లా వుండేది. పెదవి తెరచి మాట్లాడిం దంటే ఏక్తారా విన్నట్లు వినేవాడు. బయలులో తిరిగి గారాబముగా పెరిగినపిల్ల కావడంచేత అంగసౌష్టవం బాగా వ్యక్తం అవుతూ వుండేది. తనమేనమామకూతురు అవడంచేత శంకరన్‌కే అపిల్ల నిస్తారని అందరూ అనుకునేవారు. కాని వీరికా పెండ్లిండ్లముచ్చట యేమిన్నీ తెలియదు. అన్యోన్యప్రేమ దినదినమూ పెరుగుతూ వుంది. దినము సాయం

కాలమూ తప్పకుండా సముద్రతీరముపైన ఆయేటవాలు యిసుకదిబ్బల మీద ఆడుకునేవారు.

*   +

ఇట్లా కొన్ని సంవత్సరాలు గడచినవి. శంకరన్ ఇరువదియేండ్లవా డైనాడు. కుమారి ౧౭ యేండ్ల దైంది. ఈనవయవ్వనంలో కుమారి సంపూర్ణ వికాసమునకు వచ్చింది. ఆగులాబి రేకులవంటి పెదవులు, ఆనల్ల పెద్దకన్నులు ఆచూపులలో గాఢ మైనప్రేమ, ఆ కిలకిలనవ్వులలో వెన్నెలకేట, ఆ మాటలలో అమాయకత్వము, ఆగంభీర మైననడక, ఆముందరికొప్పు, ఆపొంక మైనవక్షస్థలము శంకరన్ మనసులో గాఢముగ నాటుకొనిపోయినవి. ఆకాలంలో మళయాళస్త్రీలకు ఎదలపైన రవికలు గాని, కొంగు గాని లేకుండేవి. అందుచేత కుమారిసౌందర్యం మరీ ఆకర్షణీయమై, లోభనీయమై వుండేది. ఇట్లు వీ రిరువురు పెరిగినా, తాము దినమూ ఆడుకునేఆటలు మానలేదు. ఆదిబ్బలపైన జారి తనమీద కుమారి పడినప్పుడు శంకరన్ తననే కాదు, ప్రపంచాన్నే మరచిపొయ్యేవాడు. ఆపడుచు చేయి పట్టుకొని రాత్రిలో ఇంటికిపోతూ వుంటే శరీర మంతా గగుర్పొడిచేది. కుమారికూడా శంకరన్ తొడపై తలపెట్టి పండువెన్నెల్లో పండుకున్నప్పుడు, తన ప్రియుడు ఆకథా యీకథా చెప్పుతూ యేదో మిష పెట్టుకొని వంగి ముద్దు పెట్టుకున్నప్పుడు తనశరీరములో రక్తము మహావేగంగా, ఉష్ణంగా ప్రవహించుతూ వుండేది. చెక్కిళ్ళపైన కాంతి రెండింత లయ్యేది. ఊర్లో అమ్మలక్కలు వీ రిద్దరి యీడూ జోడూ చూచి, వీరి అమాయికపు ఆటలుపాటలు చూచి చాలా ముచ్చటపడుతూ పావురాళ్ళజతలాగా వున్నా రని అంటే యిద్దరూ ముసిముసినవ్వులు నవ్వుతూ వక రొకరిను వంకచూపుల్తో చూచుకునేవాండ్లు.

ఒకనాడు సాయంకాలము ఇంటికి వస్తూ వా రిద్దరూ యిట్లా మాట్లాడుకొంటూ పోయినారు.

‘‘కుమారీ, మూఁడు ఆదివారాలూ మనకు పెండ్లంటగానే అత్తవారింటి వాండ్లు పందిరి వేసి యిల్లంతా అలంకారం చేస్తున్నారు.’’

‘‘ఆసంగతి నాకూ తెలుసునులే!’’

‘‘మనము ఇంక ఆలుమగండ్లమైతే మనకు బ్రహ్మానందంగా వుంటుంది కదూ!’’

‘‘ఇప్పుడు లేదా? మన కెప్పుడూ నిత్యానందమే. మనము ఎప్పటిలాగే దినమూ ఆడుకుంటాముగా!’’

‘‘లేదు. ఇంక మనకు ఆట్లాడే అవకాశం వుండదు. మన మింక ఇంటి పను లన్నీ చక్కబెట్టుకుంటూ సంసారం చేయవలసింది. నేను దినమూ చేపలు పట్టుక వస్తాను. నీవు యింట్లో పను లన్నీ చక్కబెట్టూ మావారి తల్లిదండ్రులు సేవ చేయవలసి వుంటుంది.’’

‘‘అట్లైతే నీవు నన్నింక ప్రేమించవూ!’’

‘‘ప్రేమించనూ? యెవ రంటారు? నిన్ను పూలల్లో పెట్టి పూజిస్తాను. అందరిచేతా పూజ చేయిస్తాను.’’

‘‘ఏలా?’’

‘‘నేను పగలంతా చేపలు పట్టబోతాను. నీవు యింట్లో దంచీ, చెరిగి, వంట చేసి, యింటిపనులు చూసుకొని సాయంత్రమువరకూ సద్దీ, బుట్ట తీసికొని సముద్రతీరానికి రావూ!’’

‘‘తప్పకుండా, గంటముందే వచ్చి ఎదురు చూస్తూ కూర్చుంటాను.’’

‘‘మరి నేను పగ లంతా సముద్రంమీద వుంటే నీవు యింటిపనుల్లో నన్ను మరచిపోతావా?’’

‘‘ఎన్నటికీ మరవను అమ్మో! నిన్ను మరిస్తే ప్రపంచమే మరచినట్లు!’’

* *

శనివారము నాడు మధ్యాహ్నము భోంచేసుకొని కుమారిని వెంటబెట్టుకొని సముద్రతీరానికి శంకరన్ పోయినాడు.

"కుమారీ! కులాచారం ప్రకారం మన పెండ్లికోసం నేను ఒంటిగా పోయి ఒక చేప నైనా పట్టుకొని రావాలి. ఆ కొంతవని! గంటలో పట్టుకొని వస్తాను. రేపే మన పెండ్లి నీవు యింటివద్ద వుండు ఇప్పుడే వస్తాను, ఏమి?"

"గట్టిగా వస్తావా?"

"అందుకు సందేహ మేమిటి?"

"చేపల వేటలో నన్ను మరచిపోతావేమో!"

"లేదు. లేదు నీవే నన్ను మరచిపోతావేమో!"

"నీవు జల్దీ రాకుంటే, నేను నీతో యింక మాట్లాడను చూడు!"

"తప్పకుండా వస్తాను."

అంటూ శంకరన్ కుమారిని ముద్దులతో ముంచి చిక్కని బిగి కౌగిటిలో ఇరికించుకొని కొంతసేపు తన్మయుడై విడిపించుకొని గంతులు వేస్తూ తెప్ప యొక్క గబగబా నడుపుకుంటూ వెళ్ళినాడు. అతడు చూపు మేరనుండి అదృశ్యుడయ్యేవరకూ చూస్తూ కుమారి యింటివైపు తిన్నగా నడిచింది. గంట అయింది; రెండు, మూడు, నాలుగు గంటలైంది. సాయంత్రమైంది. చీకటి పడింది, శంకరన్ రాలేదు. వెన్నెల రాత్రి వచ్చాలేదు. ఈ వేళ చేపలు దొరకలేదేమో సగం రాత్రి కైనా వస్తాడులే' అని కుమారి తల్లిదండ్రు లన్నారు. కుమారిమాత్రము రాత్రి అన్నము తినలేదు, నిద్రపోలేదు; యింటి ముందర నే కూర్చుని సముద్రము దిక్కు చూస్తూ వున్నది. ఏమాత్రము చప్పు డైనా తన శంకరన్ వచ్చె నని ఆతము చూస్తూవున్నది. తెల్లవారే వరకూ ఒకటే నిరీక్షణ. కుమారి తల్లిదండ్రులు భయపడి పోయినారు. వెంటనే కుటుంబులను పదిమందిని జత చేసుకొని తెప్పలు వేసుకొని సముద్రము మీద ప్రయాణ మైనారు. పదిమంది పది దిక్కులా పోయినారు మధ్యాహ్నానికి అందరూ వాపసు వచ్చినారు. శంకరన్ చనిపోయినా డనే నిర్ణయించుకొన్నారు. కాని తెప్పనా నైనా కనపడవలసి వుండె. అదీ దొరకలేదు. వృద్ధులైన కుమారి తల్లిదండ్రులు కుమారిని పట్టుకొని గోడు

గోడున రేడ్చినారు. వచ్చిన చుట్టా లంతా అంగలార్చినారు. ఎవ్వరికి తోచినట్లు వాళ్ళు ఓదార్చినారు.

"యిద్దరికీ అన్న బలం లేదు. ఏమి చేస్తాము?"

"యిద్దరూ పార్వతీ పరమేశ్వరులలాగా ముచ్చటగా వుండేవారు. పాపం!"

"వారికి నౌసటిమీద వుండే ఆపెద్దముచ్చను చూచి ఎంత అదృష్టవంతు డమ్మా అనుకునే వాండ్లము!"

"ఎంత వినయవిధేయత లనుకొన్నారు!"

"శంకరన్ అంటే భోళాశంకరుడే నమ్మా!"

"ఇంత కెక్కడి శంకరన్! అయ్యో! కుమారీ! మీయిద్దరికీ యీనాటికి ఋణానుబంధము తెగిపోయె గదమ్మా!"

అని నానావిధాల యెవరికి తోచినట్లు వారు వాపోయినారు.

కాని కుమారి మాత్రం ఒక్క కన్నీటిచుక్క రాల్చలేదు. ఒకమాట అనలేదు. ఒకవిధమైన విషాదహాసముతో సముద్రందిక్కు చూస్తూవుంది. ఎవరు పిలిచినా పలుకదు, అన్నము తినదు, ఆ చూపులో ఏదో తెలియరాని కళ కనపడుతూ వుంది. వచ్చినబంధువు లంతా సాయంత్రంవరకూ ఎవరిదాట పట్టుకొని వారు పోయినారు.

అస్తమానం అయ్యేసమయంలో యింత చేపలకూర, ఇంత అన్నము, యింత పెరుగు, బుట్టలో తీసికొని కుమారి సముద్రతీరానికి పోయింది. ఎందుకమ్మా అంటే పలుకదు. తల్లిదండ్రులు అడ్డమువచ్చినా వినదు. శంకరన్ తనను విడిచి యిప్పుడే వస్తా నని చెప్పి కడసారి ముద్దుపెట్టుకొని సాగనంపుకొన్న చోటికే పోయి నిలుచున్నది. అక్కడే సముద్రం దిక్కు చూస్తూ నిలబడింది. తల్లిదండ్రులు ఏమి ప్రమాద మౌతుందో అని వెంటనే వున్నారు. చీకటి పడ్డతర్వాత ఎంతో ప్రయాసతో యింటికి తీసుక వచ్చినారు. ప్రతి దినమూ సాయంకాలము బుద్ది కట్టుకొని కుమారి సముద్రతీరానికి పోయి

తిరుగుతుండి, చీకటి పడిన వెంటనే తిరిగి యింటికి వచ్చేది.

"ఏమమ్మా! ఇంకెక్కడి శంకరన్! ఇంకా వస్తాడనుకున్నావా? ఎందుకీ వృథా శ్రమ?" అని తల్లిదండ్రులు కంట నీరు పెట్టుకొని అడిగితే-

"అమ్మా! నా ప్రియుడు, నా ప్రాణము, నా శంకరన్ తప్పక వస్తాడే! తప్పకుండా వస్తానని చేయిలో చేయి వేసి పోయినాడు!" అనేది కుమారి.

"ఓసి పిచ్చితల్లీ! ఇక్కడి పిచ్చిఊహ నీకు!"

"లేదమ్మా! తప్పకుండా వస్తాడు. పోతూ పోతూ నన్ను మరచిపోయ్యేవు సుమా అని చెప్పిపోయినాడు."

"వాడే నిన్ను మరచిపోయినాడే, పిచ్చితల్లీ! యింక వాని ఆలోచన విడిచిపెట్టు."

"అట్లా కానే కాదు. అతడు నన్నెన్నటికీ మరచిపోడు. నన్ను పూలల్లో పెట్టి పూజిస్తానన్నాడు. ఆ అలలవలెనే ప్రేమ అనంతము, అఖండము అన్నాడు."

"బిడ్డా, నీకు మతి పోయిందా ఏమి! వేరే మంచివరుని చూస్తానులే. చింత చేయవద్దు." అన్నాడు తండ్రి.

"నా శంకరన్ కంటే మంచివాడు ప్రపంచమంతా వెదకినా దొరకడు. నా శంకరన్ తప్పకుండా వస్తాడు, నా పెండ్లి విషయంలో మీరేమీ చింత చేయవద్దు. చిన్నప్పుడే మా ఇద్దరికీ పెండ్లి అయ్యింది. పోన్లే ఎదురు చూస్తుంటాను. మీ కిష్టం వుంటే ఇంత కూడు పెట్టండి. లేకుంటే నేనూ సముద్రంలోకి పోయి నా ప్రియుణ్ణి, నా భర్తను వెదుక్కొని కలుసుకుంటాను.

* *

కొన్ని రోజులు అట్లే గడచిపోయినవి. కుమారి తల్లిదండ్రులు క్రమంగా చనిపోయినారు. కుమారికిప్పుడు దిక్కెవ్వరూ లేరు. తల్లిదండ్రులు విడిచిపెట్టి పోయిన ఆస్తి కావలసినంత వుంది. దినమూ తనకూ, తన శంకరన్‌కూ వంట వండుతుంది. సాయంత్రం సముద్రం వరకు శంకరన్ కోసము

మాటు గట్టుకొని సముద్రతీరం పోయి, తాము చిన్నప్పు డాడుకొన్నచో ట్లన్నీ తిరిగి చీకటి పడేవరకు శంకరన్ ఆఖరుసారి తనను విడిచిపెట్టి పోయిన తావుకు పోయి అక్కడ అన్నము పెట్టి యింటికి వస్తుంది. ఇట్లా దినాలు, మాసాలు, సంవత్సరాలు గడుస్తూ కుమారికి ౬౦ ఏండ్లు నిండినవి. ఈ ౪౫ ఏండ్లనుండి అదే దినచర్య.

ఒకనాడు చాలా జబ్బు చేసి మంచం పట్టింది. కుమారి ప్రక్కయింటి నాయర్ స్త్రీ నకతె వచ్చి పరిచర్య చేస్తూ వున్నది "అయ్యో! యీదినము శంకరన్‌కు అన్నము తీసుక పోలేదే. నీ వైనా తీసుక పోవూ? అతడు వచ్చేవేళ అయింది" అన్నది నాయరు స్త్రీతో. కుమార్తి రెండవదినము జబ్బుగా జాస్తి అయినది ఆమె పవిత్రవర్తనము, ఆ నిర్మలప్రేమ, ఆ అఖండభక్తి, ఆ అపూర్వ విశ్వాసము చూచి ఆమెకు భక్తితో నమస్కరిం చనివారే ఆగ్రామంలో లేరు. ఆమెకు రెండుదినాలు చాలా జబ్బైం దని వినేవరకు చుట్టుపట్లవా రంతా గుం పైనారు. వగ అంతా తీవ్ర మైన తాపము, కలువరింతలు, ఆ కలువరింతలు అంతా శంకరన్ గూర్చిన కలవ రింతలే.

"ఓహోహో! నీ వేముందు దొర్లిపోవాలె...

"మనకు పెండ్లయితే యెప్పటిలాగా ఆడుకోమా!...

"నన్ను మరిచిపోతావా శంకరన్!...

"లేదు లేదు, నీవు జల్దీ రాకుంటే వట్టు!..."

ఈప్రకారము కలవరించుచూ వున్నది.

సాయంత్ర మైంది. అందరూ మట్టూ మూగి ఉపచారాలు చేస్తూ వున్నారు. తటాలున కుమారి ముఖముపైన గొప్పకాంతి బయలుదేరింది. కండ్లలో ఆనందజ్యోతి ప్రజ్వరిల్లింది. ఎక్కడ లేనిబలం వచ్చింది. మంచ ములో లేచి కూర్చొని దక్షిణముఖంగా చూస్తూ చేతులు చాచి కుమారి

"ఆఁ వచ్చితివా, శంకరన్! జల్దీ వస్తా నంటివే! యిప్పు డైనా నన్ను

మరచిపోలేదు కదా! నన్నూ రమ్మంటివా? వస్తా, వస్తా, యిదిగో వస్తున్నాను, వస్తున్నాను శంకరన్......"

ఆమె మంచముమీద పడిపోయింది అంతా నిశ్శబ్దం. చూచేవరకు కుమారి శరీరం చల్లబడింది, కండ్లు మూసుకున్నది. ముఖముపైన చిరునవ్వుమాత్రము అల్లే నిలిచిపోయింది.

గ్రామస్థులు అంతా, సర్వవర్ణములవారు ఆమెను శంకరన్‌తో కడసారి వీడ్కోలు పొందిన స్థలములో సమాధి చేసినారు. అప్పటనే వక గుడి కట్టినారు. అందులో అఖండప్రేమజ్యోతి వెలిగించినారు. నేటికీ కన్యాకుమారి దేవతయై ఆచోట పూజలు పొందుతూ వున్నది. "నిన్ను పూలల్లో పెట్టి పూజిస్తాను. అందరిచేత పూజ చేయిస్తాను" అన్న శంకరన్ మాటలు నిజమైనవి!

# పుట్టింటికి

శ్రీ వింజమూరి శివ రామ రావు

ఇరుగమ్మా పొరుగమ్మా సింగారించుకుని కచ్చేరీలనుంచి వచ్చేభర్తలకోసం ఎదురుతెన్నులు చూసేవేళ సరోజిని సంజప్రొద్దు కదలల మబ్బుల వెనకాల ఎక్కడికో చూస్తూ నిట్టూర్చేది. ఇంట్లో ముసలమ్మ "నీమొగుడికి ఉద్యోగం కావడం, నువ్వు కాపరానికి వెళ్ళడం నాకళ్ళతో నేను చూడను..." అని ఊరికే ఎప్పుడూ సాధిస్తూంటే ఆమె గ్రుడ్ల నీరు పెట్టుకుని తల వాల్చుకునేది. మొగనిమీద జాలిపడుతూ, తనలో తాను విసుక్కుంటూ, అమ్మనీ చెల్లెళ్ళనీ కసురుకుంటూ రెండేళ్ళు పుట్టింటే గడిపివేసింది.

ఈరెండేళ్ళూ విశ్వప్రయత్నం చేశాడు ప్రభాకరం ఎక్కడైనా సరే మాష్టరీ దొరుకుతుం దేమో నని. ఏ కాలేజీకీ, హైస్కూలికీ తన ఎం. ఏ. డిగ్రీ అక్కరకు వచ్చింది కాదు; ఏ అధికారీ, ఏ యజమానీ, తన తెలివితేటల్ని లెక్కచేశాడు కాదు. చివరికి అతడలాగే నిరుద్యోగిగా, నిరాధారిగా నిలిచిపోయాడు. పిత్రార్జితం పొలము హరించిపోగా మిగిలిన ఆ ఒక్క ఇల్లూ ఇంత అద్దె తెచ్చి ఇస్తూంటే దానితోనే పొట్ట నిండించుకుంటున్నాడు.

"ఏమైనాసరే! నేనింక ఇక్కడ ఒక్కగడియ ఉండను. ఆయనతో పాటు కలో గంజో కాచుకుని తాగుతూ పడుండాలిసిందే" అంది సరోజిని తండ్రితో, "అతను ఉద్యోగం కాక ఇబ్బంది పడుతున్నాడు గదా! నువ్వు కూడా ఎందుకమ్మా? ఇక్కడ నీకేమి లోటని... కావలిస్తే అతన్నికూడా వచ్చి ఉండమందాం, ఉద్యోగం ఏదేనే అయేదాకా" అన్నాడు సరోజిని తండ్రి.

"ఆయన ఇక్కడికి వచ్చి ఉండరు నాన్నా! నాకు బాగా తెలుసు... నన్ను వెళ్ళనీ... ఎల్లకాలం ఒక్కతీరుగా ఉండదు కదా!" "చాలా బాధ పడతావు తల్లీ! బాగా ఆలోచించు. మీకు ఎత్తి పెట్టేటంత ఉన్నవాణ్ణి కాదుగదా..."

"ఒకరిచ్చేదేమిటి నాన్నా! ఎవరి మట్టుకు వారు సంపాదించుకోవాలి గాని. ఏమైనా సరే ఎల్లుండి నాప్రయాణం తప్పదు" అనిచెప్పి వంటింట్లోకి చక్కాపోయింది సరోజిని.

తనకే ఆ కాలేజీలో లెక్చరర్ పని అవుతుందని ఎంతో ఆశపడ్డాడు ప్రభాకరం, గాలిలో ఎన్నో మేడలు కట్టుకున్నాడు; కాని సమయానికి ఆ ఆవిడాయన అడ్డు వస్తాడని అతను కలలోకూడా అనుకోలేదు. అదే చింతతో కూర్చున్న అతనికి ఇంటిముందు ఒండి ఆగిన అలికిడి వినిపించింది. అతను లేచేసరికి ఎదురుగా పెట్టెతో, కొంచెం భయంగా, నిలబడి వుంది సరోజిని, తల వాల్చుకుని...

ఒక్క సంవత్సరం ప్రణయరాజ్యాని కేలికలై కాపరం చేశారాయిద్దరూ. అతని ఉద్యోగం కాలేదే అనే చింత ఆమెకూ, ఆమె నికమీద ఎలా పోషించేదీ అనే దిగులు అతనికీ లేకుండా ప్రపంచాన్నే మరచిపోయారు ప్రేమలోపడి. ఆమె పుట్టింటినుంచి తెచ్చుకున్న సొమ్మంతా అయిపోయిందనే సంగతికూడా వారు గమనించ లేదు కొంతకాలంవరకూ. తెలుసుకున్న తరువాత ఇద్దరికీ గుండెలు కొట్టుకున్నాయి, రోజులు గడిచేదెలాగరా అని, ఆమె ప్రోత్సహించింది. అతడు దీక్షవహించాడు; ఏదైనా నౌకరీ సంపాదించాలని. కాని ఇచ్చేదెవరు?

ఒకనాడు మధ్యాహ్నం ఎండలో చెమటలు కక్కుకుంటూ ఇల్లు చేరుకున్నాడు ప్రభాకరం. గుమ్మంలోంచి ఏమైందని ఆత్రంతో అడిగింది సరోజిని. అతడు మడతకుర్చీలో వెన్ను వాల్చి నిట్టూర్పు "తెనుగువాడికి బంట్రోతుపనికూడా దొరకదు. ఏ తెనుగుసంస్థా అభివృద్ధి చెందదాని

వీలులేదు. ఏ తెనుగుకళా తలెత్తుకునేందుకు తావులేదు. ఏ తెనుగువ్యక్తి ఉద్యోగస్థుడవుతాడనే ఆస లేదు. ఎప్పటికైనా ప్రత్యేకాంధ్రరాష్ట్రం వస్తే ఏమోగాని, లేకుంటే ఆంధ్రజాతి కధోగతే ఇంకముందు..." అన్నాడు.

"సరేగాని లేచి స్నానం చెయ్యండి; వంట అప్పుడే చల్లారిపోయింది" అని సరోజని ప్రభాకరాన్ని లేవదీసింది. భోజనం చేస్తూంటే అత డామెతో "పోనీ, ఒకటి రెండు నెలలపాటు నువ్వు మీపుట్టింటికి వెళ్ళి రాకూడదూ! ఈలోగా నేను ఎక్కడైనా, ఏచిన్నపనైనా సంపాదించుకుంటా" అన్నాడు. ఆమెకళ్ళు చెమ్మగిల్లాయి. అది చూచి మళ్ళీ అత నాప్రశంస లేలేదు.

ఇల్లు తాకట్టుపెట్టి సొమ్ము తీసుకువచ్చా డతను. ఇంటిలోకి కావలసిన వన్నీ వద్దురావి తెప్పించిన దామె. ఒకరి నొకరు హెచ్చరించుకుంటూ, అనునయించుకుంటూ ప్రేమలో కొంత కాలం గడిపేశా రాయిద్దరూ. ఆ సొమ్ము కాస్తా అయిపోయింది. ఉద్యోగం కోసం ఆమె వెయ్యిదేవుళ్ళకి మొక్కుకుంది; అతడు శతవిధాల ప్రయత్నం చేశాడు. కాని ఏ దేవుడికీ హృదయం కరగ లేదు; ఏ ప్రభువుకీ బుద్ధి పుట్టలేదు.

ఒకనాటిరాత్రి ప్రొద్దుపోయి ఇంటికి వచ్చాడు ప్రభాకరం. మంచి అలతితో నీరసంగా పడుకున్న సరోజని నెమ్మదిగా లేచి అతని మొహం వంక చూచి "పని కాలేదు కాదూ" అని. "ఎలా వౌతుంది? ఆంగ్లోఇండియన్లు చిన్నపనులు మాత్రం చేయలేరో? ... ... నీభోజన మైందా" అన్నాడు, "వంట కూడా కాలేదు ... కావడానికి ఇంట్లో ఏమీ లేవు..." అతడు లేనినవ్వు తెచ్చుకుని, ఆమెను ముద్దు పెట్టుకున్నాడు ఆమె లేనిసత్తువ తెచ్చుకుని అతని మెడ చుట్టూ చేతులు పెనవేసింది. పడుకుని ఉండగా— "పోనీ ఒకటి రెండు నెలలు పాటు మాపుట్టింటికి వెళ్ళి వస్తాను. ఈలోగా మీ కేమైనా పని కుదురుతుందేమో" అంది ఆమె. అతని మొహం ఎర్రగా అయిపోయింది. అది చూసి మళ్ళీ ఆమె అనంగలి ఎత్తలేదు.

ఆమె ఒంటిమీద కొంచెం బంగారాలు క్రమక్రమంగా మార్వాడీ దాపాని కొచ్చేశాయి. అతని ఇంటిలోని పాత్రసామాను ఒక్కొక్కటి కాలం కాళ్ళక్రింద చెల్లుబడి అయినాయి. ఆమె లోలోపల కుమిలి పోతూ వుంది. అతడు ఎక్కడెక్కడికో పోయి అడుగుతూనే వున్నాడు. కాని ఎక్కడా కలిసిరావడం లేదు. చివరికి ఆ ఇల్లు కూడా అమ్మకోవలసిన గతి పట్టింది, పొట్టకోసం; ఇంక నిలవ నీడకూడా లేదు. ఏపూట కాపూట తిండి కలాగా అనే దిగులే!

"మరచి సినిమాలు — ఊరంతా వెడుతున్నారు — మనంకూడా వెడదామా! చాలారోజులైంది టాకీ చూసి—" అంది సరోజని. "డబ్బేదీ? అప్పుకూడా ఎవరూ ఇయ్యరు నాకు. ఉద్యోగం అవనీ; రోజూ వెడదాం" అన్నాడతను.

"పండగ గదా! బొబ్బట్లుచేసి పెడుదూ — తినాలని ఉంది. చాలా రోజులైంది కాదూ నువ్వు బొబ్బట్లు చేసి" అన్నాడు ప్రభాకరం.

"ఏమి పెట్టి చేసేది? అప్పుసైతం దొరకదాయె. ఉద్యోగం అయనీండి—కావలసినన్ని" అంది ఆమె.

ఇంక ఏదారీ లేక మామగారికి పేర ఉత్తరం వ్రాశాడు ప్రభాకరం, ఏమైనా సాయం చేయవలసిందని, జవాబు లేదు. సరోజనికూడా వ్రాసింది, ఉద్యోగం కాగానే నెలనెలా ఋణం తీర్చుకొంటామని. పంపడానికి ఏమీ తనవద్ద లేదనీ, వచ్చి తనయింట్లో ఉంటే తనకేమీ అభ్యంతరం లేదనీ జవాబు.

దారిద్ర్యం, నిరుద్యోగం కలిసి, కుట్రచేసి ఆదంపతుల్ని పిశాచాల్లాగ పట్టుకుని పీడించడం మొదలు పెట్టాయి. ఎక్కడకు వెళ్ళినా పరువు లేదు; ఏపని చేసినా మెప్పులేదు. ఎర్రబడిన కళ్ళతో, పెరిగిపోయిన గడ్డంతో, మాసిపోయిన బట్టలతో తిరిగే ప్రభాకరాన్ని చూసి, ఉద్యోగం ఇయ్యక పోయినా ఇదివరకల్లా మర్యాదగా మాట్లాడే అధికారి అతనివంక చూడ

మైనా చూడలేదు. చిక్కిపోయిన చెక్కిళ్ళతో, రేగిపోయిన తలకట్టుతో, చిరిగిపోయిన చీరతో వచ్చి సరోజిని చూచి అవ్వ ఆశ్చర్యపోయినా, ఇంతవరకూ జాలిగా పలకరించే పక్కయింటావిడ తలుపు వేసికొని లోపలికి చక్కాపోయింది.

క్రమక్రమంగా అతనికి చిరాకు ఎక్కువైపోయింది. ఆమెకు ఓరిమికూడా తగ్గిపోయింది. అయినదానికీ కానిదానికీ అతడామెను తిట్టడం మొదలు పెట్టాడు. ఊరుకోకుండా ఆమె అతణ్ణి ఎదిరించడం మొదలు పెట్టింది. అతడు కాస్త చెయ్యి చేసుకోవడం, ఆమె పనులన్నీ మానివేసి ఏడుస్తూ పడుకోవడం మామూలైపోయినాయి. పండంటి కాపరానికి దారిద్ర్యం, నిరుద్యోగం చిచ్చుపెట్టాయి—

ఆదరవు ఏమీ లేదని కోపంతో అన్నంకూడా వండకుండా పడుకుంది సరోజిని ఒకనాడు. ప్రభాకరం అదిచూసి ఆమెను నాలుగు తన్నాడు.

“పెట్టేది లేదు, పోసేదీ లేదు, కొట్టడంకూడా ఎందుకు? ఇష్టముంటే ఇలా ఉండనీయండి; లేకుంటే పుట్టింటికి పోతాను” అనేసిందావిడ. “పోతే పో! ఇక్కడ నిన్ను కట్టిపెట్టిందెవరు? శని విరగడై పోయిందను కుంటాను” అనేశాడతను గట్టిగా.

మాస్టరీపని ఒకటి ఖాళీ అయిందనీ, ప్రభాకరం వస్తే ప్రయత్నం చేస్తానని ఒక స్నేహితుడు తనపేర వ్రాస్తే, భార్యమెడలో మిగిలివున్న పుస్తె అమ్మేసి, అతను ఊరికి వెళ్ళాడు. కాని ఒక బెంగాలీబాబుకు అది అయిపోయింది. ఈ తెలుగువాడు మళ్ళీ నిరుద్యోగే!

తాను తిండికీ గుడ్డకీ లేక అవస్థపడుతున్నాననీ, వెంటనే రాకపోతే ప్రమాదమనీ సరోజిని తండ్రిపేర ఉత్తరం వ్రాస్తే, ఆయన వచ్చి ఆమెను ఎవరితోనూ చెప్పకుండా తీసుకుపోయాడు. ప్రభాకరం ఇంటికి వచ్చి చూచేసరికి తన సూటుకేసు ప్రక్కన సరోజిని కావడిపెట్టె కనబడ లేదు. ఎదురుగా గూట్లో ఆమె బొట్టుపెట్టె లేదు.

# బాకీ

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

## ౧

"నా మాట వింటే ఇంతవరకు రాదు అన్నయ్యా! ఆ వచ్చిన అతన్ని నా చేతులో వదిలేస్తే, కానీ అప్పు లేకుండా జరుపుతాను అంటే వింటేనా ఆయన!"

"నేను చెప్పాననమ్మా! నీకు వచ్చిన జీతం జీతం అమ్మాయికి ఇచ్చెయ్యరా; ఆడ వాళ్ళు మనకంటే పొదుపుగా వాడుతారూ అని చెప్పాననమ్మా!"

"మీరే కాదు అన్నయ్యా! అంతా చెప్పారు. వింటేనా? చూస్తున్నారుగా సంగతి అంతా! బియ్యం వాడికి యాభై రూపాయలు ఇవ్వాలి. ప్రొద్దున్న ఆయన వచ్చి కేకలేసి వెళ్ళాడు. నేను వంట ఇంట్లో ఉన్నాను అప్పుడు. చెయ్యి ఖాళీగా లేదు. లేకపోతే వచ్చి, అప్పు పెట్టినందుకు ఆయనను నాలుగు చీవాట్లూ వేసేదాన్ని."

"వాళ్ళని చీవాట్లు వేస్తే ఏంలాభం అమ్మాయీ! మన బంగారం మంచిది కాకపోతే కంసాలి ఏం చేస్తాడూ!"

"బాగా అన్నారు! ఇల్లాగ వస్తున్నది పై తెలియకుండా ఖర్చు చేస్తే ఎన్నాళ్ళని గడుస్తుం దంటారూ!"

"నిజమే మరి!"

"నిజ మని మెల్లిగా అంటా రేమిటి? ప్రస్తుతం మీరూ మేమూ కలిసి ఉన్నాము కాబట్టి ఏమున్నా, ఏం లేకపోయినా, ఇబ్బంది అంటూ కన పడటంలేదు? రేపు వేరుగా కాపురం పెడితే తెలిసొస్తుంది అయ్యగారికి!" అన్నది మా బావమరది భార్య విసుగుతో.

"ఎల్లకాలం ఇల్లాగే ఎందు కుంటుం దమ్మా! ఏదో చిన్నతనం ఇంకా నాలుగేండ్లు గడిస్తే వాడికే వస్తుంది జ్ఞానం!" అన్నాను నేను.

నిజానికి వాడిని గట్టిగా చీవాట్లు వేయటానికి వీలు లేదు. అరవై రూపాయలు వస్తున్నాయి రావటానికి. కాని అందులో నెలకు ఓ ఇరవై రూపాయలు ఇంటి దగ్గరున్న తల్లి దండ్రులకు పంపుతున్నాడు. మొగుడూ పెళ్ళాని కీ మిగిలిన నలభై సరిపోవలసిందే. కాని- ఏదో చిన్నతనం చేత బట్టలకూ, వాటికీ; కాస్త ఎక్కువే ఖర్చు చేస్తున్నాడు. సంవత్సరానికి రెండు వందల రూపాయలు వచ్చే సదుపాయం ఉండికదా, అప్పు కాస్త అయితేమట్టుకు తిని, తీర్చుకో లేకపోతాడో అని నేనూ ఊరుకొన్నాను. ఎవ్వడో వచ్చి ఎప్పుడు ఇస్తా నంటే వర్తకులు ఊరుకోరు. అందుచేత అంతవరకూ ఆగటానికి వీలు లేదంటూ బియ్యపువర్తకుడు మావాడిని వేధిస్తూ ఉన్నాడు. దానితరువాత తీసుకోవచ్చు వాడికి సమయానికి కాస్త వసూలవకదా మని నేను అనుకోటం అనుకొంటాను. కాని అనుకోటంతోనే సరి! ఇద్దా మంటే ఉండేది కాదు. వంద రూపాయలు తెచ్చుకొంటున్నా నాసంగతి అంతకంటే అధ్వాన్నం. వాడికింకా కాస్త అప్పు అయినా పుడుతుంది. నాకు అది లేదు. అయితే నాది పెద్ద సంసారం. పిల్లల చదువులకూ వాటికీ ఖర్చు లున్నాయి. వాడికి ఏమీ బాదరబందీ లేదు. వాడు కాస్తో, కూస్తో వెనకేయ వచ్చు. అందుకని ఈసారి వాడికి కాస్త గట్టిగా చెప్పాలనే అనుకొన్నాను.

ఆరోజు మధ్యాహ్నం భోజనా లైనతరువాత మావాడితో ఈ ప్రసంగం ఎత్తి, అప్పుల వాళ్ళు మన ఇంటిచుట్టూ తిరగటం మన కేమీ మర్యాదగా

లేదురా నాయనా! నీవు ఎక్కడైనా తెచ్చి అయినా సరే ఆ బియ్యం బాకీ తీర్చి వేసెయ్యి అని చెప్పాను.

"నిజమే బావా! దరిద్రంగానే ఉంది. వారం రోజులలో ఈ బాకీ తీర్చేస్తాను." అన్నాడు. "తీర్చేసెయ్యి. తీర్చి ఇక మీదట, నీకు వచ్చే జీతం, జీతం అమ్మాయికి ఇస్తుండు. ఆడవాళ్ళు వాడినంత పొదుపుగా మనం వాడలేము అన్నాను. అమ్మాయి వింటూ ఉండంగానే వాడు భార్య వంక చూచి ముసిముసి నవ్వులు నవ్వుతూ "అల్లాగే బావా, నీవు ఇంతగా చెప్పక్కర లేదు. తప్పకుండా అల్లాగే ఇస్తాను" అన్నాడు. వాడిభార్య "ఆ అన్నీ ఇచ్చారు! ఎన్నిసార్లు అన్నారు ఇల్లాగ" అని ముక్కు మూతి విరిచింది.

ఆ తరువాత రెండుగంటలకే మా వాడు టిపుటాపుగా ముస్తాబై ఎక్కడికో బయలుదేరుతున్నాడు. ఎక్కడికి అని అడగటం మంచిది కాదు, కాబట్టి ఊరికే సందేహంతో నవ్వుతూ వాడివంక చూశాను. ఆవికారపు చూపుల్లో నాప్రశ్న బయటపడ్డది. వాడూ ఆసంగతి గ్రహించాడు.

"ఇవ్వాళ మా బ్యాంకి అధికారి నాలుగుగంటల బండిలో వస్తాడు బావా. నేను వెళ్ళి రిసీవ్ చెయ్యాలి" అన్నాడు మా వాడు.

"అయితే నాలుగుగంటల బండిలో వచ్చే ఆయనను రిసీవ్ చేయటానికి రెండు గంటలకే బయలుదేరాలా?" ఈ ప్రశ్న విని వాడు పకపకా నవ్వి, దానికో కారణం ఉంది బావా అన్నాడు.

ఒకటేం రెండు ఉన్నాయి అన్నయ్యా అన్నది వాడిభార్య నవ్వుతూ. ఇద్దరూ పకపకా నవ్వుకొన్నారు. ఎందుకో నాకు అర్థం కాలేదు.

"ఏం లేదు బావా, మూడు గంటలకు ఓ టీ పార్టీ ఉంది. అక్కడ

ఇన్సూరెన్సు హాలులో" అన్నాడు వాడు. "ఆ, ఆ, ఎందు కండీ ఆగోడ వంతా? అసలు సంగతి చెపితే ఏం?" అన్నది వాడి భార్య.

మావాడు భార్య వంక తిరిగి, అసలుసంగతికి ఏ ముందీ అంటూ, ఇదిగో, ఇది చూడు బావా అని ఓ ఎర్రకాగితం నాకు అందించాడు. నేను చూచి నవ్వుకొని,-నిజమే నమ్మా! టీ పార్టీమాట నిజమే, అన్నాను.

టీ పార్టి మూడింటి కైతే రెండింటికే బయలు దేరటానికి కారణం ఏమిటో అడుగు అన్నయ్యా! అన్నది కనకం విరగబడి నవ్వింది. "నేను అడగటం ఎందుకూ, వాడే చెబుతాడు-" అని నేనన్నాను.

చెప్పటానికి మరేం లేదు బావా. టీపార్టీ కాబట్టి ముందుగా వెళ్ళటం దేనికైనా మంచి దని వెళుతున్నాను. అంతే, అని భార్యను చూచి ముసి ముసి నవ్వులు నవ్వాడు.

"అది కాదండీ అన్నయ్యా, రెండున్నరకు బియ్యపు వర్తకుడు వస్తాడు. వస్తా వని చెప్పి వెళ్ళాడు లెండి. అందుకని హడలిపోయి పారిపోతు న్నారు" అని నిజం కాస్తా బయట పెట్టింది.

మావాడు భార్యను కోపపడలేదు. "హడలిపోవటం కాదు బావా వారంరోజుల్లో ఎట్లాగూ వస్తుంది. ఇచ్చేస్తాము ఏదో ఈనాలుగు రోజులూ వాడి కళ్ళ బడకుండా ఉండా లని చూస్తున్నాను. అంతే:" అన్నాడు. "అయితేమట్టుకు ఇవ్వాడు పారిపోవటం భయపడి కాదా?" అన్నది అమ్మాయి. వాడు మాట్లాడలేదు. అమ్మాయి ఊరుకోక "ఎందుకండీ, అంత అభిమానం! మీబావదగ్గర కూడాను" "ఆయన వస్తున్నాడూ, ముఖం తప్పిస్తున్నాను అని చెప్పరాదూ?" అన్నది.

"చెప్పే దేమిటి, బావకు తెలియదా? అది కాదు బావా, వారం రోజు లలో ఇస్తా నంటే వాడు ఎందు చేతనో ఆగటం లేదు. ఎప్పుడూ ఇట్లాగ కాదు. ఈతఢా ఎందుచేతనో జిడిలాగ పట్టుకొని వదలకుండా ఉన్నాడు.

అందుకని ఈ నాలుగు రోజులూ వాడికి శాంతి కనపడకుండా ఉందా మనే అనుకుంటున్నాను.'' అన్నాడు మావాడు.

''అదా సంగతి? రెండున్నరకు ఆయన వస్తాడని ముందుగా వెళ్ళి పోతున్నావూ? అయితే ఒక్క సంగతి. ఆ వచ్చిన ఆయన నీవు వచ్చే టంతవరకూ ఇక్కడే కూర్చుంటాను అనకూడదు? అప్పు డేమిటి గతి?'' అన్నాను. ఇల్లా జరగవచ్చునని వాడికి అంతవరకూ తట్టలేదు కామాలు, ఈమాట విని మావాడు తెల్లపోయినాడు.

తెల్లపోయి, ''నిజమేను బావా! ఎట్లా? వాడు అల్లా చేస్తే చెయ్యవచ్చు. ఒకతీరాన వదలటంలేదు. తీరా నేను అధికారిని వెంటబెట్టుకొని వచ్చేసరికి ఈదరిద్రుడు తయారవుతాడు కామాలు'' అని అంటూ దిగాలుపడి నుంచున్నాడు.

,,ఆయనకు తోచక పోయినా నేను చెప్పి అయినా సరే కూర్చోబెట్టక పోతే చూడండి'' అని అమ్మాయి బెదిరించింది.

అమ్మాయి నవ్వులాటకు అన్న ఈమాట, వాడిని కష్టపెట్టింది. అందుకని వాడు వినుకొని ఏమీ జవాబు చెప్పలేక నావంక దీనంగా చూశాడు.

,,ఏంరా, అల్లాగ దిగులుపడతావూ? అప్పులున్నయ్యి అని ఆయనకు తెలుస్తుంది! తెలిస్తే నీకు వచ్చిన నష్టం ఏముందీ? ఆయనకు మట్టుకు అప్పులు ఉండవా?'' అన్నాను.

,,అల్లా కాదు బావా, నేను ఏదో డబ్బు గలవాడిని అయినట్లూ, ఘరానాగా బతుకుతున్నట్లూ ఆయనకు మొదట్లో అభిప్రాయం కలుగ జేశాను. ఇప్పుడు ఈవిధంగా నాబతుకంతా బయటపడ్డదా నాకు మర్యాద ఉండదు!'' అన్నాడు.

ఈమాట మీద అమ్మాయి అన్నదీ... ,,అయితే మీ బావ ఏం చేస్తారూ, మీరే ఉండి, ఆయనకు ఏదో మంచిమాట చెప్పి పంపించి మరీ వెళ్ళండి''

ఈనలహా మావాడికి నచ్చ లేదు. అందుకని వాడు నాతో అన్నాడు. "అది కాదు బావా, నేను కనబడితే ఆయన వద దు నువ్వే ఏదో కాస్త మంచిమాట చెప్పి పంపివేయాలి." ఆ అనటం కూడా బతిమిలాడే పద్ధతిలో అన్నాడు.

"సరేలే, నే నేదో చెప్పి పంపిస్తానులే. నీవు వెళ్లు" అని మా వాడ్ని పంపించాను. వాడు వెళుతూ "బావా, నీకవిత్వం అంతా ఉపయోగించి ఈపీడ వదిలించాలె సుమీ నేను నాలుగున్నర కల్లా మా అధికారితో వస్తాను" అని చెప్పి భార్యతో, ఫలహారం కాఫీకూడా సిద్ధంచేయ్యమని పురమాయించి వెళ్ళిపోయినాడు.

నేను కాస్సేపు పడుకొని, విశ్రాంతి తీసుకొని వాకిట్లోకి వచ్చేసరికి ఎవరో ఒకాయన మాయింటికి వస్తున్నాడు. అప్పుడు మూడు అయింది. ఆ వచ్చే ఆయన నల్లగా పొట్టిగా ఉన్నాడు. బట్టలు మాసి ఉన్నాయి. మూడు కాలేదు, అప్పుడే వస్తున్నాడు, పనిపోయినట్లు అనుకొని మాస్తూ, నిలుచున్నాను. ఈపాహుకార్లు ఎండా వానా అని చూడరు. ఎప్పుడు బడితే అప్పుడు వస్తారు. నిద్రాహారాలు ఉండవు కాబోలు. అనుకుంటూ అక్కడే నిల్చున్నాను.

ఆయన యకాయకీని నరిగ్గా గడపలోకి వచ్చి, నన్ను తేరిపార జూచి "నారాయణమూర్తి గారు ఉన్నారా అండీ!" అని అడిగాడు. "లేరు" అన్నాను.

ఈమాట విని ఆయన నిలువునా నీరై పోయినాడు. ఆకాశం విరిగి మీద పడ్డట్లు నిర్ఘాంతపోయి నిలబడ్డాడు. అనుకున్న సమయానికి పైకం అందకపోతే కొంచ కూలినట్లు నటించటం వర్తకులకు ఉండే సహజ గుణమే కదా అనుకొన్నాను. తనసొమ్మంతా హఠాత్తుగా సముద్రంలో మునిగి పోయినవాడు సహితం అంత ఏడ్పుముఖం పెట్టడు. ప్రాణం మీదికి వచ్చిన వాడిలాగ గుడ్లు తేలేశాడు. వాటర్లూ యుద్ధంలో ఓడిపోయిన

నెపోలియన్ సహితం అంత బేజారై ఉండడు. ఆయన్ను జూస్తే నాకు పరమ అసహ్యం వేసింది.

కాస్సేపటికి ఆయన తెప్పరిల్లి "ఎక్కడికి వెళ్లా రండీ?" అని అడిగాడు. "బైటికి వెళ్ళాడండి" అన్నాను.

ఆయన ఒక్క క్షణం అల్లాగే నిలబడి చివరకు "ఎక్కడకు వెళ్ళి ఉంటాడండీ? నేను వస్తానని ఆయనకు తెలుసునే, ఎందుకు ఇల్లాగ వెళ్ళిపోయినాడో" అని తనలో తాను అనుకొన్నట్లు అనుకొని, మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చిన వాడిలాగ చూచి ధైర్యంతో "సరే లెండి. ఇంకా కాసేపట్లో వస్తా డనుకొంటా" అని జేబు గడియారాన్ని పైకి తీస్తున్నాడు.

"మీరు వస్తారని తెలిసే, మీకు కనపడకుండా ఉండాలనే వెళ్ళిపోయినాడు." అని గబుక్కున నోరుజారి అనేశాను. అన్న తరువాత విచారించాను, అయ్యో ఎందుకంటినా, అనవసరంగా పెద్దమనిషి మనస్సు నొప్పించానే అని.

పాపం ఆయన తెల్లపోయి, "ఎందుకండీ, ఏమంత ఖర్మం! అంత పారిపోవలసిన అవసరం ఏమీ లేదే!" అన్నాడు. "భయం కాదుటండీ, అప్పుల వాళ్ళను చూచినా అధికారులను చూచినా?" అని నేను అన్నాను. కాని ఆయన ఏమీ తృప్తిపడ్డట్టు కనపడలేదు. పైగా ఆయన ఆహ్వానం లేకుండానే లోపలికి వచ్చేసి కుర్చీలో కూర్చున్నాడు. మావాడు భయపడ్డట్టా అయింది. ఇక ఆయన వదిలేటట్టు లేదు. మీరు వెళ్ళండి నేను తలుపు వేసుకొంటాను. అని అంటానికి నాకూ నోరు రాలేదు. నేనూ మరో కుర్చీలో కూర్చుని, పేపరు చదువుతూ ఉన్నట్లు నటిస్తూ, ఈయనను సాగనంపటానికి మార్గం ఏదా అన్న ఆలోచనలోకి దిగాను.

బల్లమీద పుస్తకాలూ, పత్రికలూ, అవీ చాలా ఉన్నాయి. ఆయన ఒక ఇంగ్లీషు మాసపత్రికను లాగి పేజీలు తిరగేసి, చివరకు ఏదో చదువుతూ ఉన్నట్లు మొహానికి మూరలు పెట్టాడు. మొదట ఆయన బొమ్మలకోసం

చేతులు తిరగేశాడు అనుకొన్నాను గాని చివరకు ఆయన ఏదో చదువుకొంటున్నట్లు తోచింది. ఏదో మూడో ఫారండాకా చదువుకొని ఉంటాడు. పైకి చదవండి, నేనుకూడా వింటాను అని అందామని అనుకొని మరీ ఏడిపించినట్లు అవుతుందని ఊరుకొన్నాను.

నేను అనుకున్నట్లే అయింది. ఆయన చదువుతూ ఉన్నట్టు నటనచేస్తున్నాడని తేలిపోయింది. ఎందుకంటే, పదినిమిషాలు కాకముందే, ఆయన పుస్తకాన్ని బల్లమీద పెట్టి పైకీ, కిందికీ, చూడటం సాగించాడు. ముందు ఆయన దూలాలూ, అడ్డకడ్డీలూ, లెక్క జూచుకొన్నాడు. దాని తర్వాత దర్వాజాలు లెక్కేసుకొన్నాడు. ఆపైన కిటికీలు ఎన్ని అయిందీ ఒక్కొక్క కిటికీకి యెన్నిచువ్వలు ఉన్నదీకూడా చూచుకొంటూ ఉంటే నాకు నవ్వొచ్చింది.

కాసేపు ఇల్లాగ చూచి, పాపం, ఆయన చివరకు, నావంక జాలిగా చూస్తూ అడిగాడు, "ఏమండి, ఎక్కడికి వెడతా నని చెప్పి వెళ్ళాడండీ?" అని అల్లాగ అడుగుతూ ఉన్న పెద్దమనిషికి (వియ్యపువర్తకు డయితేనేం!) మర్యాదగా జవాబు చెప్పకపోవటం తప్పు అనితోచింది నాకు. అందుకని ఉతఖా నేను మర్యాదగానే జవాబు చెప్పాను. ఆంధ్రభక్తమ్యూజెన్సు హాలులో ఏదో టీపార్టీ ఉందని వెళ్ళాడండి అని.

"ఎన్నిగంటల కండీ, ఆటీపార్టీ?" అని అడిగాడు ఆయన. ఏమో నాకు తెలియదండీ అన్నాను నేను. ఆయన,- నేను వస్తా నని తెలిసి ఎందుకు వెళ్ళా డబ్బా! అని గొణుక్కొని అయితే, ఎప్పుడు వస్తా డని మీ అభిప్రాయం? అని అడిగాడు.

దొరికాడురా అనుకొన్నాను. ఆయనను పంపించేయటానికి ఏదో మాట అనవలసిన సమయం అదే నని నిశ్చయించుకొని- ఎప్పు డొస్తాడో చెప్పలేమండి. రాత్రికి గాని ఈమధ్య రాడు. అదైనా రాత్రి పదకొండింటికి వస్తాడు, రావటం అంటూ ఉంటే. ఒకప్పుడు అదీలేదు. నమ్మకం చెప్ప

లేదు. ఒకొక్కొక్కరోజున ఇంటికి రానే రాడు అన్నాను ఒక్కగుక్కలో.

ఈమాట వింకూడా ఎందుకు కూర్చుంటాడు ఎంత మొండి వాడైనా? ఇక లేచిపోతాడు గదా అనుకొంటూ ఆయన వంక చూస్తూ కూర్చున్నాను. ఆయన ముఖం చూస్తే లేచిపోదా మని నిశ్చయానికి వచ్చినట్టే కనపడ్డది.

ఆశ్చర్యపడుతూ పరధ్యాన్నంగా కొంసేపు కూర్చుని ఆయన మళ్ళీ అడిగాడు. "ఏమండీ, అయితే ఇంట్లో ఆయనకు భార్యాబిడ్డలు లేరా?" అని.

"లేకేమండి? ఉన్నారు. ఉంటే ఏం? వాడికి భార్యా పిల్లలసంగతి పట్టింది?" అన్నాను నేను బొత్తిగా వాడు చెడిపోయినా డని చెప్పలేక చెప్తున్నట్టు.

నామాటలు విని ఆశ్చర్యపడి అడిగాడు మళ్ళీ, "అయితే ఆయన ఉద్యోగంలో ఉన్నాడుగదా; ప్రొద్దున్నే లేచి ఆఫీసుకు వెళ్ళవద్దా? ఇల్లాగ అయితే, ఆఫీసులో పనిచేయటానికి ఓపిక ఎక్కడనుంచి వస్తుం దండీ?" అని.

"ఆఫీసు పట్టింది టండీ ఆయనకూ? ఎప్పుడో చేరుతాడు ఆఫీసుకి ఏవదింటికో, పదకొండింటికో."

"అయితే పూర్వపు మనిషి కాదన్నమాట!"

"ఎచ్చే, పూర్వపు మనిషి కానేకాడు. అంతా కొత్త సిరస్తా మారి పోయినాడు. బొత్తిగా మారిపోయినాడు. ఇంటిదగ్గర పెళ్ళాం ఒక్కతె రాన మొత్తు కొంటున్నది—పెందరాళే కొంపకు చేరుకో మని."

"అయితే ఉండి ఏమి లాభం లేదన్న మాట?" అంటూ ఆయన లేచి నిలబడి నా వంక చూశాడు. నేను తల గట్టిగా ఊపుతూ "ఊహూ, ఏమాత్రం లాభం లేదు. అసలు వస్తాడో రాడో కూడా చెప్పలేము" అన్నాను.

ఇక ఉండి లాభం లేదని ఆయనకు గట్టిగా తోచింది. లేచి నిలబడ్డాడు.

గమ్యంలోకి వెళ్ళాను. మళ్ళీ వెనక్కి తిరిగి "అయితే మీ క్షేమాలాభాలు అయన!" అన్నాడు. నేను విచారపడుతూ మా బావ మరదే నండి. చెప్ప కోటం సిగ్గు కూడాను!" అన్నాను. "ఊరుకో, అల్లాగు టండి. మీ ఇంట్లో అయన అద్దెకు ఉన్నా దేమో, మీకూ, వారికీ పోట్లాటలు ఉండటం మూలాన అల్లా అంటున్నారేమో అన్న సందేహం కూడా ఉండ వక్కరలే దన్నమాట!" అని వినపడీ వినపడనట్లు గొణుక్కుంటూ మెట్లు దిగి నేను వెడతా-అన్నాడు.

నేనూ నవ్వుతూ, వెళ్ళడమే మంచిది, కూర్చుని ఏమీ లాభం లేదు. హైగా మీ పనులు నష్టం! అన్నాను. ఆయన ముందుకు నడిచాడు.

వెనకనుంచి నేను, మీ రేమీ తొందర పడకండి. వాడితో చెప్పి అని విషయాలూ నేను సర్దుబాటు చేస్తాను, అన్నాను. ఆయన నావంక విచారంగా చూచి నవ్వుకొని ముందుకు సాగి పోయినాడు.

3

ఆయనను అట్లా పంపించి, మా కాంతం, నేనూ, మా వాడి భార్యా అంతా కూర్చుని నవ్వుకొన్నాము. జరిగిన సంభాషణ అంతా వాళ్ళకు పూస గుచ్చినట్లు చెప్పాను. ఎన్ని అబద్ధాలు చెప్పారండీ, మా తమ్ముణ్ణి గురించి అన్నది మా ఆవిడ. ఒక్కొక్క సమయంలో, అల్లాగ అబద్ధమాడక తప్పదు- అని నేను సమాధానం చెప్పాను. ఎల్లా గోలాగు పీడ వదిలించుకొన్నాం గదా అని సంతోషించాము మేము.

ఓనిమిషం అయిందో, లేదో, ఎందుకో ఉత్తరపు కిటికీలోనుంచి తొంగి చూశాను. దగ్గరలో అర్థఫర్లాంగు దూరంలో ఉన్నాడు మా వాడు. ఇంకెవరితోనో ఇద్దరితో కలిసి వస్తున్నాడు.

మా భావమరిది భార్యకూడా తొంగిమాచి "వస్తున్నారండీ, అను గో... తలగుడ్డ పెట్టుకొని దర్జాగా నడుస్తున్నా డో కాయన, అయనే కొమాలు

అధికారి! అట్లా ఉన్నారేం ఉసురో మంటూ!'' అన్నది. అధికారులు అట్లాగే ఉంటా రమ్మా అని నేను అన్నాను. నేనూ లేచి మళ్ళీ కిటికీలో నుంచి చూశాను. అమ్మాయి అన్నమాట నిజమే. ముగ్గురూ వస్తున్నారు. జవాను పెట్టె నెత్తిన పెట్టుకొని ముందు నడుస్తున్నాడు. ఆయన వెనకాల అధికారి, ఆ వెనకాల మావాడూ కనిపించారు.

అధికారి వస్తున్నా డని నిశ్చయించుకొనే సరికి ఈవియ్యాపు వర్తకుడు ఇంకా అక్కడే ఉన్నా డేమో నని సందేహం వేసింది. తలుపు తీసి చూశాను. అక్కడే శవిగ్రహంలాగ నిలబడి ఉన్నాడు వాళ్ళవంక చూస్తూ.

అధికారి ఎదటే తన బాకీ విషయమై మావాణ్ణి నిలవేసి అడుగుతా డేమో నని భయం వేసింది. అందుకని గబగబా వీధిలోకి పోయి, ఆయన్ని వెనక్కు పిలిచి "చూడండి, మావాడున్నూ, వాడున్న బ్యాంకి అధికారిన్నీ వస్తున్నారు. మీ బాకీ సంగతి ఇప్పు డేం ఎత్తకండేం!'' అని బతిమిలాడాను.

"ఎబ్బే! ఆ మాత్రం నాకు తెలియదు టండీ! వస్తున్నారు కదా, ఒక మాటు కనబడి నమస్కారం చేసి వెడదా మనుకుంటున్నాను.'' అంటూ ఆయన వెకిలిగా నవ్వాడు. "మీ బాకీ, వారం రోజులలో తీర్చే ఏర్పాటు నేను చేస్తాను. మీరు వెళ్ళిపొండి'' అని ఇంకోమాటు ఆయనకు గట్టిగా చెప్పి, నేను గబగబా ఇంట్లోకి వచ్చేశాను, కుర్చీలూ అవీ, సర్దటానికి.

పెద్దమనుష్యులను రిసీవ్ చేయటానికి తగినపద్ధతిలో కుర్చీలుసర్ది వాకిట్లోకి వెళ్ళేసరికి మావాడు ఎదురై గబగబా నడుస్తూ ఒక్కగుక్కలో- వచ్చారు బావా- అంటూ లోపల అడుగు పెట్టాడు. నేను అక్కడే నుంచుని అవర్తి కడివైపు తిరిగి వెళ్ళండి అని సంజ్ఞ చేశాను.

నామాట వినకుండా ఆయన మళ్ళీ ఇంట్లోకి ప్రవేశిస్తూ మావాణ్ణి అడిగాడు రమ్మంటారా అని. మావాడు ఆయనకు ఎదురుగా వెళ్ళి, వినయంగా

నమస్కరించి, నేను తమకోసం రైలుదగ్గరకు వెళ్ళాను. మీరు కారులో ముందుగా వచ్చారని గుమాస్తా చెప్పిందాకా నాకు తెలియనే తెలియదు" అన్నాడు.

"తమరు వచ్చి చాలాసేపు అయిందా ఏమి టండీ! క్షమించండి" అంటూ ప్రాధేయ పడటం చూచి నేను నిర్ఘాంతపోయినాను. స్టేషనునుంచి మా వాడితో వచ్చింది గుమాస్తా, అనీ, ఈయనే అధికారి అనీ అప్పటికి నాకు తెలిసింది. నిలువునా నీరై పోయినాను. నోటమాటకూడా రాలేదు.

నేను ఆస్థితిలో ఉండంగానే మావాడు ఆయనను నాకు ఎరుకపరచాడు. నేను ఆయనకు షేక్‌హాండ్ ఇవ్వాల్సింది మరిచిపోయి కలయో, వైష్ణవ మాయయో అన్నస్థితిలో ఉన్నాను. ఆయన నాచెయ్యి పట్టుకొని గట్టిగా ఊపి "మీ బావగారు, వీరేనా! పేరు విన్నాను. ఎప్పుడూ చూడలేదు." అని గట్టిగా నవ్వాడు.

అమ్మాయి తయారుచేసిన ఫలహారాలూ, కాఫీ, ముందుకు వచ్చినై. అందరూ సంతోషంతో కానిస్తున్నారు. నేను అయోమయస్థితిలో ఉన్నాను. ఆయన కులాసాగా ఏవో ప్రశ్నలు అడుగుతున్నాడు. మావాడు ఏదో వినయంగా సమాధానాలు చెబుతున్నాడు. నాకు మాత్రం ఆనందంగా లేదు. ఏదో గొప్ప తప్పు చేసినవాడిలాగ నేను బాధ అనుభవిస్తున్నాను. చివరకు ఆ అధికారి మావాడివంక తిరిగి "ఏమయ్యా, నీవు టీపార్టీలకూ వాటికీ తరుచు వెళ్ళుతూ ఉంటావా? అని అడిగాడు. ఈఅడగటం మామూలు ప్రశ్న అడిగినట్లు లేదు. ఏదో ఎత్తిపొడుపు మాటలాగ ధ్వనించింది.

"ఎప్పుడైనా వెడుతూ ఉంటా నండి! ఇవ్వాళ రెండు గంటలకు ఓ టీ పార్టీకి వెళ్ళాను. అక్కడినుంచే యకాయకిని స్టేషనుకు వచ్చేశానండి" అన్నాడు మావాడు.

"అది సరే. కొంపా గోడీ, ఏమీ పట్టించుకో కుండా తిరుగుతూ ఉంటావుటగా!" ఈప్రశ్నలో కొంచెం వేడి ఉన్నట్లు తెలిసిందిమాకు.

"ఎవర్నో, లేదండీ" అంటూ మావాడు తెల్లపోయినాడు. "లేదనలేవు, రాత్రిళ్ళు నీవు ఇంటికి రావని, వచ్చినా ఏ ఒంటిగంటకో వస్తావనీ, నాకు తెలుస్తున్నది" అని అన్నాడాయన కీచు, దర్జా, ఉట్టిపడుతున్న కంఠస్వరంతో. నాకు భయం వేసింది. అవమానంతో కుంగిపోయినాను.

"పచ్చి అబద్ధం అండీ! ఎవరండి ఇల్లాంటి సంగతులు మీకు చెప్పింది? దుర్మార్గం లేనిపోనివి అల్లాగ చెప్పటం కేవలం దుర్మార్గం" అని మావాడు గోల పెట్టాడు.

ఆ ట్యాంకి అధికారి వాడవంక ఇంకా కొరకొరా చూస్తూ "దుర్మార్గం నీదిలాగ కనపడుతున్నది. నిన్ను గురించి ఇల్లాగ చెప్పింది మామూలు మనిషి కాదు. చాలా పెద్దమనిషి" అన్నాడు కీచుగా.

"ఎవరండీ ఆ పెద్దమనిషి! నన్ను గురించి నా అధికారులతో ఇల్లాంటి అబద్ధాలు చెప్పినవాడు ఎల్లాంటి పెద్దమనిషో చూస్తాను, ఆయనను నా ఎదటకు తీసుకురండి" అని మావాడు విసుగ్గా అన్నాడు.

"ఎదటకు తీసుకురావటం ఎంతసేపు! కాని నీవు ఇల్లాగ ఇల్లు పట్టకుండా తిరుగుతున్నావే, ఆఫీసు పనులు నిలకడగా చేస్తావని ఎల్లాగ నమ్మటం?" ఈ మాటలు ఆయన అధికారిలాగా అన్నాడు.

మావాడు కలతపడ్డాడు. లొంగిపోయి, "పచ్చి దండి. ఆ చెప్పిన ఆయనను పిలిపించి న్యాయం విచారించాలి," అని ప్రాథేయపడ్డాడు.

నేను ఏం చేయాలిసింది తోచలేదు. అంతకు ముందు నేను చెప్పిన పచ్చి అబద్ధాలు అన్నీ ఒప్పుకొంటే నేను అధికారి దృష్టిలో పచ్చి దుర్మార్గుణ్ని అయిపోతాను. కాదు, నేను చెప్పినదంతా నిజమే అని నిలవతొక్కుకుంటే మావాడిమీద ఆయనకు కోపం రావచ్చు. అందుకని ఏమీ మాట్లాడకుండా ఊరుకొన్నాను.

చివరకు ఆయన మావాడిని అడిగాడు, "నిన్ను గురించి ఈ మాటలన్నీ నాకు చెప్పింది ఎవరో తెలుసునా?" అని.

మావాడు మాట్లాడ లేదు. "ఇదుగో ఈయనే, మీబావగారే!" అని నావంక చూపాడు.

పిడుగు పడ్డట్లు అయింది, మావాడు నిర్ఘాంతపోయి నావంక విచిత్రంగా, జాలిగా, చూశాడు. నేనే కాస్త ధైర్యం తెచ్చుకొని "ఒక్క పొరపాటు జరిగిందండి. మిమ్మల్ని......"

అని ఏదో చెప్పబోతుంటే ఆయన నామాటకు అడ్డొచ్చి "నాకు తెలుసు లెండి మీరు పొరపడటం నేను గ్రహించకపోలేదు. ప్రయాణంలో మాసిపోయిన బట్టలూ, నేనూ, పెద్దమనిషి అని అనుకొనే స్థితిలో లేకపోవటం మూలాన మీరు పొరపడ్డారు. అయినా ఒకరితో మట్టుకు లేనిపోని అబద్ధాలన్నీ చెప్పటం తప్పు కాదండీ!" అన్నాడు.

"తప్పేనండి పొరపాటు అయిపోయింది." అని నేను నొచ్చుకొన్నాను.

ఆయన విరగబడి నవ్వాడు.

కాసేపు అయినతరువాత నవ్వు ఆపుకొని అన్నాడు: "ఇల్లాగ మీరు అబద్ధాలాడటం ఇది మొదటిసారి కాదు. నేను చాలారోజులనుంచి చూస్తున్నాను. మీరు వ్రాసిన దంతా చదువుతున్నాను. మహాకవికంటే ఎక్కువగా అబద్ధాలాడుతున్నారు" అన్నాడు.

ఈమాటలు విని నే నేమీ మాట్లాడ లేకపోయినాను. ఆతరువాత ఆయన మావాడివంక తిరిగి కోపంగానే చూస్తూ "అయితే నీవు బ్యాంకిలో ఉద్యోగంచేస్తూ ఊళ్ళో బాకీలు చేస్తున్నావు! బాగుందా ఇది!" అన్నాడు.

"ఎక్కో! ఎక్కడా బాకీలు లేవండి. ఒక్కబియ్యపు వర్తకుడికే యాభై ఇవ్వాలి. నాకు రావలసిన సొమ్ముకూడా చూస్తే ఈబాకీ ఒక లెక్కలోది కాదని తమకు తెలుస్తుంది. నాకు పొలాలమీద రావాల్సిన రెండువందల రూపాయలు రైతులు ఇంకా తెచ్చి ఇయ్యలేదు. ఆసొమ్ముకోసమే చూస్తున్నాను. ఈవారంలో తప్పక వస్తుంది. రావటంతోనే ఈబాకీ తీర్చేస్తా నండి." అని మావాడు వినయంగా సమాధానం చెప్పాడు.

ఈసమాధానం విని ఆయన ఏమాత్రం తృప్తి పడ్డట్లు కనిపించలేదు. అయినా ఏదో సందేహం బాధిస్తున్నట్లు స్పష్టంగా కనిపించింది. ఏదో ఆలోచిస్తున్నాడు. ఎందుకో విసుగ్గా ఉన్నట్లుంది.

ఆయన వైఖరి చూస్తే నాకూ భయం వేసింది. ఆయన అన్నమాట నిజమే. బ్యాంకిలో ఉద్యోగం చేస్తూ, ఊళ్ళో అప్పులు చేయటం తప్పే. దీన్ని మనస్సులో పెట్టుకొని ఆయన మావాడికి ఏదైనా అపకారం చేస్తాడేమో నన్న భయం నన్ను చాలా బాధ పెట్టింది. నేను చేసిన పొరపాటువల్ల కదా ఇంత అవస్థ వచ్చింది అనుకొని కష్టపడ్డాను. మావాడూ విచారపడుతున్నాడు. అధికారి విచారపడుతున్నాడు.

౪

ఇంతలో ఎవరో ఒకాయన చేత్తో ఒక పుస్తకం పట్టుకొని వచ్చి, గుమ్మంలో నుంచున్నాడు—ఎవరో చాలామంది ఉన్నారూ మనం వెళ్ళటం బాగుండదు—అని ఆయన అనుకొని ఉంటాడు. లేకపోతే అంతసేపు గుమ్మంలో నుంచోవలసిన పని లేదు. ఆయన వాలకం చూచి బియ్యపు వర్తకుడు ఆయనే అనుకొని మావాడి వంక చూశాను. వాడు మొదట ఆశ్చర్యపడి తరువాత తెల్లపోయినాడు. ఆ అధికారి నావంక ఓసారీ మావాడి వంక ఓసారీ చూచి అక్రొత్తగా వచ్చింది ఎవరైందీ గ్రహించాడు.

ఎవరికోసం? అని అధికారి అక్రొత్తగా వచ్చిన ఆయనను అడిగాడు. పంతులుగారికోసం అంటూ ఆవర్తకుడు మాబావమరిదివేపు చెయ్యి చూపాడు. దాంతో అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది ఆయన ఎవరు అయిందీ.

ఎల్లాగూ అందరికీ తెలిసిన విషయమే కదా, ప్రత్యేకంగా జరగబోయే ప్రమాదం ఏమీ లేదు అనుకొని నేనే ఆయనను కూర్చోమని కుర్చీ చూపిం

వాడు. ఫలహారం ముందు పెట్టి కాఫీకూడా ఇచ్చాను. ఆయన నవ్వుతూ చూస్తున్నాడు. మావాడు మట్టుకు పది లంఖణాలు చేసి, ఆరోజునే పథ్యం పుచ్చుకొన్నవాడి ముఖం పెట్టాడు. ఆయన బియ్యపువర్తకుడూ, దళ్ళా అవతారాలు వచ్చాడనూ అన్నసంగతి గ్రహించినప్పటినుంచీ, ఆ అధికారి విషాలు కక్కుతున్నాడు.

నేను ఈ విచిత్ర సంఘటనను గూర్చి ఆలోచించటం మొదలుపెట్టాను. అధికారిని అను కొన్నట్లు గౌరవించ లేకపోయినాను. కటువుగా మాట్లాడి పంపేద్దా మనుకొన్న షావుకారుకు కుర్చీ యిచ్చి గౌరవించాను. మనం అనుకొన్నది అనుకొన్నట్లు జరగక వ్యవహారం తలక్రిందు లౌతుంటుంది గదా అనుకొంటూ కూర్చున్నాను.

మావాడు ఏమీ మాట్లాడలేదు. నిశ్చేష్టుడై పోయినాడు తలవంచుకొని కాఫీ తాగుతున్నాడు. అధికారి కప్పు చేత్తో పట్టుకొని కాఫీతోపాటు కోపాన్నికూడా కొంచెం కొంచెంగా మింగుతున్నాడు.

బియ్యపువర్తకుడు తనకాసంగతి ఏమీ ఇంతవరకూ తెలీదు. ఉరికే నవ్వుతూ కాఫీ పుచ్చుకొని మావాడిని పలకరించి "వీరు మీ బావగారా?" అని కన్ను చూపుతూ అడిగాడు. అవునని మావాడు తల ఊపాడు. బ్యాంకు అధికారివంక చూస్తూ "వారు బంధువులా?" అని ఇంకో ప్రశ్న వేశాడు. కాదు, మన బ్యాంకి అధికారు లని మావాడు చెప్పాడు. షావుకారు ఆశ్చర్య పోయి, అల్లాగా అండీ, నమస్కారం, అంటూ వినయం కనబర్చాడు.

పలుకుబడిలో వారి సంగతి ఎత్తకపోవటంవల్ల షావుకారు మేం మను కొన్నంత చెడ్డవాడు కాదని తెలిసింది. అధికారిమట్టుకు కోపంగానే ఉండి చివరకు మావాడివంక తిరిగి, "వీరు ఎవరు?" అని అడిగాడు షావుకారును

*బియ్యపు వర్తకులు.

"ఎంత బాకీ పడింది నువ్వు?"

"యాభైరూపాయలు."

"అప్పు చేశా వటయ్యా? నీకు బ్యాంకిలో ఉద్యోగం ఏమిటి, ఊళ్ళో బాకీలు ఏమిటి? ఏమీ బాగుండ లేదు. ఇల్లాగ చేస్తేనా నీ ఉద్యోగానికి నీళ్ళొదులుకో వాల్సి ఉంటుంది." అన్నాడు ఆ అధికారి ప్రతిమాటా తన దర్జాకు తగిన ఊపుతోనూ, సౌకర్యంతోనూ, వర్తకుడి ఎదుట తనదర్జా చూపటానికి ఆ అధికారి ఈమాటలు అని ఉంటాడు లేకపోతే ఇదివరలో ఒకసారి ఇల్లాగ అనికూడా, మళ్ళీ ఇప్పుడు అనడం అవసరం లేదు.

"తీర్చి వేస్తా నండి వారం రోజులలో" అన్నాడు మావాడు.

"తీరుస్తా వనుకో. కాని నీవు అప్పు చేయకూడదు. అసలు ఈవిషయం నా చెవిని పడకుండా ఉండవలసింది, పడ్డతరువాత దీని విషయమై యాక్షన్ తీసుకోక తప్పదు" అని కఠినంగా అన్నాడు అధికారి

మావాడు ఏదో చెప్పలేని బాధ పడుతున్నాడు. దీని కంతా కారణం నేను చేసిన పొరపాటు గదా అని నేనూ విచారపడుతున్నాను. నా చెవిని ఎందుకు పడ్డదా ఈవిషయం అని ఆ అధికారీ లోపల విచారపడుతున్నట్టు ఊహించవచ్చు.

సాహుకారుకు మట్టుకు ఈ గొడవ ఏమాత్రం తెలియలేదు. కొంతసేపటి దాకా అధికారి అన్న కఠిన వాక్యాలు విని ఆయన ఉలిక్కి పడ్డాడు. పాలిపోయిన మొఖంతో ఆ సాహుకారు ఆ అధికారివంక తిరిగి అన్నాడు: "ఏమండీ, పంతులుగారూ, నాకు బాకీ ఉన్నా రన్న విషయాన్ని గురించేనా తమరు మాట్లాడు తున్నది?"

"అవును, నీబాకీ విషయమే."

"ఆయన నాకు బాకీ ఉన్నా రని తమకు ఎవరు చెప్పారు?"

"ఎవరు చెపితే ఏం? ఆయన బావగారు చెప్పారు."

"శక్తి అబద్ధం అండి, ఆయన చెప్పింది. ఆయన మాటలే నమ్మారా!" అన్నాడు సాహుకారు దీర్ఘాలు దీస్తూ.

నాకు వచ్చినచావు అయింది. వీడుకూడా నేనేదో అబద్ధం కల్పించి చెప్పాననేసరికి. పాపం అధికారే నాపాలిటి దేవుడై అసాంతమూ విలవదీసి అడిగాడు. "ఆయన అబద్ధం ఆడుతున్నాడు అంటూ వేదయ్యా? నారాయణమూర్తిగారు మట్టుకు అనటంలేదా బాకీ ఉన్నమాట నిజమేనని?"

"పాపం పంతులుగారికి మతి పోయి చెప్పారు. వారు నాకు ఒక్క దమ్మిడీ అయినా బాకీ లేరు" అన్నాడు సాహుకారు.

అందరం పిచ్చిచూపులు చూశాము సాహుకారుకు ఏమన్నా పిచ్చి ఎక్కలేదు గద అనుకొన్నాము. ఒక్కక్షణం అయిన తరువాత మాకు ఒకటి తోచింది. మావాడి ఉద్యోగానికి ముప్పు వస్తుందని సాహుకారు ఎత్తిన ఎత్తు ఇది అనుకొన్నాము; అనుకొని సంతోషించాము. అధికారి మట్టుకు ఈమాత్రం ఊహించలేడా? ఊహించికూడా ఏమీ అనలేక ఊరుకొన్నాడు. ఎవ్వరం ఏమీ మాట్లాడలేదు.

నిశ్శబ్దం. ఎంతసేపు? అరనిమిషం. ఇంతలో అధికారి; ఏదో జ్ఞాపకం వచ్చిన వాడిలాగ చివుక్కున విసురుగా తల ఎత్తి సాహుకారు వంక చూస్తూ "మీకేం బాకీ లేనే లేదా! ఏది పుస్తకంలో జమ ఉందేమో చూడనీ" అన్నాడు. మంచి ప్రశ్న. అధికారి కూడా చాలా తెలివైన వాడు అనుకొన్నాము.

వర్తక శిఖామణి ఎత్తిన ఎత్తు గొప్పదే కాని అధికారి ఇల్లాగ పుస్తకం చూపమని అడుగుతాడని ఊహించి ఉండడు. అందుకని కాపీ చేస్తుండంగా పట్టుబడ్డ స్కూలు కుర్రాడులాగ తెల్లముఖం వేస్తాడని అందరం ఒక్కసారి అటు చూశాము.

వర్తకుడు తెల్లముఖం వెయ్యలేదు. ధైర్యంగా, నిశ్చలంగా చూడండి కావలిస్తే—అంటూ పుస్తకం ఆయనకు అందించాడు. నేనూ, మావాడూ,

అధికారీ, అక్కడున్న వాళ్ళం అందరం కూడా, ఆకాశంలోనుంచి, ఏదో, విచిత్రవస్తువు కిందికి దిగుతూ ఉంటే, అది బాంబా, విమానమా, మనిషా, బొమ్మా, అని ఎంత విస్మయంతో చూస్తామో అంత విస్మయంతో చూశాము ఆ పుస్తకంవంక.

అధికారి పుస్తకాన్ని ఇంకా సందేహంతోనే అందుకొని, పేజీ తీసి, తాను చదువుకొని నవ్వుకొన్నాడు. అసలు సంగతి ఏమిటో చెప్పకుండా ఆయన ఒక్కడే ఆనందించటం నాకు కష్టంగా ఉండి, ఊరుకోలేక — నిజమేనా అండీ? జమ ఉందా?— అని అడిగాను ఆదుర్దాగా.

అప్పటికీ ఆయన స్పష్టంగా జవాబు చెప్పక అవునన్నట్లు తల ఊపుతూ నవ్వాడు. నవ్వి మావాడి వంక చూశాడు.

ఆ తరువాత నన్ను జూచి నవ్వాడు. ఇట్లా నవ్వడం వల్ల నాకేదో సందేహం కలిగింది. జమ ఉంటే, ఉంది అని చెపితే సరి పొయ్యేది. ఆయన అట్లా చెప్పక ఊరికే అందర్నీ జూచి నవ్వటం సాగించాడు.

అందరికీ ఏమైనా అర్థం అయిందా అంటే ఒక్కరికీ నిజం ఏమి టైందీ తెలిసి నట్టు లేదు. అంతా ఆయనకు గుడ్లు అప్పగించి తెల్లపోయి చూస్తున్నారు.

ఎంత సేపని ఊరుకో గలను? చివరకు నేనే నోరు తెరుచుకొని మా వాడ్ని అడిగాను; "ఏం రా ఇచ్చి మరిచి పోయినావా ఏమిటి"—అని

"ఎన్నే న నివ్వలేదు. బాగా జ్ఞాపకం. నేను డబ్బుకు సంబంధించిన విషయాలు ఎప్పుడూ మర్చిపోను—" అని వాడు ఘట్టిగా చెప్పాడు.

అందరం తెల్లపోయినాము. ఏమీ బాకీ లేకపోతే ఆయన అల్లాగ బాకీ కోసం తిరగటం ఎందుకు సంభవించింది? బాకీ ఉన్నట్లయితే జమ ఎట్లా పడి ఉంటుంది! ఈ ప్రశ్నలకు సమాధానం ఏమీ తోచలేదు. ఒక్క రెండు నిమిషాలసేపు అందరం ఆ అధికారి వంక చూస్తూ కూర్చున్నాము.

ఈ పరిస్థితులు చూచి వర్తకుడు అప్పటి కప్పుడు జమ కట్టటానికి సిద్ధ

మాత్రం అవకాశం లేదు. అయినా, తెలుసు కొందా మని "జమ ఎప్పుడో చూడండి" అని అడిగాను అధికారిని. ఆయన నవ్వుతూ "సాహుకారు చేసిన మోసం ఏమీ లేదు. ఇరవై రోజుల క్రితం జమ పడ్డది" అన్నాడు. ఈ తమాషా ఎట్లా జరిగిందో ఎవ్వరికీ తెలియలేదు.

"ఏమిటయ్యా ఈ నాటకం?" అని నేను సాహుకారునే అడిగాను. ఆయన "పుస్తకంలో ఏమి వ్రాసి ఉందో పంతులుగారినే చదవ మనండి తెలుస్తుంది" అన్నాడు.

అందరం అధికారి వంక తిరిగాము "చదవండి తొందరగా" అన్నట్లు.

—

అధికారి "ఇక్కడ ఉన్నది చదువుతాను వినండి. ఈ బాకీ గాను, నారాయణమూర్తి గారి భార్య ఇచ్చిన రొఖ్ఖం యాభై రూపాయిలు, అక్షరాలా యాభై రూపాయలు" అని చదివి ఊరుకొన్నాడు.

విస్మయం, ఆనందం తోసుకొన్నాయి మా హృదయాల్లో. అందరికంటె మా వాడు ఎక్కువగా ఆశ్చర్యపోయినాడు. ఒక్క నిమిషం ఎవ్వరం నోరు విప్పలేదు. ఏవిధమైన శబ్దమూ చెయ్యలేదు. మరుక్షణంలో చీకట్లను చీల్చుకొని వచ్చిన మెరుపుల్లాగ అందరి ముఖాలపైన చిరునవ్వు మెరిసింది. మెరుపుల వెంట ఉరుములు. అందరూ విరగబడి నవ్వారు.

అందరితో బాటూ మా వెంకన్న నవ్వాడు ముందట. కాని వెంటనే వర్తకుడ్ని కొరకొరా చూస్తూ అడిగాడు; "ఏమయ్యా, సొమ్ము ముట్టిన తరువాత కూడా, ఆ సంగతి నాకు చెప్పక, అల్లాగ, కాళ్ళు అరిగే దాకా నన్ను తిరిగి సొమ్ము ఇమ్మని వేధించావు! నిజంగా బాకీ ఉన్నప్పుడు ఎప్పుడూ అడిగి ఎరగవు! బాకీ లేనప్పుడు ఇల్లా బాధ పెట్టావు, ఏమిటది!" ఈ అనటం కోపంగానే అన్నాడు.

"ఇదివరకు అంటే నా స్వంత బాకీ కాబట్టి మీరు ఎప్పుడు ఇచ్చినా పుచ్చుకొన్నాను. సొమ్ము అందటంతోనే మీరు ఇస్తారని ధైర్యం. ప్రత్యే

కంగా అడగటం అవసరం లేకపోయింది. ఆరోజున ఏదో అవసరం వచ్చి అడగ్గానే, అమ్మాయిగారు, బాకీ మొత్తం యావత్తూ నాకిచ్చి, మళ్ళీ ఆ సొమ్ము యావత్తూ మీ వద్దనుంచి వసూలు చేయమని కోరారు. ఆమె గారు ఇచ్చా రని చెబితే మీరు మళ్ళీ ఇయ్యరు. అందుకని ఆవిషయం మీకు చెప్పలేదు. కాని మీరు నాకు బాకీ లేకపోయినా ఆమెకు బాకీ పడ్డారు. అమ్మాయిగారికి ఇవ్వాల్సిన సొమ్ము కోసమే నేనంతగా తిరిగింది. నాసొమ్ము కోసమైతే తిరగనే తిరగను అన్నాడు. అంతా విని నవ్వుకొని ఊరుకొన్నారు.

౫

సాహుకారు పాపం, అమాయకంగా, అధికారి మావాడికి అపకారం ఏమైనా చేస్తా డేమో నన్న భయంతో ఉన్నది ఉన్నట్లు చెప్పాడు: అందులో ఏమీ సందేహం లేదు. ఈసంగతి అంతా విని అందరూ మరోసారి నవ్వుకొన్నారు. చాలా తమాషా అయిందనుకొన్నారు. అంతవరకు బాగానే ఉంది.

దానితరువాత జరిగినకథే నాకు కష్టం కలిగించింది. సాహుకారు సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయినాడు. అధికారి మావాడితో అన్నాడు; "నీవు ఏదో బాకీ వేశా వని నాకు తెలియటం మూలాన, నేను స్నేహారీత్యా నిన్ను మందలించాను గాని మరోటి కాదు. పెద్దవాడిని కాబట్టి నీకు మంచిమాట చెప్పాను. నేను అన్నమాటలు మనస్సులో ఉంచుకోకేం!" అని.

మావాడు ఆయనతో "తమ కేం తెలుసూ? అయినా తమరు అన్నదీ ఏమీ లేదు" అని నవ్వి ఊరుకొన్నాడు.

"నారాయణ మూర్తిగారికి, పాపం, ఏమీ తెలియదు. భార్య బాకీ తీర్చిన విషయమూ తెలియదూ, ఆయన బావగారు ఈసంగ తంతా తమకు

చెప్పిన విషయమూ తెలియదు! పాపం ఆయన అనవసరంగా భంగారు పడటం సంభవించింది." అన్నాడు గుమాస్తా అధికారితో, అందరికీ వారి విషయంలో పొమధూళి కలిగేలాగున. అందరూ నాడ్ని చూచి జాలిపడ్డట్లు చూపులు చెపుతూ ఉన్నాయి.

అసలు ఈగంభోకు అంతా మూలకందం మా వాడి భార్య. ఇట్లా సంగతి అని మాటమాత్రం అన్నా నాకు చెప్పలేదు. ఇంత గ్రంథం జరుగుతూ ఉంటే ఊరుకొని ఉంది కాని అసలు రహస్యం బయట పెట్టలేదు. ఆ అమ్మాయిని ఇదేమని ఒక్కరూ ఒక్కమాట అయినా అనలేదు. పైగా చాలా తెలివైంది అని మెచ్చుకొన్నారు.

ఇక మిగిలిపోయింది నేను. నా సంగతి ఒక్కరూ ఎత్తలేదు. "పాపం, ఈయన అన్యాయంగా ఫూల్ అయిపోయినాడు" అని ఒక్కరూ — ఒక్కరైనా జాలి చూపలేదు.

వారి పొమధూటని అనిస్తూ, చివరకు నేనే అన్నాను: ఇంతకూ, నేను మిమ్మల్లను చూచి వర్తకుడు అనుకోటం వల్ల, ఇంత గొడవ జరిగింది అనుకోండి. కాని ఇందులో నా తప్పు ఏమీ లేదు అల్లాగ ఎందుకు అనుకోవలసి వచ్చిందంటే... అని చెప్పబోతుంటే, వాళ్ళు వినక, ఎల్లా సంభవిస్తే ఏం, తెలిసింది కథ నడిచారు. అని నవ్వారు ఈ గొడవంతా నేను కావాలని తెచ్చిపెట్టినట్టు.

# పరిచయము

**తల్లావజ్ఝల శివ శంకర శాస్త్రి:** కాజ గ్రామమున, మంగళగిరిక్షేత్ర సమీపము, గుంటూరు మండలము, క్రీ.శ. ౧౮౯౨ జననము. రచనలు: మురారి కథలు; నీలకంఠం కథలు. హిందీ, బెంగాలీ, కన్నడ భాషలనుంచి చాలా కథలూ, సంస్కృతమునుంచి కథా సరిత్సాగరమూ తెలిగించినాడు. ౧౯౩౮ సంవత్సరమున హైదరాబాదు నగరములో అఖిలాంధ్ర కథక వ్యక్తుల సమ్మేళనానికి అధ్యక్షత వహించినాడు. ఆల్ ఇండియా రేడియో మద్రాసు కేంద్రమున కథానికను గురించి ప్రసంగము చేసినాడు. కథలకు సకలంక ప్రాధాన్య మిచ్చిన 'సాహితి', 'సఖి', 'ప్రతిభ' మొదలైన పత్రికలకూ, సరస్వతీ గ్రంథమండలి, ఇత్యాది గ్రంథమాలికలకూ కార్యము సంపాదకుడు. వివిధ భాషలలో, శాస్త్ర, కళలలో, కృషి చేసినాడు.

**వజ్ఝ బాబు రావు:** ధూళిపూడి, గుంటూరు మండలము, జననము ౧౯౧౨ సాహితి, సఖి, భారతి మొదలైన పత్రికలలో కథలు ముద్రితములు. 'సప్తపది' అనే కథాసంపుటి ఉన్నది. బొంబాయి నగరములో SIR J. J. SCHOOL OF ART లో బహుకాలము అభ్యసించిన చిత్రకారుడు. గుంటూరు శ్రీ శారదా నికేతనములో చిత్రకళోపాధ్యాయుడుగా కొన్ని సంవత్సరాలు ఉన్నాడు.

**నోరి నరసింహ శాస్త్రి:** గుంటూరు, ౧౯౦౦ జననము. బి ఎల్. పరీక్షలో ప్యాసయినాడు. అనేక కథలు, నాటికలు, పద్యకావ్యాలు రచించినాడు ఇంగ్లీషులోనుంచి కొన్ని కథలు తెలిగించినాడు. కొన్ని స్వతంత్ర రచనలు ఇంగ్లీషులో చేసినాడు. మంత్ర, తంత్ర, శాస్త్ర నిష్ణాతుడు.

**చింతా దీక్షితులు:** తూర్పుగోదావరి మండలములో దాక్షారామప్రాంతమున ౧౮౯౧లో జననము. బి.ఏ., ఎల్.టి. దొరతనమువారి విద్యాశాఖలో ఉన్నతోద్యోగము. రమారమి వంద కథలు రచించినాడు. వటీరావు కథలు, భైరవమూర్తి కథలు, Fairy Tales, మొదలైన కథాసముచ్చయాలున్నవి. ఏకాదశి, కథావీధి, దీక్షితుల కథలు గ్రంథరూపాన ముద్రితాలు. కథక చక్రవర్తి అని ప్రశస్తి. ఈయన రచనలు హిందీలోకి, ఇంగ్లీషులోకి తర్జుమా అయినవి.

**కొడవటిగంటి వెంకట సుబ్బయ్య:** గుంటూరు మండలములో తెనాలి ప్రాంతాన ౧౮౯౩ లో జననము. చాలా కథలు వ్రాసినాడు. టాల్‌స్టాయి కథలు తెలిగించినాడు. ఓవర్‌సీయర్ ఉద్యోగము చేసినాడు. యోగసాధన చేయడానికి ౧౯౨౨ లో ఎక్కడికో వెళ్ళిపోయి ఇప్పటికీ అజ్ఞాతముగానే ఉన్నాడు.

**శ్రీనివాస శిరోమణి:** గుంటూరు మండలములో జననము. బహుకథలు రచించినాడు. 'పునర్జన్మ' అనే నవల ఉన్నది. 'పంచవటి,' 'శిరోమణి కథలు' గ్రంథరూపాన వచ్చినవి. 'వినోదిని' మొదలైన పత్రికలకు మాజీ సంపాదకుడు. జ్యోతిషములో వ్యవసాయములో ప్రవీణుడు.

**మొక్కపాటి నరసింహశాస్త్రి:** జననము ౧౮౯౨, తూర్పుగోదావరి మండలములో గండ్రేడు గ్రామము. స్కాట్లండులో వ్యవసాయశాస్త్రము అభ్యసించినాడు. బారిష్టర్ పార్వతీశం, ఏకోదరులు, ప్రతిబింబములు, (కథల సంపుటి) ముద్రితాలు. చాలా కథలు గ్రంథరూపమున రావలసినవి ఉన్నవి. ఈయన రచనలు కొన్ని అరవము, కన్నడము, ఇంగ్లీషుభాషలలోకి తర్జుమా అయినవి.

**అడివి బాపిరాజు:** ౧౮౯౫, పశ్చిమగోదావరి మండలము, సరిపల్లి గ్రామములో జననము. ౧౯ ౧౯ లో బి. ఏల్. కొంతకాలము భీమవరములో న్యాయవాది. ౧౯౩౫-౩౯ బందరు జాతీయకళాశాలా అధ్యక్షుడు. రమారమి ౪౦ కథలు రచించినాడు. కొన్ని హిందీలోకి, ఇంగ్లీషులోకి పరివర్తితాలు. హిమబిందు, నారాయణరావు, తుఫాను, ఇత్యాది నవలలూ, అనేక గేయములూ రచించినాడు. నాటక కళలో ప్రవీణుడు, శిల్పాచార్యుడు.

**వేదుల సత్యనారాయణ శాస్త్రి:** ద్రాక్షల ప్రాంతాన ౧౯౦౦ లో జననము. శతావధానాలు చేస్తూ ఆశుకవిత్వము చెప్పినవాడు. ౧౯౩౪ లో ఉభయభాషాప్రవీణ. ౧౯౪౩ లో మహాకవి ఉపాధి. కథలు రచించడమే కాక, వంగభాషనుంచి అపరాధిని, ధర్మపాలుడు, రంగమహల్, మొదలైన నవలలు తెనిగించినాడు. 'రాణాప్రతాప్' స్వతంత్ర నాటకము. పెద్దాపురములో మిషన్ హైస్కూలులో పండితుడు. దీపావళి ఆదిపద్యకావ్యములు, కొన్ని సినిమా నాటికలు రచించినాడు.

**విశ్వనాథ సత్యనారాయణ:** కృష్ణామండలము, నందమూరు గ్రామంలో ౧౮౯౫ లో జననము. ౧౯౨౯ లో ఎం. ఏ. ౧౯౪౧ లో కవిసమ్రాట్ ఉపాధి. కొంతకాలము బందరు జాతీయ కళాశాలలోను, గుంటూరు క్రైస్తవ కళాశాలలోను ౧౯౩౮ నుంచి బెజవాడలో ఉయ్యూరు రాజావారి కళాశాలలోను ఆంధ్రోపన్యాసకుడు. మాబాబు, హాహా హూహూ, జేబుదొంగలు, మొదలైన అనేక కథలు, ఏకవీర, వేయిపడగలు, చెలియలికట్ట మొదలైన నవలలు, అనేక నాటక పద్యకావ్యములు, రామాయణము రచించినాడు. బహుళ గ్రంథకర్త. వేదాధ్యయన రతుడు. ఈయన రచనలు కొన్ని హిందీ ఇంగ్లీషు భాషలలోకి పరివర్తితములు.

తము. ఈయన రచనలలో 'శుద్ధాంతకాంత' అనే నవల, ఉద్భల విషా దము, తుకారాము అనే నాటకములు, విమర్శలు, జీవితచరిత్రలు అనేక మున్నవి. సంస్కృత ఉర్దూ భాషలలో ప్రవీణుడు.

**వింజమూరి శివరామా రావు:** తూర్పుగోదావరి మండల పిఠాపురములో ౧౯౦౮ లో జననము. కాకినాడ కళాశాలలో బి. ఏ. చదివినాడు. 'మహాసాం' కథలు తెనిగించినాడు. 'ఆకలి' కథలు మొదలైనవి, చాలా పద్య కావ్యములు, నాటకములు రచించినాడు.

**మునిమాణిక్యం నరసింహా రావు:** గుంటూరు మండలములో క్రీ. శ. ౧౮౯౮ లో జననము. బి. ఏ., యల్. టి. బందరు హిందూ కళాశాలా హైస్కూలులో ఉపాధ్యాయుడు. చాలా కథలు, నవలికలు, కావ్యగ్రంథములు, నాటికలు రచించినాడు. కాంతం కథలు, కాంతం కైఫీయత్, ఉపాధ్యాయుడు, దొరబాబు, మేరీ కహానీ ఇత్యాదులు ముద్రితములు. కొన్ని రచనలు హిందీ అరవ భాషలలోకి పరివర్తితములు.



